# అపరాధ పరిశోధన

రు. 2 ఫిబ్రవరి '74

## సప్లిమెంట్-2



అపరాధ పరిశోధన సప్లిమెంట్—2

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## హంతకుడి వేట!

రచన: కంచర్ల రమణ

## చావు కాచుకో?

రచన: మిస్. మధుబాల

## యురేనియం-235

రచన: కె. శివరామ్

## ప్రత్యర్థి కావాలి!

రచన: మల్లాది వెంకటకృష్ణమూర్తి

అపరాధ పరిశోధన సప్లిమెంట్—2
ఫిబ్రవరి, 1974
వెల 2 రూపాయలు
ఏడాది చందా 26 రూపాయలు
30-3-'74లోగా పంపితే 18 రూపాయలు

ఎడిటర్, పబ్లిషర్
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
మల్లాది వెంకటకృష్ణమూర్తి
వాసవదత్త
కంచర్ల రమణ
ఏ. వీ. మోహన్రావ్
కె. శివరామ్
ఉప్పలూరి ఉషారాణి
మిస్. మధుబాల

కార్యాలయం
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్ నెంబరు—36959

ముద్రణ:
క్రాంతి ప్రెస్
12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్
మద్రాసు-600 001

# మీరే ఎన్నుకోండి? 61

ఈ "సప్లిమెంట్"లో మొత్తం నాలుగు చక్కటి నవలలు ప్రచురించబడ్డాయి. నాలుగు మీ అభిమాన రచయితలు రాసి నవే. వీటిలో మీకు అత్యుత్తమంగా తోచిన నవలపేరు ఒకటవ నెంబరు ప్రక్కన వ్రాయండి. తర్వాత వరుసక్రమంలో మీకు నచ్చిన మిగతా మూడు నవలల పేర్లు పూరించండి. పాఠకుల ఎన్నిక ప్రకారం అత్యుత్తమ నవల నిర్ణయించబడుతుంది.

పాఠకులు ఉత్తమ నవలగా నిర్ణయించిన ఆ నవలా రచయితకు రు. 116/-లు ప్రత్యేక బహూమతి ఇవ్వబడుతుంది. మొత్తం నాలుగు నవలల ఎన్నికను సరైన వరుసక్రమంలో చెప్పగలిగిన పాఠకులకు ఒక్కొక్కరికి రు 10/-లు చొప్పున నగదు బహూమతి పంపగలము.

ఫిబ్రవరి '74 నెల మేము మెచ్చిన నవలల వరుసక్రమం ఇది:

1. - - - - - - - - - -
2. - - - - - - - - - -
3. - - - - - - - - - -
4. - - - - - - - - - -

పై కూపను కొట్టివేతలు లేకుండా పూర్తిచేసి, యీ పేజి పూర్తిగా కత్తిరించి, యీ నెల 10 వ తేదీలోగా మాకు చేరే టట్లు పంపండి. మీ చిరునామా వెనుకప్రక్కన రాయండి. ఫలితాలు వచ్చేనెల "అపరాధ పరిశోధన" మాసపత్రికలో ప్రచురించబడుతాయి.

అట్టమీది బొమ్మ:
పొడిచి చంపకు!

అట్టచివరి బొమ్మ:
పగ పెంచకు!!

# హంతకుడి వేట!

కంచర్ల రమణ

"సరూ! సరూ!"

హుషారుగా యింట్లో అడుగుపెడ్తూ కేక వేశాడు హరి.

ఆశించిన జవాబు రాకపోయేసరికి, ఆశ్చర్యపోయాడు.

చేతనున్న సూట్ కేసు నడవలో ఉన్న టేబిలుమీద పడేసి లోపలికి వెళ్ళాడు.

సరోజ కన్పించలేదు. కనీసం అత్తయ్యా, మామయ్యలైనా కన్పించలేదు. నౌకర్లు సరేసరి. అందరూ కలిసి మూకుమ్మడి శెలవు తీసుకున్నట్టు ఒక్కరూ అగుపడడం లేదు.

తను శెలవుమీద ఎప్పుడు బొంబాయినుంచి వచ్చినా పెద్ద అట్టహాసం చేస్తారు అత్తయ్య, మామయ్య. యిహ, సరోజ సంగతి చెప్పనక్కరలేదు. నానాగొడవ పెట్టేస్తుంది.

కార్లో రైల్వేస్టేషనుకు వస్తుంది. తనో వి. ఐ. పి. అయినట్లు మెడలో దండలేసి రిసీవ్ చేసుకుంటుంది.

"అయ్యో! అదేమిటి బావా? అలా చిక్కిపోయావ్. తిండి మానేసి గాలిమీద మనుషులు బ్రతగ్గలరో లేదో, అని పరిశోధన చెయ్యటం లేదుకదా! కొంపదీసి?"

అంటుంది. సంవత్సరంలో పదిసార్లు శెలవుపెట్టి యింటికి వచ్చినా అవే మాటలు అంటుంది. అత్తయ్య అయితే, తనను చూసీచూడ్డంతోటే, ఆప్యాయంగా "హరీ! యేమిట్రా యిది? నీ ఆరోగ్యం గురించి నీకే యింత అశ్రద్ధ అయితే ఎలారా?" అంటూ, కళ్లు ఒత్తుకుంటుంది.

శెలవు అయిపోయి బొంబాయి తిరిగి వెళ్ళిపోయినప్పుడు కూడా యింత హంగామా జరుగుతుంది. అయితే, అందులో చిన్న తేడా మాత్రం ఉంది. తను శెలవుమీద వచ్చానన్న 'సంతోషం' స్థానంలో 'దుఃఖం' చోటు చేసుకుంటుంది.

"మళ్ళా ఎప్పుడొస్తావు బావా?" అంటుంది సరోజ మొహం దిగులుగా పెట్టి.

"బొంబాయి పోయి ఆఫీసరు గిరీ వెలగబెట్టడం ఎందుకు గానీ, యిక్కడే,యేదో ఉద్యోగం చిన్నదయినా చూసుకో కూడదుట్రా?"

అంటాడు మామయ్య మధ్య మధ్య కనీసం నాలుగు సార్లన్నా గొంతు సవరించుకుంటూ.

"మామయ్యా! ఉద్యోగం పురుష లక్షణం అన్నారు... అయినా, నాకు తెలీక అడుగుతాను. మీరిక్కడెందుకు ఉండి పోవడం? నాతో వచ్చెయ్యకూడదూ?"

అంటాడు తను.

"అబ్బా! అబ్బా! యేం పురుషుడండీ!"

అంటూ చేతులూ, కాళ్ళూ విచిత్రంగా తిప్పుతూ అంటుంది సరోజ.

"ఒరే! అల్లుడివైనా, మేనల్లుడివైనా నువ్వేకదరా. యిదిగో సరోజ చదువయిపోగానే, మీ యిద్దరికీ పెళ్ళి చేసేస్తాం. ఆ తరువాత మీరు మమ్మల్ని ఎక్కడకు ఈడ్చుకు పోయినా, యిబ్బందిలేదు."

అంటాడు మామయ్య.

అంతవరకూ, చనువుగా, నిస్సంకోచంగా తనతో మాట్లాడే సరోజకు ఏమవుతుందోగాని, తలవంచేసుకుంటుంది. తను ఆమె మొహంలో వెలిగే భావాల్ని పట్టుకోబోతే, వాళ్ళమ్మ వెనుక చేరి, ముహం దాచేసుకుంటుంది.

అలాంటిది, యీసారి, తన ప్రయాణం మొదట్నుంచీ విచిత్రంగా ఉంది.

"వెంటనే బయలుదేరిరా!" అంటూ మామయ్య టెలిగ్రాం కొట్టాడు. ఎందుకో, యేమిటో కారణం చెప్పలేదు. తను ఇంటికి వచ్చి వెళ్ళి నెలకూడా కాలేదు. అయినా, టెలిగ్రాం ఇచ్చాడు కాబట్టి అర్జంటు విషయం ఏదో వుండివుంటుందని వెంటనే సూట్ కేసు సర్దుకుని బయలుదేరి వచ్చాడు.

తను వెంటనే బయలుదేరి వస్తున్నట్టు స్టేషను నుంచి టెలిగ్రాం యిచ్చాడు. అయినా, తన కోసం స్టేషన్‌కు యెవరూ రాలేదు. ప్రతీసారీ, వి. ఐ. పీ. ఆహ్వానం అందుకునే తనకు కష్టమనిపించింది.

ఇంటికొచ్చినా, తనను యెదురొచ్చి పలకరించలేదు యెవరూ, కనీసం నౌకర్లన్నా కనిపించి, తన సూట్ కేసు అందుకోలేదు.

క్రింద గదులన్నీ గాలించాక, మేడెక్కాడు హరి.

ఇలా మేడమీద గదిలో కాలుపెట్టాడో లేదో, "అమ్మా! సరోజా! మమ్మల్ని దగా చేసి వెళ్ళిపోయావా తల్లీ!" అంటూ హరికి అత్తయ్య యేడుపు వినిపించింది. హరి కంగారుగా లోపలకు వెళ్ళాడు.

"ఊరుకోవే! పూరుకోవే" అంటూ మామయ్య అంటు న్నా దేశాని, అతనికీ దుఃఖం ముంచుకొచ్చేస్తోంది. తువ్వా లుతో కన్నీరు తుడుచుకుంటున్నాడు.

హరి గుండె ఆగినంత పనయింది.

తన సరోజ చనిపోయిందా?

అతని కాళ్ళక్రింది భూమి తొలగిపోయినట్టు, ఉన్న పళంగా, పాతాళ లోకంలోకి జారిపడిపోతున్నట్టు అన్పిం చింది.

అయినా, అతి కష్టంమీద నిలదొక్కుకున్నాడు.

స్టేషనులో తనని రిసీవ్ చేసుకోవడానికి యెవరూ ఎందుకు రాలేదో, తను ఇంటికివచ్చేసరికి, ఇల్లంతా శ్మశానశాంతితో యెందుకుందో అప్పుడు అర్థమయింది హరికి.

సరోజ చనిపోయిందంటే, హరికి నమ్మకం కలగడంలేదు.

మువ్వలు మోగిస్తున్నట్టుగా ఆమె ఇంకా నవ్వుతున్నట్టు గానే ఉంది. రంగుల బొంగరంలా, ఇల్లంతా కేరింతలు కొడ్తూ తిరుగుతున్నట్టేవుంది. 'ఉండండి ఇప్పుడే వస్తాను' అంటూ పక్కింటికి వెళ్ళినట్టు వుందిగాని, శాశ్వతంగా తన నుంచి దూరమైపోయినట్టుగా లేదు.

"మామయ్యా!"అని పిలిచాడు హరి గొంతు పెగుల్చుకొని.

"బాబూ, యేంచెప్పనురా?...యేంచెప్పనురా? సరోజ నిద్రమాత్రలు మింగి చనిపోయింది."

అంటూ మామయ్య చిన్నపిల్లాడిలా ఏడ్వసాగాడు. హరిని చూడగానే అత్తయ్య ఏడుపు మిన్నుముట్టింది.

మీదను బాంబు పేలినట్టుగా అయింది హరికి.

"ఆత్మహత్యా!"

అడిగాడు హరి, దడదడలాడిపోతున్న గుండెల్ని అదిమి పట్టుకుని.

"దేవుడికి మనమంటే కన్నుకుట్టిందిరా హరీ! చదువుకు

చదువు, అందానికి అందం, హోదాకు హోదా, డబ్బుకు డబ్బు ఉన్న మీ ఇద్దరి అనురాగం, యీడూ జోడూ, అనుకూలత దేవుడు చూడలేకపోయాడు.''

మామయ్య మాట్లాడలేక పోయాడు. దుఃఖం అతని మాటల్ని మింగేసింది.

''సరోజకు ఆత్మహత్య చేసుకోవాల్సిన అవసరమేమొచ్చింది మామయ్యా?''

అడిగాడు హరి, మామయ్య దుఃఖం పొంగు కాస్త తగ్గాక.

''విధిరా! విధి... లేదా, నేను చేసుకొన్న పాపం'' నెత్తి కొట్టుకుంటూ అన్నాడు మామయ్య.

అత్తయ్య ఏడుపు యింకా ఉధృతమయింది. గుండె పగిలేలాగు ఏడుస్తూ, నేలమీదపడి పిచ్చిదానిలా దొర్లసాగింది.

''చెప్పు మామయ్యా! సరోజ ఎందుకు ఆత్మహత్య చేసుకొంది?''

కాసేపయాక అడిగాడు మళ్ళా హరి.

''నానోటితో చెప్పలేనురా హరీ! నీకో ఉత్తరం రాసింది సరోజ.''

అంటూ ఓ ఉత్తరం తెచ్చి హరికి అందించాడు మామయ్య.

అది చాలా పెద్ద ఉత్తరం. వణుకుతున్న చేతులతో హరి ఉత్తరం అందుకున్నాడు.

## 2

''హలో.''

సరోజ తిరిగి చూసింది.

పారలల్స్ పాంటూ, షర్టూ వేసుకుని, మొహానికి గుండ్రని రంగు కళ్ళద్దాలు పెట్టుకుని, చంకలో ఓ లెదరుబ్యాగుతో ఓ అమ్మాయి చిరునవ్వుతూ కన్పించింది.

''హలో.''

## 10

సరోజ పలకరింపు అందుకుంది.

"నా పేరు ప్రియో!...మీ పేరు?"

అందా అమ్మాయి.

"సరోజ."

జవా బిచ్చింది సరోజ.

"మిమ్మల్ని యీ స్టాపులో చాలాసార్లు చూశాను."

"ఉదయం లేస్తే, యూనివర్సిటీకి రావడం, పోవడమే పని. తరుచుగా అవుపిస్తాను యిక్కడ."

"మీరు స్టాపులో చాలా సేపటినుంచి వెయిట్ చేస్తున్నట్టున్నారు."

"అవునండీ! అరగంట అయింది. వెధవది! బస్సులు స్ట్రయిక చేస్తున్నా యేమిటో?"

అంది విసుగ్గా సరోజ.

"అయితే, యిక రావులెండి...ఏంచేద్దాం అనుకుంటున్నారు?"

"ఏముంది? పాదయాత్ర."

"నోనోనో...యింత ఎండలోనా!...మా హోటలు కారుంది. అందులో పోదాం రండి."

సరోజ మొహమాటం కనబరిచింది.

"మొహమాటం ఎందుకండీ?...అవుసరం ఉన్నప్పుడు మొహమాటం పనికిరాదు...కమాన్...ఒక ఫర్లాంగుదూరం మా హోటలు...రండి... నేను అక్కడ పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసరుగా పనిచేస్తున్నాను లెండి."

అంటూ హోటల్ శాండ్ డ్యూన్స్ వైపు దారితీసింది ప్రియో. సరోజ ఆమెను అనుసరించక తప్పలేదు.

హోటల్ శాండ్ డ్యూన్స్‌ని సరోజ ఎన్నోసార్లు బయట నుంచి చూసిందేతప్ప, లోనికిపోయి చూడలేదు.

ఆ హోటల్ గురించి తోటి విద్యార్థులు చాలావిషయాలు

చెప్పారు. రబ్బరు బంతుల్లాంటి అమ్మాయిలు స్పాట్ లైట్ వెలుగులో, ఒంటిమీదున్న బట్టల్ని ఒకటి తరువాత ఒకటి విడిచేస్తూ, చివరకు పూర్తిగా నగ్నం అయిపోయి, నాట్యం చేస్తారనీ, వాటిని చూడడానికి, పెద్దపెద్ద ఆఫీసర్లు, వ్యాపారస్తులు పెదపెద్ద మొత్తాలు చెల్లించి మరీ చూస్తారనీ విన్నది. తీరా, హోటల్ సమీపించాక "వాటెబవుట్ ఎ డ్రింక్?" అంది ప్రియో.

మాటవరుసకు "వద్దు! వద్దు!" అని సరోజ అంది కాని, ప్రియో చూపిన అభిమానాన్ని త్రోసిపుచ్చలేకపోయింది. అదేసమయంలో, హోటల్ లోపల ఎలాగుంటుందో అని కలిగిన కుతూహలాన్ని కూడా అణుచుకోలేకపోయింది.

ఇద్దరూ లోనికి ప్రవేశించారు.

ఎయిర్ కండిషను చేయబడ్డ ఓ గదిలోకి సరోజను తీసుకెళ్ళి "ఇది నా ఆఫీసు రూం" అంది ప్రియో.

సరోజ ఆశ్చర్యపోయింది.

ఆ గదికి ఆఫీసు లక్షణాలేమీ లేవు. ఓ షెల్ఫ్ లేవు. టేబిలూ కుర్చీలూ లేవు.

అత్యాధునికంగా వున్న ఓ సోఫాసెట్, దానికి కాస్త దూరంగా ఫోంబెడ్ వున్నాయి.

"ఇది లివింగ్ రూంలా వుంది గాని, ఆఫీసురూంలా లేదు."

అనేసింది పైకి సరోజ వుండబట్టలేక.

"మీ యూనివర్సిటీ ఆఫీసు చూశాక, మా ఆఫీసు చూస్తే అలాగే వుంటుంది. పని చెయ్యాలంటే, ఆ సోఫాలో కూచుని చేసుకోవచ్చుగా. ఆ షెల్ఫులు, ధూళి అంటే యిక్కడ ఒప్పుకోరు."

చెప్పింది ప్రియో, సరోజ రిమార్కుకి జవాబుగా.

'పనిచేస్తే యిలాంటి ఆఫీసుల్లో చెయ్యాలి. చక్కని వాతావరణం వుంది.'

అనుకుంది సరోజ.

"ఒన్ మినిట్. ఈ టైంలో సర్వెంట్సు ఉండరు. బెల్ కొడితే లాభంలేదు. నేనే వెళ్ళి డ్రింక్స్ తీసుకొస్తాను."

అంటూ ప్రియో, సరోజను సోఫాలో కూచోబెట్టింది.

ప్రియో బయటికి వెళ్ళబోతుంటే, 'కొంపదీసి హాట్ డ్రింక్స్ తీసుకురాదుకదా?' అనుకుంది సరోజ.

"నో హాట్ డ్రింక్స్. ఓన్లీ సాఫ్ట్."

చిన్నగా హెచ్చరించింది సరోజ.

"ఓ కే. అయ్ నోయిట్."

చిరునవ్వులు చిందిస్తూ బయటికి కదిలింది ప్రియో.

పావుగంట తర్వాత, ప్రియో వచ్చేంతవరకూ, గదిలోని అలంకరణను పరిశీలిస్తూ గడిపింది సరోజ.

"అయామ్ సారీ! ఫ్రిజ్ వున్న రూం తాళాలు వేసుకుని మేనేజరు ఎక్కడికో వెళ్ళిపోయాడు. తాళాలు వెదికి డ్రింక్స్ తీసుకు వచ్చేసరికి ఆలస్యం అయింది."

తన ఆలస్యానికి క్షమాపణ చెప్పుకుంటూ వచ్చిందిప్రియో. ఆమె చేతిలో డ్రింక్స్‌వున్న ట్రే వుంది.

"డోంట్ బాదర్."

అంటూ సరోజ ప్రియో అందించిన ట్రేలోని ఒక గ్లాసు అందుకుంది.

ట్రేను టీపాయ్‌మీదవుంచి, రెండో గ్లాసు అందుకుని, సరోజ ప్రక్కకువచ్చి కూర్చుంది ప్రియో.

"థేంక్స్" చెప్పి సరోజ తన డ్రింకు త్రాగసాగింది. ప్రియోమాత్రం, తన గ్లాసులో ద్రవాన్ని కాస్త చప్పరించి గ్లాసు అలాగే పట్టుకుని కూచుంది.

సరోజ రెండునిముషాల్లో తన గ్లాసు ఖాళీ చేసేసింది.

"ఇంకోటి కావాలా?" అడిగింది ప్రియో మర్యాదగా సోఫాలోంచి లేవబోయింది.

"చాలు. యిక వద్దండి."

అంటూ, లేవబోతున్న ప్రియోని వెనక్కి లాగి కూచో బెట్టింది సరోజ.

ప్రియో సరోజవైపు తదేకంగా చూస్తూవుంది. సరోజ కళ్లు మత్తుగా వాలిపోతున్నాయి.

"ఏంటిది? ఏంటిది?"

అంటూ రెండుసార్లు మత్తును విదిలించుకోవడానికి ప్రయత్నించింది సరోజ. కాని, లాభంలేకపోయింది.

ఇంకో రెండు నిముషాల్లో, సోఫాలో మత్తుగా నిద్రపోయింది సరోజ.

సోఫాలోంచి చివ్వున లేచింది ప్రియో. చేతిలోని గ్లాసుని టీపాయ్‌మీద వుంచింది.

"కమాన్ ఫ్రండ్స్! క్విక్."

తలుపు తెరచి ప్రియో అనగానే, యిద్దరు యువకులు లోనికి ప్రవేశించారు తొందరగా. అందులో ఒకాయన చేతిలో ఫ్లాష్ కెమేరా వుంది.

ప్రియో చకచకా సరోజ బట్టల్ని లాగేసి నగ్నం చేస్తుంటే రెండో వ్యక్తి, తన బట్టల్ని వదిలేసి నగ్నం అయ్యాడు.

కెమేరావ్యక్తి, ప్రియో కలిసి నగ్నంగావున్న సరోజను దగ్గరలోవున్న ఫోంబెడ్డు మీదకు చేర్చారు.

నగ్నం అయిన యువకుడు, సరోజమీదకు వంగి రకరకాల ఫోజులు యిస్తుంటే, అన్ని కోణాల్లోనూ ఫోటోలు తీశాడు కెమేరా వ్యక్తి.

పావుగంటలో తమపని అయిపోగానే, యిద్దరుయువకులూ అక్కడనుంచి జారుకున్నారు. ప్రియో ఎప్పటిలా సరోజకు దుస్తులు తొడిగింది.

అరగంట తర్వాత, సరోజకు మెలకువ వచ్చింది. కళ్ళు తెరచి చూసి, తాను బెడ్‌మీద వున్నట్టు తెలుసుకుంది.

చప్పున లేచి, "ఐయామ్‌సారీ! మిస్ ప్రియో! ఒళ్లు తెలీ కుండా నిద్రపోయాను...సోఫాలో కదూ వున్నాను... ఇక్కడికి కెలావచ్చాను?" అంటూ మంచం దిగబోయింది.

"కూర్చోండి. మిస్ సరోజా! మీతో కొన్ని వ్యాపార విషయాలు మాట్లాడాలనుకుంటున్నాను."

అంది ప్రియో, సరోజను మంచం దిగకుండా ఆపుతూ. తనతో వ్యాపార విషయాలా? సరోజ ఆశ్చర్యపోయింది.

"యేంటది?"

సరోజ అడిగింది.

"మీకు చక్కని ఫిగరుంది. మా హోటలులో డాన్సు చెయ్యకూడదూ?"

సరోజ ఒక్కక్షణం షాక్ తిన్నట్టుగా అయింది. వెంటనే తేరుకొని—

"జోకు వేస్తున్నట్టున్నారు. నేనేమిటి? డాన్సు చేయడ మేమిటి?" అంది.

"మాడరన్ డాన్సు ఉంది చూశారూ! దానికి పెద్దగా తెలియనక్కరలేదు. అవయవాలు యెలా కదిపితే, మగవాడికి తిక్క రేగుతుందో తెలిసి వుంటే చాలు."

"ఛ! ఛ! నాకుగాని నా పేరంట్సుకిగాని అలాంటిది ఇష్టముండదు. ఇంక ఆరునెల్లు పోతే, నా బావతో పెళ్ళి కాబోతోంది."

"ఆ తరువాత?"

'యేముంది?... నా బావతో స్వర్గసౌఖ్యాలు చవి చూస్తాను' అని సరోజ చెప్పబోయి, సిగ్గు ముంచుకు రాగా ఊరుకొంది.

"ఆ తరువాత...పిల్లలు...ముసలితనం... లేదా రోగాలు. చచ్చిపోవడం......అదీ ఒక జీవితమేనా? యానిమల్స్ కూడా ఆ పన్లే చేస్తాయి. వాటికీ మనకీ యేమిటి తేడా?"

అంది ప్రియో తర్కంలో కాస్తవ్యంగ్యం మిళాయించి.

సరోజ జవాబియ్యలేదు. తాను ప్రియోతో వాదించడానికి కాలేదు. మర్యాద కోసం పిలిస్తే వచ్చింది. ప్రియో అభిప్రాయాల్ని ఖండించి, ఆమె మనస్సు నొప్పించడం తన కిష్టంలేదు.

మవునం వహించినా, తన మొహం మీది చిరునవ్వు ఆరిపోనియ్యలేదు సరోజ.

ప్రియో మళ్లా ప్రారంభించింది:

"బాగా ఆలోచించండి మిస్ సరోజా! మా హోటలుకు కొత్త అమ్మాయిలు కావాలి. అందుకే మిమ్మల్ని అడగాల్సి వచ్చింది... దాని మాటకేంగాని,మీకు కావలసినంత డబ్బు. షో జరుగుతున్నప్పుడు, యెడ్మయిరర్స్ యిచ్చే డబ్బంతా మీదే. డ్రింక్స్, మీల్సు, మిస్సెలనీ కాక, నెలకు వెయ్యి రూపాయలు జీతం."

జవాబేమిటో చెప్పమన్నట్టుగా ఆగి, సరోజ కళ్ళల్లోకి చూస్తూ కూర్చుంది ప్రియో.

అంతవరకూ సరోజ మొహాన్ని వెలిగించిన చిరునవ్వు అదృశ్య మయ్యింది. దాని స్థానం 'అయిష్టత' ఆక్రమించుకుంది.

"నాకు డబ్బు సంపాయించాల్సిన అవసరం లేదండి. మాకు బాగా ఆస్తి వుంది. అదీగాక, మా బావ, బొంబాయిలో ఆఫీసరుగా పనిచేస్తున్నాడు. క్లబ్బులో డాన్సుచేసి డబ్బు గడించాల్సిన ఖర్మ నాకులేదు" అంది కొంచెం కటువుగా.

"అయితే, మేం ఫొటోలు తియ్యడం మంచిదయ్యిందన్నమాట" తనలో తాను అనుకున్నట్టుగా అంది ప్రియో.

ప్రియో మాటలు వినగానే, చురుగ్గా ఆమె కళ్ళల్లోకి చూసింది సరోజ.

# 16

‘‘యేం ఫొటోలు?’’

గాభరాగా అంది సరోజ.

‘‘అదే సరోజా! నీ లాంటి మొండి వాళ్ళను దారికి తీసుకొచ్చే మా సాధనం.’’

చెప్పింది ప్రియో, వికృతంగా నవ్వుతూ.

సరోజకు అప్పుడు గుర్తు వచ్చింది. తాను మత్తుగా పడి ఉన్నప్పుడు, తనను యెవరో కదుపుతున్నట్టుగా యెందు కనిపించిందో, పదేపదే తన కళ్ళముందు, మెరుపులు కనిపించి యెందుకు మాయమయ్యాయో, అప్పుడు తెలుసుకుంది.

నిస్సహాయంగా, అయోమయంగా ప్రియో మొహంలోకి చూస్తూ వుండిపోయింది.

ప్రియో చెప్పసాగింది:

‘‘మా బాస్ అంటుంటారు యెప్పుడూ. మనం యేం చేసినా పక్కాగా ఉండాలని. గ్లాసుల్లో డ్రింకు తీసుకు వచ్చినపుడు రెండింటిలోనూ, మత్తుమందు కలిపి తీసుకొచ్చాను. నువ్వు తప్పించుకునే అవకాశం ఉండ కూడదని అలా చేశాను. అలానే, మా ఫొటోల పథకం కూడా. నువ్వు ఒక అందమయిన యువకుడి కవుగిల్లో నగ్నంగా నలిగిపోతున్నట్టు ఫొటోలు తీసాం. నువ్వు మేం చెప్పినట్లు విన్నావా, ఫొటోలు యిచ్చేస్తాం. లేదా, అలాంటి ఫొటోలు వేసుకోవాలని అవురావురు మంటున్న కొన్ని పత్రికలున్నాయి. వాటికిచ్చేస్తాం. నీ మర్యాదా, గౌరవం మంట గలుస్తుంది. అప్పుడెలాగూ, మా దగ్గరకు రాక తప్పదు.’’

అమాయకంగా వచ్చి, తానెలాంటి చిక్కుల్లో యిరుక్కుందో సరోజకు అర్థం అయింది. ఆమె గుండెలు భయంతో దడదడ లాడిపోయాయి. నోరెండి పోయింది.

యేం మాట్లాడ్డానికీ నోరు పెగల్లేదు.

స్థాణువులా ఉండిపోయింది సరోజ.

"మిస్ సరోజా! యింటికి వెళ్లు. ఇప్పటికే చాలా ఆలస్యం అయిపోయింది. రేపుకాదు. యెల్లుండి. రాత్రి పది గంటల లోపున నీ అంగీకారం మాకు కావాలి. పోలీసులు వగైరా గొడవలకు పోకు. మాకు ఆ డిపార్టుమెంటుతో సన్నిహిత సంబంధాలున్నాయి... మా వారికి నీవు మర్యాదగా రాక పోతే, నిన్నెలా రప్పించుకోవాలో మాకు తెలుసు. పేపర్ల నిండా నీ ఫొటోలే ఉంటాయి."

ప్రియో మాటలు మవునంగా విని, హోటలు బయటికి వచ్చింది సరోజ.

యూనివర్సిటీ వైపువచ్చి, తిరిగి వెళ్ళిపోతున్న కాళీ ఆటో రిక్షాను ఆపి, యెక్కి, యింటికి చేరుకుంది సరోజ యెలాగో. పక్కమీద వాలి వెక్కి వెక్కి యేడ్చింది. అలసి సొలసి అలాగే నిద్రలోకి జారిపోయింది.

## 3

తరువాత రెండు రోజులూ నరకయాతన అనుభవించింది సరోజ.

తన అంగీకార మేమిటో తెలియ చెయ్యమంది ప్రియో. కాని, సరోజకున్న స్వేచ్ఛ యేమిటి?

ప్రియో చెప్పిందానికి మర్యాదగా, మెత్తగా ఒప్పుకుంటే సరే! లేకపోతే, బండపద్ధతు లుపయోగించి తనను వారి మార్గానికి తెచ్చుకోగలరు.

పోలీసు రిపోర్టివ్వడం వల్ల మేలుకన్నా, ముప్పే యెక్కు వన్న విషయం ప్రియో హెచ్చరించక పోయినా తనకు తెలుసు.

తనను వదిలెయ్యమని ప్రియోను బ్రతిమాలు కోవడం తప్ప, తన కింకో గత్యంతరం లేదు.

అంత సులువుగా ప్రియో తన అభ్యర్థనకు లొంగక పోవచ్చు. కాని, ఆమె కాళ్లు పట్టుకోడానికైనా తను వెను కాడదు.

బావను తను యెంత గాఢంగా ప్రేమించిందో, బావ కూడా తననెంత గాఢంగా ప్రేమిస్తున్నాడో ప్రియోకు నచ్చచెప్పాలి. అంత అనురాగ దాంపత్యాన్ని చెడగొట్టడం మంచిది కాదని, ప్రియో హృదయం కరిగి నీరయి పోయే లాగు వేడుకోవాలి.

యెలా తను తన తల్లిదండ్రులకు యేకైక సంతానమో, తన గురించి వాళ్ళెంత దుఃఖిస్తారో, వివరంగా, సవ్యంగా చెబితే, ప్రియో తప్పకుండా తనను వదిలెయ్యడానికి యిష్టపడవచ్చు.

కన్నీళ్లు, కాళ్లు పట్టుకోవడాలు పనిచెయ్యక పోతే, చివరగా తను ప్రియోకు డబ్బాశ చూపెడుతుంది.

యీ రోజుల్లో డబ్బాశ లేని వారెవరు?

డబ్బు తీసుకుని, ప్రియో తనని తప్పక విడిచిపెట్టేస్తుంది.

తన ఫొటోలున్న ఫిల్ము నెగిటివ్‌లు వెనక్కి తెచ్చుకుని, తన గౌరవం సంరక్షించుకోవాలంటే, తను ఆ మాత్రం నష్ట పోవడానికి సిధపడాలి.

రెండవరోజు సాయంత్రం అరున్నర గంటలకు ఓ నిర్ణ యానికి వచ్చింది సరోజ.

మనస్సు కొంత తేలికపడినట్టయింది.

విచారంగా, మౌనంగా ఆలోచనల్లో లీనమై ఉండిపోవ డానికి కారణం యేమిటని, కనీసం వందసార్లయినా అడి గారు సరోజ తల్లిదండ్రులు.

తను మామ్మూలుగానే వున్నానని దమాయించుకు వచ్చింది ప్రతీసారీ.

రాత్రి తొమ్మిది గంటలవుతుండగా, స్నేహితురాలితో రెండోఆట సినిమా కెళ్తున్నానని చెప్పి బయట పడింది

సరోజ.

ముందు ఆలోచించిన విధంగా, హేండ్ బేగ్‌లో అయిదారు వేలు విలువచేసే నగలు వేసుకుంది.

తొమ్మిదిన్నర అవుతుండగా హోటలు చేరుకొంది.

రిసెప్షన్ వద్ద ప్రియోగురించి అడిగేసరికి, ఓ సర్వెంటును తోడిచ్చి, ఆడిటోరియమ్‌లోకి సరోజను పంపింది రిసెప్షనిస్టు.

"ఇంకో అయిదు నిముషాల్లో ప్రియో డాన్సింగ్ వుంది. అదయ్యాక, ఆమె గదిలోకి తీసుకెళ్తాను. అంతవరకూ డాన్సు చూడండి...డ్రింక్స్ ఏమైనా తెమ్మంటారా?" అన్నాడు పనివాడు.

"నాకేమీ వద్దు," అని సరోజ అనగానే, సలాముచేసి వెళ్ళిపోయాడు పనివాడు.

తనను తెలిసిన వారెవరయినా చూస్తున్నారేమోనని సరోజ గాభరాపడుతూంటే, పెద్దలైట్లు ఆరిపోయాయి.మసక వెలుతురు చిమ్ముతున్న దీపాలు మాత్రం మిగిలాయి.

'బ్రతికిపోయాను' అనుకుని నిట్టూర్చింది సరోజ.

తనకు ముప్పై గజాల దూరంలో ఎదురుగావున్న వేదిక మీద గుండ్రంగా స్పాట్ లైట్ పడగానే, అటు చూసింది సరోజ.

అదేసమయంలో హోరుమంటూ సంగీతం మొదలయింది.

ఆడిటోరియంలో కూర్చున్నవారిలో ఒక్కసారిగా సందడి తగ్గింది. వారి చూపులు వేదికమీద కేంద్రీకృతమయ్యాయి.

వేదికమీద డాన్సరు అవతరించగానే, చప్పట్లవర్షం కురిపించారు జనం.

ఆడిటోరియంనిండా మత్తుగా అప్పటికే ఆవరించుకున్న సంగీతానికనుగుణంగా నాట్యం మొదలయింది.

దాన్ని నాట్యం అనడం కష్టం. దానికో శాస్త్రమూ పద్ధతీ ఉన్నట్టు లేదు.

ఒంట్లో రెచ్చిన కామోద్రేకానికి, డాన్సరు తన శరీరం లోని ప్రతి అంగంతోనూ, ఓ భౌతికరూపం ఇవ్వడానికి తంటాలు పడుతున్నట్టుగా వుంది.

వేదికమీద గుండ్రంగా, బలిష్ఠంగా, కండలు పొంగిన శరీరంతో తుళ్లుతోంది ప్రియా.

ఆమె శిరస్సు వెనక్కూ ముందుకూ వుండివుండి విసురుతుంటే, ఆమె జుత్తు కెరటాలుగా లేచిపడ్తూ ఆమె మొహానికి వింత అందం సమకూరుస్తోంది.

చేతులు కాళ్ళు నిర్విరామంగా, చిద్విలాసంగా గాలిని కోస్తున్నాయి.

ఆమె నడుం ఊపి జెర్కులు ఇస్తుంటే, ఆమె వక్షోజాలు ఉరికిఉరికి పడుతున్నాయి.

ఆమె అలా నాట్యం చేస్తూనే, తన రెండు చేతులు ప్రక్కకు పోనిచ్చి, అంతవరకూ ఆమె కాళ్ళ చివరవరకూ కప్పిన మేక్సీని విప్పేసింది.

ప్రేక్షకులు మెచ్చుకోలుగా చప్పట్లు కొట్టారు.

ఇప్పుడామె మోకాళ్ళపర్యంతం కప్పిన స్కర్టుతో వుంది.

ఇంకో రెండునిముషాలు పోయాక, బ్లౌజు విప్పేసిందామె.

బ్రాతో వుందామె ఇప్పుడు.

మళ్ళా చప్పట్లహోరు ఆడిటోరియంలో.

ఆమె డాన్స్ చేస్తూనే వుంది. ఇంకో పదినిముషా లయ్యాక స్కర్టు వూడదీసేసి, జనంలోకి విసిరేసింది.

అందుకుంటూ, యీలలు వేసారు కొందరు యువకులు.

విస్ట్రింగ్ తో నిల్చుందామె చివరకు.

ఏపుగా యెదిగిన ఆమె తొడ నిగనిగలమీద స్పాట్ లైట్ కాంతి నిలవజాలక జారిపోతోంది మనోహరంగా.

ప్రేక్షకులు వేడెక్కిపోయారు.

"అదిమాత్రం యెందుకు? తీసెయ్యి! తీసెయ్యి!" కొంత

మంది పిచ్చిగా అరుస్తున్నారు.

అయినా, ఆమె తియ్యలేదు.

ఆమె అలా గుండ్రంగా, బంతిలా తిరుగుతూ వేదికమీద గంతులు వేస్తోంది.

ఇంకో అయిదు నిముషాలు పోయాక, బ్రా కూడా విప్పసాగింది.

ప్రేక్షకులు ఊపిరి బిగబట్టారు.

బ్రా తీసెయ్యగానే ఒకే ఒక సన్నని నైలాన్ పేలిక, ఆమెనగ్నవక్షాల్ని పూర్తినగ్నం కాకుండా కాపాడుతోంది.

ప్రియో నాట్యాన్ని చూస్తున్న సరోజ గుండెలు పట్టుకున్నాయి.

తనను ప్రియో చెయ్యమన్న నాట్యం ఇదే నన్నమాట! ఛీ! ఛీ! తను యీ నాట్యం చెయ్యగలదా? తను యెలాగో చెయ్యగలిగినా, అది తెలిసి తన తల్లిదండ్రులు బ్రతికివుంటారా? తన బావ జీవించగలడా?

తన యెత్తు ధనం ఇచ్చినా, బట్టబయలుగా, అసహ్యంగా అంగాంగాలు చూపించే యీ నాట్యం తను చెయ్యలేదు.

డాన్సు పూర్తయిపోయింది. లైట్లు వెలిగాయి.

ఇందాకటి పనివాడు వచ్చి సరోజను ప్రియో దగ్గరకు తీసుకెళ్ళాడు.

ప్రియో యింకా విస్ట్రింగ్ తోటి, రిబ్బన్ తోటి వుంది.

"యేంటి నిర్ణయించుకున్నావు సరోజా!"

సరోజ లోనికి రాగానే అడిగింది ప్రియో.

"మిస్ ప్రియో! మీకు వెయ్యి దండాలు పెడ్తాను. మీ డాన్సు ఇప్పుడే చూశాను. అలాంటివి నా ప్రవృత్తికే విరుద్ధం. నేను చచ్చినాసరే ఆ నాట్యం చెయ్యలేను. నన్ను వదిలెయ్యండి."

తన మనస్సులోని అయిష్టత అంతా మొహంలో కన్ప

రుస్తూ అంది సరోజ.

"ఓహ్!...ఇంకా మొదట్లోనే వున్నావా? మాటు వేసి వేసి నిన్ను పట్టాం. అంతకుముందు ఇంకో రెండు నెల్లు నీవు మాకు పనికొస్తావో, లేదో అని పదికి వందసార్లు పరీక్షించాం చూసుకొన్నాం. నిన్ను విడిచిపెట్టే ప్రసక్తే లేదు."

సరోజ కళ్ళల్లోకి విసుగ్గాచూస్తూ అంది ప్రియో.

"అలా అనకండి మిస్ ప్రియో! నా తల్లిదండ్రులకు నేనొక్కరినే సంతానం. వాళ్లు ఇలాంటివి భరించలేరు. వెంటనే గుండెపగిలిచచ్చిపోతారు. నా బావ పిచ్చివాడయిపోతాడు. ఇవి చేతులు కావు... కాళ్ళు...నన్ను వదిలెయ్యండి...నా మీద జాలి చూపండి."

ప్రియో చేతులు పట్టుకుని ప్రాథేయపడసాగింది సరోజ.

"మిస్ సరోజా! నిన్ను వదిలేస్తానన్న ఆశ పెట్టుకోకు. మేం వదలడం అసంభవం."

సరోజ చేతులు విదిలించుకుంటూ,అంది ప్రియో కఠినంగా,

సరోజ ప్రియో పాదాలమీద పడిపోయింది వెంటనే.

"ఇదిగో! మిస్ ప్రియో!"

హాండ్ బాగ్ లోంచి నగలు తీసింది బయటికి.

"ఇవి అయిదారు వేల విలువచేస్తాయి. ఇవి తీసుకో. నన్ను వదిలిపెట్టు."

ప్రియో కాళ్లు పట్టుకుని వదలకుండా ఏడుస్తూంది సరోజ.

"యూ! స్టుపిడ్! వదులు! పడిపోతాను. నన్ను బ్రైబ్ చేద్దామని వచ్చావా? యీ డబ్బు ఒక్కరోజులో సంపాయిస్తుంది మా హోటల్."

అంటూ సరోజ పట్టు విడిపించుకోవడానికి శతవిధాలా ప్రయత్నించింది ప్రియో. కాని విఫలురాలయింది.

వెంటనే చప్పట్లు చరిచింది.

ఓ పనివాడు ప్రత్యక్షమయ్యాడు మరుక్షణంలో.

"జాన్‌ని పిలు!"

పనివాడ్ని ఆదేశించింది. పనివాడు మాయమయ్యాడు.

అయిదు నిముషాల్లో జాన్ అక్కడకు వచ్చాడు. జాన్ నల్లగా, పొడుగ్గా, బలిష్ఠంగా అవుపిస్తాడు. బయటకు వెళ్ళేటప్పుడు తప్ప షర్టు వేసుకోడు. హోటల్లో ఉన్నప్పుడు పాంటుతో తిరిగేస్తుంటాడు.

పెద్ద పెద్ద స్టెయిన్‌లెస్ స్టీలు బిళ్ళలున్న పెద్ద గొలుసు అతని మెడలో వుంది. అది అతని ఛాతీ కండల మీద కదులుతూ శబ్దం చేస్తోంది, అతడు నడుస్తుంటే.

"అల్లరి చేస్తోందా?"

లోనికి వస్తూనే అడిగాడు జాన్.

"యా."

అంది ప్రియో.

"అయితే, బాస్ చెప్పింది చెయ్యక తప్పదన్నమాట."

అంటూ జాన్ సరోజను సమీపించాడు. ప్రియో కాళ్ళను చుట్టివేసిన ఆమె చేతుల్ని సునాయాసంగా, తోటకూర కాడల్ని వంచినట్టుగా వంచి వెనక్కి లాగి పట్టుకున్నాడు.

"నువ్వెళ్ళు. ఆమె సంగతి నేను చూసుకొంటాను."

అన్నాడు జాన్ సరోజను దగ్గరున్న మంచంవద్దకు నడిపించుకుంటూపోతూ.

అంతవరకూ ఏడుస్తూ బిత్తరపోయి చూస్తున్న సరోజ సంగతి గ్రహించింది.

"మిస్ ప్రియో! ప్లీజ్. ఇది నీకు ధర్మంకాదు," ప్రియో వైపు తిరిగి అరిచింది సరోజ. సరోజ అరుపులు, ప్రార్థనలు పట్టించకోకుండా వెళ్ళిపోయింది ప్రియో.

సరోజను మంచంమీదకు గిరవాటు వేశాడు జాన్.

మొండి ఆడవాళ్ళను లొంగదీసుకోవడంలో జాన్ ప్రతిభావంతుడు. హోటలు అతడ్ని పోషిస్తున్నది కొంత

వరకూ అందుకే.

సరోజ చేతులూ కాళ్లూ విదిలించుకుంటూ, ఎంత ప్రతిఘటిస్తున్నా, ఆమెను వివస్త్రను చేశాడు.

ఆ తరువాత, చాకులా తనపని తను చేసుకుపోయాడు.

ఆమె శరీరంలోని అంగఅంగాన్ని పీల్చి పిప్పిచేశాడు.

"బావా!...అలా జరక్కూడనిది నా జీవితంలో జరిగిపోయింది బావా! జాన్ నా అవయవాలతో బంతాట ఆడాడు. నన్ను చెరిచాడు. నన్ను నాశనంచేశాడు. బావా, అందుకే నిద్రమాత్రలు మింగి ఆత్మహత్యకు సిద్ధపడ్డాను. వచ్చే జన్మకయినా, నీ భార్య నయ్యేలాగు దీవించు బావా!

ఇట్లు
అభాగ్యురాలు
నీది కాలేకపోయిన
సరోజ.

ఉత్తరం చదవడం పూర్తిచేశాడు హరి. హరి కళ్ళల్లోంచి నీళ్లు టపటపరాలాయి.

అంతవరకూ ఉగ్గబట్టుకు కూర్చున్న అతని దుఃఖం కట్టలు తెంచుకుంది.

"సరోజా! ఎంతపని చేశావు సరూ!" అంటూ చిన్నపిల్లవాడిలా ఏడవసాగాడు.

కొంత సేపయ్యేసరికి అతని దుఃఖావేశం కొంత తగ్గింది.

"ఈ ఉత్తరంతో పోలీసు రిపోర్టు యివ్వలేకపోయావా మామయ్యా?"

అడిగాడు హరి.

"ప్రయోజనం ఏమిటిరా? అదేలాగూ చచ్చిపోయింది. రిపోర్టు యిస్తే శవ పంచాయితీ అంటారు. దాన్ని కోస్తారు. మనందర్నీ నాలుగురోజులు అదీ యిదీ ప్రశ్నించుతారు, మనకేవో దురూహాలున్నట్టు. అయినా, ఆ హోటలువాళ్ళకు

పోలీసు డిపార్టుమెంటుతో సన్నిహిత సంబంధాలున్నాయని రాసింది...రిపోర్టు యిస్తే ఏకను తీసుకోరు. మనకు ఎక్కడ లేని అప్రతిష్ఠమాత్రం మిగులుతుంది."

వివరించాడు మామయ్య.

అతను చెప్పింది సబబుగానే తోచింది హరికి.

రెండురోజులు భారంగా గడిచాయి.

హరి ఎంత ప్రయత్నించినా, సరోజ మరపున పడటం లేదు. ఇంట్లోవున్న ప్రతివస్తువూ, ప్రతిచోటూ, ఆమెనే పదేపదే గుర్తుకు తెస్తున్నాయి.

సరోజ పగలు అతని కళ్ళల్లోనూ, రాత్రి అతని కల ల్లోనూ కాపురం చేస్తోంది.

రాత్రిళ్లు నిద్రపోవాలని యిలా కన్నుమూస్తే, సరోజ పిలుస్తున్నట్టు అన్పిస్తుంది.

అంతే! మెలకువ వస్తుంది. మరి నిద్రరాదు.

రోజు గడవడం కష్టమయిపోతోంది. కాలాన్ని నెట్టడా నికి సిగరెట్లు త్రాగడం ఆరంభించాడు. దాంతో బుర్ర వేడెక్కిపోయి, నిద్ర యింకా దూరం కాసాగింది.

మనస్సు చికాగ్గా వున్నప్పుడు, త్రాగుడు కొంత ఉపశ మనం కలిగిస్తుందని ఎవరో చెప్పగా విన్నాడు.

త్రాగుడు ఆరంభించాడు.

పరిస్థితిలో మార్పు లేదు.

త్రాగుడు మైకంలోకూడా సరోజ జ్ఞాపకాలు అతన్ని వదలలేదు.

తన జీవితాన్ని యింత దుర్భరస్థితికి దిగజార్చడానికి ప్రియోకి వున్న అధికారమేమిటి?

అలాంటి దుర్మార్గాల్ని, అక్రమాల్ని సహిస్తూ ఊరుకోవడ మేనా?

ఎదిరించాల్సిన అవసరంలేదా? అరికట్టాల్సిన బాధ్యత

అక్రమాల్ని, అరాచకాల్ని ప్రబలకుండా చెయ్యాల్సిన పోలీసుడిపార్టుమెంటే, నేరస్తులతో యేకమయిపోయి అన్యాయంతో చేతులు కలిపి, న్యాయాన్ని, ధర్మాన్ని రక్షించకుండా కూర్చుంటే, యేం చెయ్యాలి? ఆలోచనలతో అతని బుర్ర వేడెక్కిపోసాగింది.

చట్టాన్ని తిడుతూ కూచుంటే లాభంలేదు.

పోలీసుల్ని తప్పుబడుతూ ఊరుకుంటే ప్రయోజనం లేదు.

తను ఊరుకుంటే, తన జీవితాన్ని వక్ర మార్గం పట్టించిన వాళ్ళు, యింకా బలిసి పోతారు. ఇంకా బలవంతులయి పోయి విర్రవీగిపోతారు. ఇంకొన్ని అన్యాయాలు చేస్తారు. ఇంకొందరు అమాయకులు బలైపోతారు. ఇంకొంతమంది సరోజలు నిస్సహాయంగా స్వార్థం కాళ్ళక్రింద నలిగిపోతారు.

లాభం లేదు.

ఇందు కొకటే మార్గం. ప్రియోపైన ప్రతీకారం తీర్చుకోవాలి! రక్తానికి రక్తం బదులు!!!

ఒక నిశ్చయానికి వచ్చాడు హరి.

# 4

"మిస్ ప్రియోని కలుసుకోవాలి."

రిసెప్షన్ వద్ద కూచున్న అమ్మాయితో అన్నాడు హరి.

అమ్మాయి తలెత్తి అతని వైపు చూసింది.

మామూల్లుగా అవుపించాలని యెంతో జాగ్రత్త తీసుకున్నాడు హరి. కాని లాభంలేకపోయింది.

మితిమీరి తాగడంవల్ల యెరుపెక్కిన కళ్ళు, అదే పనిగా పొగతాగడం వల్ల నలుపెక్కిన పెదవులు, దువ్వుకోక క్షవరం చేయించుకోక వదిలేస్తే, అల్లిబిల్లిగా చిక్కులు పడి పోయిన జుట్టు-అతని రూపం ఆ అమ్మాయికి నచ్చలేదు.

అయిష్టంగా మొహం పెట్టింది.

"ఎపాయింట్ మెంట్ యిచ్చిందా?

అడిగింది అమ్మాయి.

"లేదు."

చెప్పాడు హరి.

"అలాగయితే లాభం లేదు."

అని అమ్మాయి అంది గాని, ఓ నిముషం పోయాక, ఓ నంబరుకు ఫోను డయలు చేసింది.

అవతల ఫోను పలకగానే

"మిస్ ప్రియో! మీ కోసం యెవరో వచ్చారు. పంపించమంటారా లోనికి?" అంది ఫోనులో.

తరువాత రెండు నిముషాలు అవతలనించి జవాబు విన్నాక, ఫోను దూరంగా తప్పించేసి,

"మీ పేరేమిటో, మీరెందుకు ఆమెను కలుసుకోవాలనుకుంటున్నారో, కనుక్కో మంటోంది. ఏం చెప్పమంటారు?"

అడిగింది అమ్మాయి, హరి వైపు చూసి.

"పేరు చెబితే, ఆమె పోల్చుకోలేరు లెండి. ఇహ నేనెందు కొచ్చానో, ఆమెకే చెప్పాలని నిశ్చయించుకున్నాను."

అన్నాడు హరి.

హరి చెప్పిన మాటల్ని, ఫోనులో పలికిందా అమ్మాయి.

నిముషం అయ్యాక ఫోను పెట్టేస్తూ—

"సారీ! ప్రియో మిమ్మల్ని కలుసుకోవడానికి నిరాకరించింది" అందా అమ్మాయి.

"నో!నో! నేను ఆమెను వెంటనే కల్సుకోవాలి."

నిరుత్సాహం ఒకవైపు, అవమానం ఒకవైపు రెచ్చగొట్టిన కోపంతో అన్నాడు హరి.

హరిని చూడగానే ఆమెలో కలిగిన అనుమానాలు దాంతో

ఓ నిశ్చితరూపం పొందాయి.

యేదో ఓ అల్లరి లేవదీయడానికి హరి వచ్చాడనుకుందా అమ్మాయి.

"మిస్టర్! మర్యాదగా బయటికి వెళ్ళిపోండి. లేకపోతే, మా సెక్యూరిటీని పిలవాల్సి వస్తుంది."

బెదిరించిందా అమ్మాయి.

దాంతో హరి కోపం ఇంకా రెచ్చిపోయింది.

కుడిచేయి పిడికిలి బిగించి, ఆవేశంగా ఊపుతూ—

"మిస్ ప్రియాను నేను తక్షణం చూడాలి. పంపుతారా? పంపరా?" అని రెట్టించాడు.

ఈ దృశ్యాన్ని యెక్కడనుంచో పరిశీలిస్తున్నట్టున్నారు ఇద్దరు దృఢకాయులు గబగబావచ్చి, హరిని రెక్కపుచ్చుకు పట్టుకుని, వీధిలోకి లాక్కుపోసాగారు.

తన అశక్తత అర్థంచేసుకున్నాడు హరి.

"నా కారుంది తీసుకుపోనీండి" అన్నాడు వాళ్ళతో, బయటకు వెళ్ళిపోవడానికి సంసిద్ధత తెల్పుతూ.

"అబ్బో! నీ కో కారు కూడానా?"

వెటకారం చేశారు ఆ మనుషులు.

వారి పట్టు విదిల్చుకుని, తన కారు వద్దకు వెళ్ళబోతుంటే హరిని మళ్ళా పట్టుకుని నిలబెట్టారు.

"చూడు మిస్టర్! మళ్ళా యీ హోటలు ఛాయలకు రాకు. వచ్చావో, నీ ఒంట్లోని అన్ని భాగాలతో తిరిగి వెళ్ళవు. ఆ విషయం గుర్తుంచుకో."

అని చెప్పి అతడ్ని వదిలేసి లోనికి వెళ్ళిపోయారు.

జేబులోని పిస్టలు తీసి, ఆ యిద్దర్నీ అక్కడే టపాటపా మని కాల్చేద్దామా అన్నంత కోపం కలిగింది తడడికి. కాని నిగ్రహించుకున్నాడు.

ఆ కిరాయిమనుష్యుల్ని చంపడం తన ధ్యేయంకాదు. మిస్

ప్రియోని వాతమార్చాలి.

తను వచ్చిన పని అతి సులువుగా నెరవేరుతుందను కున్నాడు. తను ప్రియోకోసం అడగ్గానే, తనలో పనివాడ్ని తోడిచ్చి ప్రియో వద్దకు పంపుతారు. ప్రియో ఎవరో కను క్కొని గుర్తుపట్టాల్సిన బాధ తనకు తప్పుతుంది అను కున్నాడు.

కాని, తనపథకం అంతా తారుమారయింది. శాశ్వతంగా తను ఆ హోటల్లోకి ప్రవేశించగలిగే అవకాశం పోగొట్టు కొన్నాడు.

ఇంటికి తిరిగి వస్తూ, త్రోవపొడుగునా, తన దురదృ ష్టాన్ని, తన తెలివితక్కువ ప్రవర్తన్ని పదేపదే నిందించు కున్నాడు హారి.

# 5

ప్రియోను ఇంతవరకూ హారి చూల్లేదు. ఆమె ఎలాగుం టుందో తెలుసుకోవడమే గాకుండా, ఆమె గురించి చాలా భోగట్టా కావాలి. మళ్ళీ ఆ హోటలుకు వెళ్ళితే తనను మక్కె లిరగతంతారు? మరి ఏంచేయాలి?

ఆమె యిల్లు ఎక్కడ? ఏయే వేళప్పుడు బయటికి వస్తుంది? ఏయే ప్రదేశాలకు తరుచుగా వెళ్తుంది?

ఆ హోటలుతో బాగా పరిచయమున్న వ్యక్తి, ఆ విషయ మంతా చెప్పగలడు. తనకలాంటి వ్యక్తి సాయంకావాలి.

అలాంటి వ్యక్తికోసం, హోటలుముందు బీటుకాసి, హోట లుకు తరుచుగా వస్తూపోయేవాళ్ళెవరో పరిశీలించసాగాడు హారి.

వారం రోజులపాటు ముప్పొద్దులా బీటుకాసిన మీదట ఒకాయన్ను పట్టుకోగలిగాడు హారి.

ఆవాళ ఆయన తనకారులో రాలేదు. టాక్సీలో వచ్చాడు. తిరిగి టాక్సీలో వెళ్ళిపోవడానికి టాక్సీ కోసం యెదురుచూడ

సాగాడు.

తనకు అదే మంచి అవకాశం అనుకున్నాడు హరి.

తనకారు తీసుకెళ్ళి, అతనిముందు ఆపి, "కమాన్ సార్. ఊళ్ళోకేనా? రండి. డ్రాప్ చేస్తాను. నేనూ టౌన్‌లోకే పోతున్నాను" అన్నాడు.

అవ్యక్తి కాస్సేపు మోమాటం ప్రదర్శించాడు. కాని, డోరు తెరిచి, లోనికి రమ్మని హరి ఒత్తిడి పెంచడంతో ఆయన లోనికివచ్చి కూర్చున్నాడు.

హరి కారు స్టార్టుచేశాడు. కారు బయలుదేరింది.

"ఎక్కడికి వెళ్ళాలనుకుంటున్నారు?"

అడిగాడు హరి.

చెప్పాడా వ్యక్తి.

"మీరు తరుచుగా వస్తారనుకుంటాను యీ హోటలుకి."

అన్నాడు హరి; యథాలాపంగా అడుగుతున్నట్టు కనిపించడానికి ప్రయత్నిస్తూ.

"ఈ హోటలంటే నాకు చాలాయిష్టం. కర్టియస్ సర్వీసు. అంతకన్నా, జిలేబీల్లాంటి అమ్మాయిలు. ఓసారి యీహోటలుకు వచ్చినవాడు పెర్మనెంటు కస్టమరు అయిపోతాడు."

అలాగ, ఆ హోటలు ఏజంటులాగ, ఏవేవో చెప్పుకుపోసాగా డా వ్యక్తి.

ఆ వాక్ప్రవాహానికి అడ్డుతగులుతూ—

"ఆహోటల్లో ప్రియో అనేఅమ్మాయి ఉందనుకుంటాను" అన్నాడు హరి.

"అదా? అది నాలవ్ ... ఆమె గురించి మీ కెలా తెల్సు" అడిగా డా వ్యక్తి.

వెంటనే జవాబివ్వడానికి యిబ్బందిపడ్డాడు హరి. కాని, కాస్సేపట్లో సర్దుకుని,

"మీలాంటి రెగ్యులర్ కస్టమర్సే చెప్పారు. ఆ అమ్మాయి

చాలా అందంగా వుంటుందట!'' అన్నాడు.

''అందమా!...అలాంటిలాంటి అందం కాదు. అందానికి నిర్వచనంగా ఆ అమ్మాయినే చెప్పుకోవాలి. యేం తొడలు? యేం నడుం? యేం ఆ వక్షాల బిగువు?''

యేవేవో ఊహలలో యెగిరిపోసాగాడు ఆ వ్యక్తి ప్రియో గురించి చెప్తూ.

''ఆ అమ్మాయిని అంత వర్ణిస్తున్నారు...ఆమెను తరుచుగా కలుసుకుంటూ రనుకుంటాను?''

కలుసుకుంటే, ఆమె యిల్లెక్కడుందో అతన్ని అడిగి తెల్సుకుందామని, చాతుర్యంగా ఆ ప్రశ్న వేశాడు హరి.

''అబ్బే లేదండి!... ఆమెను యింటివద్ద కలుసు కోవటమా?... అది బంగారపు పిట్ట. నా లాంటి వాళ్లు కాదు కదా, నన్ను తలదన్నిన వాళ్ళు కూడా పోషించలేరు. ఆమె డాన్సు చూస్తాను తరచుగా. అంతే!''

అతని మాటలు విని హరి నీరుగారిపోయాడు. కాని, తను పొందిన నిరాశను కన్పడనీయకుండా, అతను పెట్టుకున్న నల్ల కళ్ళద్దాలు కాపాడాయి.

ఓ క్షణం అయ్యాక.

''పోనీ, నేను ట్రై చేస్తాను. ఆమె రేటెంతో చెప్పండి'' అంటూ సంభాషణను యింకో ప్రక్కకు మళ్ళించాడు హరి.

''బాబూ!ఆ వివరాలు నాకంతగా తెలియవు. నేనెప్పుడూ కనుక్కోలేదు. డాన్సు చేస్తూ, దగ్గర కొస్తే, ముద్దో కవుగిలింతో, ప్రేళ్ళతో, సవరింపో పొందాలంటేనే వంద చదివించుకోవాలి.''

అని చెప్పి ప్రియో గురించి పూర్తి వివరాలు చెప్పడానికి తన అశక్తత వెల్లడించాడు ఆ వ్యక్తి.

''పోనీ క్లబ్ లోఆమె గదెక్కడుంటుందో చెప్పగలరా?'' తన ప్రయత్నం విఫలమయి పోయిందే అన్న విసుగులో

అడిగేశాడా విషయం హారి ఉండబట్టలేక.

"డాన్సింగ్ హాలుదాటి నేనెప్పుడూ లోనికిపోలేదండి."

ఆ వ్యక్తి అలా అనేయగానే, ఇక తన ప్రయత్నం ఫలించదని ఊరుకొన్నాడు హారి.

రెండో వైపుకు మొహం త్రిప్పుకుని, తన పథకం అంతా నేలమట్టం అయినందుకు, ఆ వ్యక్తిని కసిగా తిట్టాడు హారి నిశ్శబ్దంగా.

"మాయిల్లు వచ్చేసిందండి. ఆపండి."

అని ఆ వ్యక్తి అనగానే హారి కారాపాడు. ఆవ్యక్తి బయటికి దూకాడు. "థాంక్స్" చెప్పి వెళ్ళిపోయాడు.

"నో మెన్షన్" అని చెప్పడానికికూడా హారికి మనసొప్ప లేదు. కారు రివ్వున మళ్ళించి, యింటిదోవ పట్టించాడు.

# 6

ఈసారి, హోటలులో పనిచేస్తున్న వాడితో స్నేహం చేసి, ప్రియో గురించి భోగట్టా రాబట్టాలని నిశ్చయించుకున్నాడు హారి.

పదిరోజులపాటు హోటలుముందు కాపలాకానీ, ఎలాగయితేనేం, లక్ష్మణరావు అనే పనివాడ్ని స్నేహం చేసుకొన్నాడు.

బాగా చనువు ఏర్పడ్డాకగాని, తనకు కావాల్సిన విషయాలు లక్ష్మణరావుని అడగదల్చుకోలేదు హారి.

ఏర్పడ్డ స్నేహం నాలుగురోజులు నలగనిచ్చాడు.

ఆ రోజు లక్ష్మణరావు చాలా హుషారుగా ఉన్నాడు. అదే మంచి తరుణం అని భావించాడు హారి.

"మీ హోటల్లో జాంపండులాంటి ప్రియోఅనే అమ్మాయి వుందట" అడిగాడు హారి.

"బాబోయ్! దాని పేరు చెప్పకండి. నాగుండెలు దడ దడ లాడిపోతాయ్."

అన్నాడు లక్ష్మణరావు భయంగా.

"ఏం? ఏమిటి సంగతి? పెంకిదా? రౌడీదా?"

"దాన్ని రాక్షసిముండ అని పిలవండి సార్! కొత్తకొత్త అమ్మాయిల్ని పట్టి హోటలుకు సప్లయి చేస్తుందది. బయటికి తాను పబ్లిక్ రిలేషన్సు ఆఫీసరని చెప్పుకుంటుంది."

"అదో పెద్ద నేరం యేమిటి? ఆ అమ్మాయిలు యిష్టపడి వస్తున్నారు. తాను మధ్యపడి,హోటలుకు అప్ప చెప్తోంది."

"మీరలా అనకండి సార్! అవతలి ఆమెకు యిష్టమున్నా లేకపోయినా ఊరుకోదు. ఈ మధ్య ఏమయిందనుకున్నారు. ఒకామెను తీసుకొచ్చింది. ఆమె ఒప్పుకోలేదు. జాన్ గాడితో రేప్ చేయించింది. చెడిపోయి, తమ వద్దనే తప్పకపడి వుంటుంది కదా అని."

ఆ మాటలువినగానే హరికికోపం యెగదన్నుకు వచ్చింది, యెంత నిగ్రహంతో ఉన్నా.

'తన సరోజలాగే, యింకో అమ్మాయి ప్రియో వంచనకు బలై పోయింది!' అనుకున్నాడు హరి.

క్షణంలో రక్తారుణాలయిన అతని కన్నులు చూసి, లక్ష్మణరావు భీతిచెంచాడు.

ఆ రోజు లక్ష్మణరావు హరిలో కొత్త వ్యక్తిని చూశాడు. యేదో ఒక ఉద్దేశంతో, హరి తనతో స్నేహం చేస్తున్నాడన్న అతని అనుమానం రుజువయి నట్టనిపించింది.

తన భావాన్ని అంచనావేస్తున్న లక్ష్మణరావు చూపుల్ని అర్థం చేసుకున్నాడు హరి, మామూలు కావడానికి ప్రయత్నిస్తూ.

"అదంతా ఎందుకుగానీ, ప్రియో వుండేది హోటల్లోనా? బయటా?"

అడిగాడు హరి.

"యెందుకు సార్? మీకివన్నీ. ప్రియోని ఓసారి చూద్దా మనుకుంటున్నా రేమిటి?"

చిలిపిగా నవ్వుతూ అన్నాడు లక్ష్మణరావు.

లక్ష్మణరావు ప్రశ్నలోని ప్రమాదాన్ని ఇట్టే గ్రహించాడు హారి.

ప్రియోను పొందాలన్నదే తన ఉద్దేశం అయితే, లక్ష్మణరావుతో స్నేహం చెయ్యడం వంటి డొంక తిరుగుడు పద్ధతులు అనవుసరం.

అలాంటప్పుడు, తను అతనితో స్నేహం చెయ్యడంలో అంతర్యం యేమిటి? మొదలయిన అనుమానాలు వస్తాయి లక్ష్మణరావుకు, తను 'అవును' అన్న సమాధానం చెబితే.

హారి చప్పున ఆలోచించాడు. మాట మార్చేశాడు.

"ఆమెను యివ్వడానికి నాకంత డబ్బేదీ? ఆవిడ్ని పొందలేను కాని, ఆవిడ్ని బట్టలు లేకుండా, చూడాలని వుంది. తలుపుసందుల్లోంచి చూసే అవకాశం దొరుకుతుందేమోనని ఆమె ఎక్కడుంటోందని అడిగాను."

నవ్వుతూ చెప్పాడు హారి.

"బస్! దానికేనా? ఓసారి ఆమె కాబెరాకు రండి. అక్కడ ఆమె చూపించిన దానికన్నా, వేరేగా మిగిలిపోయిన వేవీలేవు, తలుపుసందుల్లోంచి చూడ్డానికి."

అన్నాడు లక్ష్మణరావు.

మళ్లా పరిస్థితి మొదటికే వచ్చినందుకు, లోలోపల ఎంతో విచారించాడు హారి. తన దురదృష్టాన్ని కసిదీరా తిట్టుకున్నాడు.

"పోనీ ఆ ఛాన్సయినా యిప్పించు."

అన్నాడు దిగులుగా, ఏంచేసేదిలేక.

"దానేముందిసార్. ఓ ఏభై మీవి కావనుకుంటే, యీ రాత్రే ఆమెను మీకు చూపిస్తాను."

తేలిగ్గా వచ్చేస్తూ అన్నాడు లక్ష్మణరావు.

"అలాగే! ఏభయి పోతేపోనీ. ఇవాళ రాత్రికి ఛాన్సు యిప్పిస్తావుకదూ?"

అలాగయినా, తనకోరిక నెరవేరితే చాలు అన్న ఆశ, అంతటి నిరాశలోనూ మెరుపులా మెరిసింది.

"అదెంతపనండీ! ఈవాళ రాత్రి ఆమె స్పెషల్ ప్రోగ్రాం వుంది. హోటలుకువచ్చి నాగురించి అడగండి. మీకే అడ్డూ లేకుండా లోపలికి తీసుకెళ్తాను."

హామీ యిచ్చాడు లక్ష్మణరావు.

రాత్రి తొమ్మిదిన్నర అవుతుండగా, హోటలు వద్దకు పోయి లక్ష్మణరావు గురించి అడిగాడు హరి.

తాను లక్ష్మణరావుకోసం వచ్చానని, హరి అనగానే యిద్దరు బలిష్టమయిన వ్యక్తులు బయటకువచ్చి అతన్ని రోడ్డు మీదకు లాక్కొచ్చి, జన్మలో మరిచిపోలేని నాలుగు గుద్దులు యిచ్చారు.

లక్ష్మణరావు జాగ్రత్తగా కాపాడుకుంటూ వస్తున్నదీ, హరి గ్రహించలేకపోయినదీ ఓ రహస్యం వుంది.

తమ హోటలుమీదగానీ, హోటలులో పనిచేసే ప్రముఖ వ్యక్తుల మీదగానీ, అఘాయిత్యం తలపెడ్తూన్నారన భోగట్టాగాని, తలపెట్టేవారి ఆచూకీగాని అందించే పని వాళ్ళకు ప్రత్యేక పారితోషికం యిచ్చి గౌరవిస్తుంది హోటలు యాజమాన్యం.

కార్లో తిరిగే హరి, హోటలు పనివాడయిన తనతో కల్పించుకుని స్నేహం చెయ్యబోయిన మొదటి రోజునే, లక్ష్మణరావుకు అనుమానం వచ్చింది.

తన యజమానులకు హరి విషయం చెప్పాడు. ఆ రోజున రిసెప్షన్ వద్ద అల్లరిచేసిన వ్యక్తేమోనని అడిగారు. హరి గుర్తులు చెప్పాడు లక్ష్మణరావు.

స్నేహం బాగా పెరుగనిచ్చి, హరి మనస్సులోని ఉద్దే శాల్ని వెలికి రాబట్టమన్నారు.

అందుకే, ప్రియోగురించి చెడ్డగా చెప్పి, హరిలో చెల రేగిన భావాల్ని లోతుగా తరచి చూశాడు లక్ష్మణరావు.

సాధారణంగా ప్రియోమీద మగాళ్ళకుండే భావావేశా నికి భిన్నమైనదేదో హరిలో వుందని లక్ష్మణరావు గ్రహిం చాడు.

ప్రియోను చూడ్డానికి హోటలుకువస్తే, ఆమెను సమీపం నుంచి, సన్నిహిత కోణాల్లో చూసే అవకాశం కల్పిస్తా నని హరిని ఊరించాడు.

హోటలుకు హరి రాగానే హోటలు రౌడీలచేత కొట్టిం చాడు.

# 7

హోటలు గూండాలు కొట్టిన దెబ్బల నొప్పి తగ్గడానికి వారంరోజులు పట్టింది హరికి.

మంచాన్నబడ్డ ఆ కొద్ది రోజులూ ప్రియోమీద తను తీసుకో వలసిన ప్రతీకారం గురించే ఆలోచించాడు.

ఇంతవరకూ తను ప్రియోను కలుసుకోలేకపోయాడు. అసలు, ఆమె ఎలాగుంటుందో తనకు తెలీదు. వెధవది! హోటల్లో పనిచేసే ఒక డాన్సింగ్ గర్ల్ గురించి తెలుసుకో లేకపోయాడు.

తన అసమర్థతను తిట్టుకున్నాడు కసిగా.

ఒక్కసారంటే, ఒక్కసారి ప్రియో తనకు కనిపిస్తే చాలు. తన పని పూర్తిచేసుకుంటాడు.

అయితే, ఆమెను కలుసుకోవడం ఎలా?

తీవ్రంగా ఆలోచించాడు.

చాలాసార్లు హోటలుముందు ,జట్లుజట్లుగా లోనికివెళ్తున్న అమ్మాయిల్ని చూశాడు. వారిలో ఒకామె తప్పక ప్రియో

అయుంటుంది.

వాడ్నీ, వీడ్నీ ప్రియోని చూపించమని, బ్రతిమాలుకోవ డానికి బదులు, తిన్నగా వెళ్ళి, ఆ అమ్మాయిల్నే అడిగేస్తే?

అడిగేస్తే ఫరవాలేదు కాని, అంతసులువుగా తమలో ప్రియో ఎవరో చెప్పకపోవచ్చు!

అన్ని వివరాలు కనుక్కున్నాకగాని, తమలో ప్రియో ఎవరో చెప్పడానికి నిరాకరించవచ్చు!

అటువంటి పరిస్థితి రాకూడదు! తను యీసారి రిస్కు తీసుకోదలుచుకోలేదు.

అయితే ఏంచెయ్యాలి?

కాసేపు ఆలోచించినమీదట, ఓ చక్కని ఊహతట్టింది.

తనకు ప్రియో తెలిసినట్టుగా, వెనకనుంచి 'మిస్ ప్రియో' అని పిలిస్తే, ప్రియో పేరున్న అమ్మాయి చప్పున వెనక్కి తిరిగి పలుకుతుంది.

దాంతో తను ప్రియోను గుర్తించే వ్యవహారం బహుతేలి కయిపోతుంది.

అక్కడికక్కడే ఆమెను క్షణం ఆలస్యం చెయ్యకుండా కాల్చిచంపెయ్యాలి.

తన ఆశయం అలాగ నెరవేరుతుంది.

రాత్రి ఎనిమిదిగంటలవుతుండగా, నీటుగా డ్రెస్ చేసు కుని, హోటలుముందు కార్లాగే స్థలానికి కాస్త దూరంగా తన కారాపి కూచున్నాడు హరి.

తొమ్మిది అవుతుండగా, జనం రావడం ఎక్కువయ్యింది. ఎప్పటిలా వచ్చే అమ్మాయిలున్న కారు రాకకోసం ఎదురు చూస్తున్నాడు.

చాలాసేపటివరకూ, అలాంటి కారేమీ అగపడలేదు. తను రాకముందే, అమ్మాయిలకారు వచ్చేసిందేమోనని, అను మానం వచ్చిం దతడికి.

నిరాశతో నలిగిపోతున్న సమయంలో, ఓ కారొచ్చి హోటలు ముందాగింది.

అందులోంచి అయిదుగురు అమ్మాయిలు దిగారు.

వాళ్ళ వాలకంబట్టి, డాన్సింగ్ గర్ల్స్ అని పోల్చుకున్నాడు హరి.

వాళ్ళల్లో వాళ్ళు కిచకిచమాట్లాడుకుంటూ, మధ్యమధ్య కిసుక్కున నవ్వుకుంటూ, హోటలు ద్వారంవైపు తాపీగా నడుచుకుంటూ పోసాగారు.

వాళ్ళను చూడగానే హరి గుండెలు ఆనందోద్రేకంలో కొట్టుకోసాగాయి.

తన ఆశయం నెరవేరబోతోంది! ప్రియోను హతమార్చే తరుణం వచ్చింది!

నెమ్మదిగా కార్లోంచి బయటకు వచ్చాడు. కోటుజేబు ఓసారి తడిమి చూసుకున్నాడు. లోడ్ చేసిన పిస్టలు తగిలింది. బరువుగా.

అమ్మాయిల్ని ద్వారంవరకు వెళ్ళనివ్వదలుచుకున్నాడు.

అమ్మాయిలు నడుస్తున్నారు.

వారిప్పుడు హోటలు ద్వారానికి అయిదారు గజాల దూరంలో వున్నారు.

ఈ లోకాన్నే మర్చిపోయి, దేనిగురించో చర్చించుకుంటున్నారు తమలో తాము.

“మిస్ ప్రియో!”

పిలిచాడు హరి.

ఎవరూ పలక లేదు.

“మిస్ ప్రియో!”

మళ్ళా పిలిచాడు.

ఈసారికూడా ఎవరూ పలక లేదు. తమ ధోరణిలో తాము వున్నారు.

నిరుత్సాహం తొంగిచూసింది అతడిలో.

ఇంకో రెండుమూడు నిముషాల్లో వాళ్ళు లోనికి వెళ్ళిపోతారు. ఈ అవకాశం మళ్ళా దొరుకుతుందో? లేదో?

కొంపదీసి, వాళ్ళల్లో ప్రియో లేదేమో? అయినా, ఇంకోసారి, ప్రయత్నిస్తే ఏంపోయింది? అనుకున్నాడు.

"మిస్ ప్రియో!"

మూడోసారి పిలిచాడు.

ఈసారి మాట విన్పడినట్టుంది. ఒక అమ్మాయి వెనక్కి తిరిగి చూసింది. మిగతా అమ్మాయిలుకూడా, ఆ తరువాత వెనక్కి చూశారు.

ప్రియో ఎవరో తనకు తెలిసింది చివరికి.

క్షణంకూడా ఆలస్యం చెయ్యకుండా, జేబులోంచి పిస్టలు తీసి, మొదట తిరిగి చూసిన అమ్మాయివైపు గురిచూసి కాల్చాడు.

గుండు ఆమెను అందుకుంది. ఆ అమ్మాయి నేల కూలిపోయింది, గుండెపట్టుకుని. మిగతా అమ్మాయిలు భీతిల్లారు. త్వరత్వరగా పరుగెత్తి, అందుబాటయిన స్థలాల్లో దాక్కున్నారు.

అయిదు నిముషాల్లో, ఆ ప్రదేశం అంతా గందరగోళంగా మారిపోయింది.

ఏమిటి జరిగిందో, జరగబోతోందో, ఎవరికి తెలియలేదు. తెలిసిందల్లా, ఎవరో, ఎవరోన్ను, పిస్టలుతో కాల్చిచంపారు.

ఎందుకు? ఏ ఉద్దేశంతో? కొంపదీసి, వాడో మేనియాక్ కాదుకదా?

అంతే!

ఒకరొన్కరు, గుద్దుకుంటూ, దాక్కోవడానికి స్థలాలు వెతుక్కుంటూ పరుగులు తీయసాగారు.

ఈ లోపున ఎవరో వెనుకనుంచి వారిమీద దుమికి,

బంధించడానికి ప్రయత్నించారు. కాని, హారి అతనికి పట్టుబడలేదు. పరుగులుతీస్తున్న జనంలో కలిసిపోయాడు.

ఆదేసమయంలో, యింకొకరు, "మిస్ రీటాను హత్య చేశాడు. హంతకుడ్ని పట్టుకోండి. పట్టుకోండి" అని అరిచారు హారి పారిపోతున్న దిక్కువైపు చేయిచూపిస్తూ.

ఆ మాటలు హారి చెవుల్లో పడ్డాయి. పరుగెడుతున్నాడన్నమాటేగాని, అతని హృదయం దిగులుతో బరువెక్కిపోయింది.

ఎంత పనయిపోయింది! అమాయకురాలెవరో ప్రాణం పోగొట్టుకుంది! ఈసారికూడా, ప్రియో తననుంచి తప్పించుకుంది.

రీటా గురించి ఎంతో విచారించాడు.

కాని, వెంటనే గుండె దిటవు చేసుకొన్నాడు. ప్రియోను నాశనం చేసేంతవరకూ తను బ్రతికుండాలి.

అందుకయినా, తను తప్పించుకుని, పోలీసుల చేతుల్లో పడకుండా పారిపోవాలి.

శక్తంతా కూడగట్టుకుని పరుగుదీశాడు. ఒక్కదూకు దూకాడు తన కార్లోకి.

కారును స్టార్టుచేసి, ముందుకు దూకించాడు అతివేగంగా.

ఇంకో కారేదీ తనను వెంటాడటంలేదని నిర్ధారణ చేసుకునేంతవరకూ, సందులూ, గొందులూ త్రిప్పి, చివరకు ఇంటి త్రోవ పట్టించాడు.

# 8

అప్పటికి ఆరు పెగ్గుల బ్రాందీ త్రాగింది ప్రియో. కాని, ఆమె గుండెల్లో వణుకు యింకా తగ్గలేదు.

ఆవాళ రాత్రి తన డాన్సింగ్ అయిటమ్ వుంది. రీటా చనిపోవటంవల్ల, ఆవాళ్టి కార్యక్రమం అంతా రద్దయి

పోయింది. ఒకవేళ ఉన్నా, తను డాన్ని చేయగలిగుండేది కాదు.

కాల్చేముందు, హంతకుడు మూడుసార్లు తన పేరు పిలిచాడట.

తనులో ప్రియో లేకుండా, ప్రియో అంటూ అదేపనిగా పిలుస్తున్న దెవరా అని కుతూహలంగా వెనక్కి తిరిగింది మిస్ రీటా.

వెనక్కి తిరిగింది కాబట్టి, రీటాయే తాననుకుని హంతకుడు పిస్టలు పేల్చాడు. ప్రాణాలు వదులుతూ రీటా చెప్పిందంతా.

తను కూడా వారితో ఆ రోజు షాపింగ్ కు వెళ్ళాల్సిందే. తప్పకరమ్మని తనను చాలా పట్టుబట్టారుకూడా.

ఎందుకో తనకు వెళ్ళాలనిపించలేదు.

తను వాళ్ళమధ్య వుంటే, తనను పేరు పెట్టి పిలవగానే, తను వెంటనే పలికివుండేది. హంతకుడు తన ప్రాణాలు తీసివుండేవాడు.

ఆ మెగుండెలు ఇంకా జోరుగా కొట్టుకోసాగాయి. ఇంకో పెగ్గు బ్రాండీ గొంతులో పోసుకుంది.

పోలీసులు వచ్చారు. మొక్కుబడిగా కొన్ని ప్రశ్నలు వేశారు. జవాబులు ఇచ్చింది.

"మీ కెవరయినా విరోధులున్నారా?" అని అడిగారు.

"ఉన్నారనీ చెప్పొచ్చు. లేరనీ చెప్పొచ్చు!" అని జవాబిచ్చింది.

"అలా జవాబిస్తే చిరాకుల్లో పడ్తారు. విరోధులు లేరని చెప్పండి. రిపోర్టులో కూడా అలా రాసుకుంటాం" అన్నాడు దర్యాప్తు జరిపిస్తున్న ఇన్ స్పెక్టరు.

ఇంకా, యేవేవో ప్రశ్నలు అతడడగబోతుంటే, "నా మనస్సు బాగాలేదు. రేపు రండి అంతగా కావలిస్తే" అని తను అంటే, మారు మాటాడకుండా వెళ్ళిపోయాడు ఇన

స్పెక్టరు.

తన హోటల్ని ధిక్కరించి, అతడు ఒక్కక్షణం నిలవలేడు. అతని పై అధికారులువస్తే, ఖుషీ చేసి పంపేది, తనూ తన హోటలే.

నిజానికి పోలీసుడిపార్టుమెంటంతా తన పక్షం ఉంటుంది. తనకు సర్వవేళల్లో, రక్షణ ఇవ్వడానికి వెనుకాడరు. కాని, ఆపద యెటునుంచి, యెలా ముంచుకు వస్తుందో?

తనని చంపడానికి పూనుకొన్నవ్యక్తి యెవరో తనకు తెలీదు. రీటాని కాల్చినపుడు కొందరతన్ని చూశారుగాని, స్పష్టంగా గుర్తుపెట్టుకోలేకపోయారు, రాత్రిపూట కావడం వలన.

నల్లకళ్ళద్దాలు పెట్టుకుని, హేటు బాగా ముందుకు లాగి పెట్టుకున్నాడట.

ఈ మధ్య ఒకాయన, తన పేరు చెప్పకుండా 'ప్రియోతో మాట్లాడాలి' అన్నాడట. కారణం చెప్పమంటే, ఆమెతోనే తప్ప, ఇంకెవరితోనూ చెప్పనన్నాడట.

తలబిరుసుగా మాట్లాడుతున్నాడు. అల్లరి పెట్టడానికి వచ్చాడేమోనని, సెక్యూరిటీ వాళ్ళతో చెప్పి, అతడ్ని బయటకు పంపేసింది రిసెప్షనిస్టు. అతడే, పనివాడు లక్ష్మణరావుతో స్నేహంచేసి, తను యెక్కడుంటున్నదీ వివరాలు అడిగాడట.

కాని, అతనే, రీటాను హత్యచేశాడనడానికి ఆధారాలు లేవు. పైగా, హోటల్లో అల్లర్లు మామూలే. అందుకేగా సెక్యూరిటీ స్టాఫ్‌ను పోషిస్తున్నది హోటలు.

యేది యేమయినప్పటికీ, తన ప్రాణాలకోసం ఒక హంతకుడు వెంటాడుతున్నాడన్నది ఖాయం!

ప్రతి క్షణం పోలీసులు తనను రక్షిస్తారన్నది అసంభవం! తన జాగ్రత్తలో తనువుండాలి. ఎంతో అవసరమయితే తప్ప

హోటలు దాటి బయటకు వెళ్ళకూడదు.

వీలయినంతవరకూ, పనివాళ్ళను పంపించి పనులు చేయించు కోవాలి.

అయినా, అంతటి నిరాశలోనూ, ఒక ఆశా రేఖ!

తనెలాగుంటుందో హంతకుడికి తెలియదు. తనను చంపి వేశానన్న భ్రాంతిలో అతనువుంటే, తను బ్రతికిపోయినట్టే.

తన ఆలోచనలు కట్టిపెట్టి నిద్ర తెచ్చుకోవడానికి ప్రయత్నించింది ప్రియో. కాని, లాభం లేకపోయింది. తెల్లవారు ఝామున యెప్పుడో చిన్న కునుకు పట్టింది.

# 9

ఊర్లోకి మంచి ఇంగ్లీషు సినిమా వచ్చింది. చూడాలని యెంతో ఉబలాటంగా వుంది ప్రియోకు.

అదీగాకుండా నెల రోజుల్నుండీ, హోటలు గేటుదాటి రోడ్డుముఖం చూసి యెరుగదేమో, తెగబోరుకొడుతోంది.

సినిమాకి వెళ్ళాలని నిశ్చయించుకుంది.

సినిమాహాలుకు ఫోనుచేసి, రెండో ఆటకు ఒకే ఒక్క టిక్కెట్టు రిజర్వు చేసుకొంది. సినిమా చూడ్డానికి తను వెళ్తున్నట్టు యెవరికీ తెలియడం ఇష్టంలేదామెకు. ఓ మాటగా మాత్రం మేనేజరుతో చెప్పింది.

"సెక్యూరిటీస్టాఫ్‌ను తీసుకెళ్ళకూడదూ?" అడిగాడు.

"ఆ హడావుడే నా కిష్టంలేదు. సడి చప్పుడూ చెయ్యకుండా, వెళ్ళి వచ్చేద్దామనుకుంటున్నాను" అని ప్రియో చెప్పగానే, "మీయిష్టం" అని వూరుకున్నాడు మేనేజరు.

టిక్కెట్టు రిజర్వు చేసుకున్నప్పుడే, అసలు ఆట ఎన్ని గంటలకు ఆరంభమవుతుందో కనుక్కుంది.

పావు తక్కువ పది అవుతుండగా, నిశ్శబ్దంగా హాలులోకి వెళ్ళి కూచుంది.

తనసీటు యిద్దరు మగవాళ్ళమధ్య పడినా, ఇబ్బంది అనుకోకుండా కూచుంది.

అప్పుడే ఆట ప్రారంభమయింది. తను పడుతున్న మానసిక యాతనంతా మరచిపోయి, సినిమా కథలో లీనమయిపోయింది ప్రియా.

ఇంటర్వెల్ అయింది. లైట్లు వెలగడంతో ప్రియాకి కుడివైపునున్న వ్యక్తి ఆమెవైపు చూశాడు. ఆమెను చూడగానే, చిరునవ్వు నవ్వి, "హలో! మిస్ ప్రియా!"అనిశాస్త్ర గట్టిగానే పలకరించాడు.

సరిగ్గా ఆమెకు వెనుక వరుసలో కూచున్న హరి ఆ మాటలు వినగానే త్రుళ్ళిపడ్డాడు. అదృష్టం ఎగిరివచ్చి తన వొళ్ళో వాలిందనుకున్నాడు.

జంతువు వెతుక్కొని వెతుక్కొనివచ్చి వల్లో పడినట్లయింది.

ఒక్క వుదుటున ముందుకువంగి ఆమె మెడమీద చేతులు బిగించి, "మిస్ ప్రియా! యింకనన్ను తప్పించుకోలేవు" అన్నాడు కర్కశంగా.

అంతే!

ప్రియా కెవ్వున కేక వేసి, తన మెడను చుట్టేసిన అతని చేతుల్ని ఒక్క దెబ్బతో విసిరికొట్టేసింది.

జనంలోకి పరుగెత్తింది.

అప్పుడే లేచి, బయటకు వెళ్ళబోతున్న ప్రేక్షకులు, ఆగిపోయి నిలుచుని, విచిత్రంగా చూడసాగారు, పరుగెత్తుతున్న ఆ యిద్దరివైపు.

ప్రియా యించుమించు పిచ్చిదానిలా అయిపోయింది. ఏ హంతకుడి హస్తాల్లోంచి తనిన్నాళ్లూ తప్పించుకోవాలని, హోటలు బయటకు రాకుండా గడిపిందో, ఆ వ్యక్తి చేతులకే తిన్నగా వచ్చి దొరికిపోయింది.

యెటు వెళ్తోందో, ఆమెకే తెలియడం లేదు. డేగ పట్టు

తప్పించుకోవాలని పారిపోతున్న కోడిపిల్లలా జనంలోంచి ముందుకు దూసుకుపోతోంది.

"ఇవాళ నన్ను తప్పించుకో లేవు. ఎటుపోయినా, నిన్ను పట్టుకుని తీరతాను."

అంటూ ఆమె వెనుక పరుగెడుతున్నాడు హరి.

ముందు ప్రియో, ఆ వెనుక హరి, తమ మీదకు వచ్చిపడి, తోసుకుని వెళ్ళిపోతుంటే, ఆడవాళ్ళు కెవ్వున కేకలు వేస్తున్నారు.

"ఏమిటీ న్యూసెన్సు" అంటూ మగాళ్లు బయటకు చిరాకు కనపరిచినా, ఆమె పరిగెడుతోంటే, బరువుగా ఊగి పడుతున్న ఆమె వక్షోలవైపు ఆశగా చూస్తూ, ఆనందిస్తున్నారు.

ప్రియో, యెలాగయితేనేం, జనాన్ని అడ్డు చేసుకుని, హరికి అందకుండా బయటకు వచ్చి, తన కార్లోకి దూకింది. దూకడమే తడవుగా స్టార్టు చేసింది. ముందుకు ఉరికించింది.

ప్రియో కారు గేటుదాటి పోతుంటే, అప్పుడు చూశాడు హరి వెలుపలికి వచ్చి.

హరి కూడా, తన కార్లోకి దూకి, ఆమె వెనుక పరుగెత్తించ సాగాడు.

రోడ్డుమీద యేం జరిగినా లక్ష్యపెట్టే స్థితిలో లేరు యిద్దరూ.

ఎన్ని బళ్ళకు డాష్ యిచ్చారో, వారికే తెలీదు.

ప్రియో కళ్ళు రియర్ వ్యూ మిర్రర్ మీదే వున్నాయి. హరి దృష్టి, ముందుకు జారిపోతున్న ప్రియో కారు మీదే వుంది.

కారు యెంత వేగంగా నడిపినా, హరి ఆమెను అందుకో లేకపోయాడు.

ఆమె హోటలు చేరుకొంది సురక్షితంగా.

# 10

సినిమా హాల్లో హరి తనని చూసి వెంటాడిన రోజునుండీ, ప్రియా పూర్తిగా హోటలు బయటికి రావడం మానేసింది.

వెళ్ళక వెళ్ళక, నెలరోజుల తర్వాత సినిమాకి వెళితే, ఆ రోజే అతను కూడా సినిమాకు రావాలా? వచ్చినా, తను కూచున్న క్లాసులో, తన వెనుక వరుసలో, కూచోవాలా?

ఇంత జరిగినా, ప్రక్కనున్నాయన తనని పలకరించకుండా ఉండి ఉంటే, హంతకుడు తనని గుర్తుపట్టి ఉండేవాడు కాదు. హాయిగా సినిమా చూసి వచ్చేసి ఉండేది.

ఆ రోజు ఆ సంఘటన తలంపుకు వచ్చిన ప్రతీసారీ, ప్రియా గుండెల్లో వణుకు కలగక మానలేదు.

ఆ రోజు వరకూ, తనను హంతకుడు చూల్లేదు, తనను గుర్తుపట్టలేడు అన్న తృప్తి ఉండేది. కాని, అది కాస్తా ఎగిరిపోయింది.

ఆ విషయం గుర్తుకు వచ్చినప్పుడల్లా, ప్రియా మనస్సు అంతులేని దిగులుతో బరువెక్కిపోతోంది.

అయితే, అతన్ని తనుకూడా చూసింది. అతన్ని ఇప్పుడు తను గుర్తుపట్టగలదు.

యెప్పుడో ఒకప్పుడు, హఠాత్తుగా హంతకుడు మీద పడతాడేమో నన్న భయం యిప్పుడు తొలగిపోయింది. ఆ వ్యక్తిని చూడగానే, తన జాగ్రత్తలో తను ఉండగలదు.

మనస్సుని ముట్టడించిన ఆలోచనల్ని తరిమికొట్టి, లైట్లు తీసేసి, మంచం మీద పడుకుని నిద్ర తెచ్చుకోవడానికి గట్టి ప్రయత్నం చేసింది.

ఫలితం లేకపోయింది.

మంచం మీంచి లేచి, లైట్లు వేసింది. బజ్జర్ నొక్కింది. ఓ పనివాడు ప్రత్యక్షమయ్యాడు.

"జాన్ని పిలు."

పనివాడు తలూపి వెళ్ళాడు.

నిద్రతో బరువెక్కి మూసుకు పోతున్న కళ్ళతోటి, అదే పనిగా ఆవలింతలతో సతమత మవుతూ, ప్రియా గదిలోకి వచ్చాడు జాన్. తొందరగా వేసుకోవడంవల్ల, అతని వొంటి మీది బట్టలు అస్తవ్యస్తంగా వున్నాయి.

"అదృష్టవంతుడివి జాన్."

తను చూపిన సోఫాలో కూచున్న జాన్‌తో అంది ప్రియా.

"యేం? అలాగంటున్నావ్!"

కళ్ళు నులుముకుని, నిద్రను తరిమేయాలని ప్రయత్నిస్తూ అన్నాడు జాన్.

"పీకలదాకాతింటావ్. ఒళ్లు తెలియకుండానిద్రపోతావు."

"ఇది చెప్పడానికా, నిద్రలేపావ్?"

తన నిద్ర చెడగొట్టిందన్న ఉక్రోషం ఉంది జాన్ మాటల్లో.

"యెంత గింజుకున్నా, నిద్ర రావడంలేదు జాన్. ఆరు పెగ్గులు బ్రాందీ బిగించాను. లాభంలేక పోయింది. కాస్త కబుర్లు చెప్తా వేమోనని పిలిపించాను."

అంది ప్రియా, వెనుకనున్న తలగడ దొంతర్ల మీద ఒరిగి పోతూ.

ఆమె అలా కూచోవడంతో, ఆమె నైట్ గౌను చీలి. నునుపుగా, మస్తుగా పెరిగిన తొడలు జాన్‌కి ఊరిస్తూ దర్శన మిచ్చాయి.

జాన్ నిద్ర దెబ్బతో యెగిరి పోయింది. మెరుస్తున్న కళ్ళతో, ఆమె తొడల నిగనిగల వైపు మతిపోయినట్లుగా చూస్తూ ఉండిపోయాడు.

అతని కళ్ళల్లోని పశువాంఛ అర్థం చేసుకొంది ప్రియా, "ఇడియట్! వెధవాలోచనలు కట్టిపెట్టు. నాకు చాలా చిరాగ్గా వుంది."

అరిచింది ప్రియో కోపంగా.

జాన్ మామ్మూలు మనిషయ్యాడు. మళ్లా, అతడికి ఆవలింతలు, కళ్లు బరువుగా మూతబడడాలు ఆరంభమయ్యాయి.

"తిండీ, సెక్సూ తప్ప నీకు యింకోటి అర్థం కాదనుకుంటాను."

అంది విసుగ్గా. కాని, నడుంకు దిగువున చీలిపోయిన నైట్‌గౌను సరిచేసుకోలేదు.

"అందుకు కాపోతే, యింకెందుకు బ్రతుకుతున్నది?"

నసిగాడు జాన్.

"అవి తప్పితే, బ్రతుక్కి యింకో పరమావధి లేదా?"

జాన్ అభిప్రాయాల మీద చిరాకంతా ఆ మాటల్లో జొప్పించింది ప్రియో.

"నువ్వు లైఫ్ మాగజైన్ చదువుతావు కదూ?"

"అవును. కాని, అదిప్పుడు రావడం లేదు."

"నాలుగేళ్ళ క్రితం ఓ వ్యాసం పడింది. చదివావా?"

"యేంటది?"

"మనిషి యెక్కువకాలం బ్రతకాలంటే, సెక్సు ఆట ఉండాలి నిత్యమూ అని."

"వాడెవడో నీలాంటి మదపిచ్చి వాడిలాగే ఉన్నాడు."

"నువ్వెవరు చెబితే నమ్ముతావు?"

"ఒక సైంటిస్టు చెబితే."

"ఇద్దరు ముగ్గురు సైంటిస్టులు చెప్పిన విషయాల సమ్మేళనం అది."

"నిజంగా!"

"ఒట్టు."

"నీ ఒట్టు నమ్మేదెవడు లెద్దూ!"

"నిన్ను నమ్మించాలంటే యేం చెయ్యమంటావో నువ్వే చెప్పు."

ప్రియో మాటాడలేదు. పందెం గుర్రంలా అవుపిస్తున్న జాన్ వైపు చూస్తూ కూర్చుంది.

నిత్యమూ, శరీర పరిశ్రమ చేస్తున్న వాడి శరీరంలా వుంటుంది జాన్ శరీరం. అందంగా ఒంపులు తీరిన కండలతో, ఆరోగ్యంతో నిగనిగలాడుతూ ఉంటుంది.

కాని, జాన్ యెన్నడూ కసరత్తు చేస్తున్నట్టు అవుపించదు. గొంతులో వేలు పెడితే, తగిలేలాగు తినేస్తాడు. రాత్రికి ఆడుకోవడానికి, డాన్సింగ్ గర్ల్సులో యెవర్నో ఒకర్ని తీసుకుపోయి, రెండు మూడు గంటలు గడుపుతాడు గదిలో.

ఆ తరువాత, మూడవ ప్రపంచ యుద్ధం వచ్చినా లేవకుండా నిద్రపోతాడు.

"ఇప్పుడు నువ్వున్నావు. వాడెవడో నిన్ను చంపుతాడన్న భయంవల్ల నీకు నిద్ర రావడంలేదు. డ్రింకు తీసుకున్నావు నిద్రవస్తుందని. కాని, లాభంలేకపోయింది. ఎందుచేత? నీ నరాలమీద డ్రింకు పనిచేసి వాటిని ఇంకా వుద్రేకపరుస్తోంది. నీకు నిద్ర ఇంకా దూరమైపోతుందంటే ఆశ్చర్యమేముంది?"

"అయితే, యేమంటావ్? నిన్నిప్పుడు నా ప్రక్కలోకి రానివ్వమంటావ్?"

"అదుగో! అందుకే నాకు ఒళ్ళు మండుతుంది. ఇంతవరకూ మిస్ క్లియోతో తృప్తిదీరా ఆడుకొన్నాను. మళ్ళా రేపటివరకూ, నాకా అవసరం లేదు. అవతలి వాళ్ళు కావాలనుకుంటే తప్ప."

"సరేలే! నీ పిచ్చి వేదాంతం గురించి మాట్లాడు."

"నీ నరాలకు విశ్రాంతి కావాలి. అందుకు బాగా వాటిని అలవగొట్టాలి. అందుకు ప్రేమకలాపానికి మించిన మందు లేదు."

"అయితే, నువ్వెళ్ళొచ్చు."

"మిస్ ప్రియో! నన్ను కావాలనే పిలిచావనుకుని, ఎంతో ఆశతో వచ్చాను. డబ్బిచ్చేవాళ్ళు తప్ప ఇంకెవరూ నీకు అనరు."

అంటూ లేచి వెళ్ళిపోయాడు జాన్ కోపంగా.

జాన్ వెళ్ళిపోతూ, మూసిన తలుపువైపు చూస్తూ ఆలోచనల్లో పడింది ప్రియో.

సెక్స్, తిండి తప్ప ఇంకో విషయం ఆ తలలోకి జొరబడదా? జాన్ గురించి అనుకుంటోంది.

లైటు ఆర్పేసి, మళ్ళా నిద్రపోవడానికి ప్రయత్నించింది. యీసారి సఫలీకృతురాలయింది.

మెల్ల మెల్లగా చీకటి లోయల్లోకి జారిపోతోంది. నరాల్లో మొండిగా వుండిపోయిన 'టెన్షన్' నెమ్మదిగా తప్పుకుంటోంది. ఒళ్లు తేలిగ్గా అయిపోతోంది.

"క్లిక్."

ఎవరో తలుపు తెరిచినట్టు చప్పుడు!

ఎవరది? యెందుకు?

మళ్ళా నరాల్లో టెన్షన్ రెచ్చుతోంది.

'ఛ! ఛ! ఆలోచనలు కట్టిపెట్టి నిద్రపోవడానికి ప్రయత్నించాలి. ఎవరో తమగది తెరుచుకుని వెళ్ళడమో, లోనికి రావడమో చేస్తున్నారు. అదేమిటి? ఇదేమిటి? అనవసరంగా బుర్ర పాడుచేసుకోకూడదు.'

అనుకుంటోంది ప్రియో.

మళ్ళా చిక్కని చీకటి పొరల దొంతర్ల దిగువకు వెళ్ళిపోతోంది ఆమె.

అబ్బా! నాలుగు రోజులకు పైగా అయింది హాయిగా నిద్రపోయి. కమ్మని నిద్ర!!!

"క్లిక్."

మళ్ళా శబ్దం వింది.

అదే శబ్దం!

లాభంలేదు. నిద్రపోతూ ఊరుకోకూడదు. లేచి అదే ఏమిటో కనుక్కోవాలి.

టక్కున మెలకువ వచ్చిందామెకు.

లేచి, బెడ్ లైటు వేయబోతూ, యథాలాపంగా తలుపు వైపు చూసింది.

అక్కడేమీ లేదుగాని, దాని ప్రక్కగా ఉన్న కిటికీ గ్లాసుమీద యెవరిదో మనిషి నీడ!!

ప్రియో గుండెలు గుభేలు మన్నాయి. లైటు వేయలేక పోయింది.

యెవరా వ్యక్తి?

హంతకుడేమో? ఆమెకు ముచ్చెమటలు పోయసాగాయి.

తలుపు తీసి చూసి, యెవరో కనుక్కుంటేనో?

లేచి, తలుపు దగ్గరకు నడిచింది.

కాని, తలుపు తెరవడానికి ధైర్యం చాలలేదు. అయితే, ఏంచేయాలి తను?

సెక్యూరిటీని పిలవాలా? ఈ అర్ధరాత్రి అందరూఎక్కడో తప్పత్రాగి పడుకునుంటారు. పైగా—

అలాచేస్తే, తనెక్కడుందో చాటుకున్నట్టు అవుతుంది. అలా చెయ్యడానికి వీలులేదు.

చప్పుడు చెయ్యకుండా, అక్కడ్నుంచి జారుకుని, తెల్లవారేవరకూ, సముద్రపొడ్డున, ఇసుక దిబ్బల్లో గడపడమే మంచిది అనుకొంది.

బాత్ రూంలోకి ప్రవేశించింది. ప్రక్కగదినీ, తనున్న గదినీ, వేరుపరుస్తూ, ఒకచిన్న తలుపుంది. దాని బోల్టు తన గదివైపు ఉంది. దాన్ని తీసింది. అవతలవాళ్ళు బోల్టు వెయ్యకపోవడంవల్ల, సులువుగా తలుపు తెరుచుకుంది.

ఆ గదిలో పడుకున్న వ్యక్తి యెవరోగాని, మత్తుగా నిద్ర పోతున్నాడు గుర్రుపెట్టి.

గదిలో నిలుచుని, కిటికీగ్లాసు తలుపులవైపు చూసింది. ఆ మనిషి నీడ యీసారి యిటు కదిలి వచ్చింది.

డోర్ నాబ్ మీద ఆ వ్యక్తి వచ్చి చెయ్యి వేసేలోపున రెండోవైపు బాత్ రూంలోకి పరుగెత్తింది.

బోల్టు తీసింది. అవతల గదివాళ్లు బోల్టు వెయ్యలేదు లాగుంది. తలుపులు తెరుచుకున్నాయి కష్టంలేకుండా.

ఆ గదిలో వున్నవాళ్లు, భార్యాభర్తలు కాబోలు, అర్ధ రాత్రి ఆటలో మునిగివున్నారు.

తమ గదిలో చప్పుడు కాగానే, బెదిరిపోయిన పక్షుల మిథునంలాగు వారిద్దరూ మంచంమీంచి దిగువకు దూకి తమ బట్టలకోసం పరుగెత్తారు.

వాళ్ళ భయాందోళనలు చూస్తుంటే, వాళ్లు భార్యా భర్తలు కారని, ప్రేయసీ ప్రియులని తెలుసుకుంది ప్రియో

"గాభరాపడకండి! మీ పని మీరు కానివ్వండి."

గుసగుసలాడింది ప్రియో.

వాళ్ళ ఆరాటం తగ్గింది అంతటితో. మంచం వద్దకు చేరు కున్నారు మళ్ళా.

ప్రియో మళ్లా ఎదురుగావున్న బాత్ రూంకు పరుగెత్తింది.

ఆ వ్యక్తి ప్రతి గదిలోకి వచ్చి యేంచేస్తున్నట్టు? తెలుసు కోవాలనిపించింది ఆమెకు.

బాత్ రూంలో ఆగి, గదిలోని చప్పుళ్లు వినసాగింది.

ఆ వ్యక్తి తలుపు తెరిచినట్టున్నాడు. క్లిక్ మన్న శబ్దం విన్పడింది.

తను గదిలో జొరబడగానే, ఆత్రంగా లేచిపోయిన స్త్రీ పురుషులు ఆ వ్యక్తిని చూడగానే మళ్ళీ ఆత్రుత చెందారు. కాసేపయాక,

"నా గదనుకున్నాను. ఐ యామ్ వెరీసారీ" అంటూ తలుపు మళ్ళా దగ్గరగా వేసిన చప్పుడు విన్పించింది.

ప్రతిగదీ, యిలాగే పరీక్షించుకు వస్తున్నాడు. అతడు హంతకుడు కావచ్చునన్నది ఆమెకు రూఢి అయిపోయింది. అతను తనకోసమే వెతుకుతున్నాడు ఏ గదిలోనైనా కని పించవచ్చుననీ తలుపు తెరచినవాళ్లు వేరేవాళ్ళు కావడంతో 'సారీ' చెప్పి తప్పుకుంటున్నాడు.

మరి, ముందుకుపోకుండా, మళ్ళీ తనగదికి వెళ్ళిపోతే!... అనుకుంది.

సముద్రపొడ్డుకు పోవాలన్న తన మనస్సు మార్చుకుంది. వచ్చిన మార్గాన్నే, తన గది చేరుకుంది.

తన గదిలో అడుగు పెట్టగానే, ఆమె ఆలోచనలు ఇంకో ధోరణిలో సాగాయి.

మళ్ళా అతడు యిటువైపువచ్చి, తనకు అనుమానం వున్న దులన్నీ మళ్ళీ పరీక్షిస్తే?

అవును! అతను అలా చేస్తే తను దొరికిపోయే అవకాశం వుంది.

అతను అలా ముందుకు పోతున్నప్పుడే, తను క్రింది గదుల్లోకి వెళ్ళిపోయి, అక్కడ్నుంచి సముద్రపొడ్డుకు చేరే ప్రయత్నం చెయ్యాలి!

అతిజాగ్రత్తగా తలుపు తెరిచింది. దడదడలాడిపోతున్న గుండెలతో ఆ వ్యక్తి నిలుచున్న కారిడార్ లోకి చూసింది.

ఆ వ్యక్తి ఓ గదిముందు నిలుచున్నాడు.

ఆ వ్యక్తిని ఇప్పుడు పోల్చుకుంది. తన భయం అర్ధరహితం కాదనుకుంది ప్రియా.

సినిమాహాల్లో తనమీదకు దూకిన హంతకుడే అతడు.

కాళ్ళ క్రింద నేల ప్రక్కకు జరిగిపోయి, అక్కడే అలా అలా భూమిలోకి క్రుంగిపోతున్నట్టుగా అనిపించిందామెకు

ఒక్క క్షణం.

తల విదిలించి మళ్ళీ కారిడార్ లోకి చూసింది. అతను అక్కడ లేడు. ఏదో గదిలోకి వెళ్ళినట్టున్నాడు.

గబగబా వెలుపలికివచ్చి, రెండు నిముషాల్లో కారిడార్ దాటేసి, మేడ దిగిపోయింది ప్రియో.

# 11

విసుగులేకుండా ప్రతి గదీ వెతికాడు హరి ప్రియోకోసం. తను వెదికిన గదిలో ప్రియో లేదని బాగా నిర్ధారణ చేసుకున్నాక గాని, రెండో గదికి వెళ్ళడంలేదు, మొదటి గదిలోని వాళ్ళకు 'క్షమాపణ' చెప్పకొని.

అన్ని గదులూ వెదికాడు. మేడమీది గదుల్లోగాని, దిగువనగాని ప్రియో లేదు.

గదులు వెతకడంలో తను పొరపాటు చెయ్యలేదు. అలాంటప్పుడు, హోటల్లో లేకుండా, ప్రియో ఎక్కడికి వెళ్ళగా తుంది?

ఒక్క గదిమాత్రం తనకు అనుమానంగా తోచింది. గదిలో ఎవరూ లేరు.

గదిలో వ్యక్తి, బాత్ రూంకిగాని, దిగువకుగాని వెళ్ళి వుండొచ్చని, ఆ వ్యక్తి ఎపుడు తిరిగొస్తాడా అని చాలా సేపు ఎదురుచూశాడు హరి.

ఎంత సేపటికీ, ఎవరూ రాలేదు.

ఆ గదిని, అలా రెండుసార్లు పరిశీలించి చూశాడు. కాని, ఫలితం లేకపోయింది.

ఏమీతోచక, కారిడార్ చివరికంతాపోయి ఓ స్టార్ హోటలు వెనుకభాగంవైపు కలియజూసాడు.

బయట పుచ్చపువ్వులా కాస్తున్న వెన్నెట్లో, స్విమ్మింగ్ పూలు, దాని ప్రక్కనున్న స్నానాల గదులు స్పష్టంగా అవుపించాయి.

ఆదే సమయంలో స్విమ్మింగ్ పూలు వెనుకనున్న కర్ర గేటు తెరుచుకుని, ఎవరో బయటికి ఆత్రంగా కదిలి వెళుతున్న ట్టుగా కనిపించారు.

ఎవరది?

దృష్టి నిదానించాడు.

ఆమె ఒక స్త్రీ!

ఆమె ప్రియో యేమో?

ఆవేశంతో గుబగుబలాడిపోయాయి వారి గుండెలు.

ఆమె యిసుక తిన్నెలవైపు నడుస్తోంది.

ఇంత రాత్రివేళ, ఎవరికయినా, యిసుక తిన్నెలవైపు వెళ్ళవలసిన అవసరం ఏమిటి?

ఆమె ప్రియో కావడానికి అన్ని అవకాశాలున్నాయి. తాను, ఆమెకోసం, వెతుకుతున్నాడన్న విషయం ఆమె కెలాగో తెలిసిపోయింది.

ఈ రాత్రికి, తనకంట బడకుండా తప్పించుకోవాలని వెళ్తోందేమో?

త్వరత్వరగా కారిడార్ దాటేసి, మేడమెట్లు దిగి, దిగు వకు వచ్చేశాడు.

స్విమ్మింగ్ పూల్ ప్రక్కనుంచి వెళ్ళి, గేటుతీసి, ఇసుక తిన్నెలు చేరుకున్నాడు అయిదు నిముషాల్లో.

కాని, అతను చేరేసరికి ప్రియో అక్కడలేదు.

సముద్రానికి, రెండువైపులా తీరంవైపు ఓసారి చూపులు ప్రసరించాడు.

ఎక్కడా పిట్టమనిషికూడా కన్పడలేదు.

అతనికి రెండు ఫర్లాంగుల దూరంలో పెద్ద యిసుకదిబ్బ లున్నాయి.

ప్రియో, యిసుకదిబ్బల కటువైపు వుండవచ్చన్న ఆలో చన కలిగిందాతడికి.

ఇసుక దిబ్బల వైపు వడివడిగా కదిలాడు.

నిశ్శబ్దంగా దిబ్బపైకి ప్రాకుకుంటూ వెళ్లాడు. పైకి చేరు కున్నాక, ఇసుకలోకి బాగావంగి దిగువకు దృష్టి సారించాడు.

యెవరో, ఉరకలు వేస్తున్న సముద్ర కెరటాల కభి ముఖంగా కూచునున్నారు.

ఆమె మిస్ ప్రియో యేనా?

చంపే ముందు నిర్ధారణ చేసుకోవాలనుకున్నాడు. రీటా విషయంలో జరిగిన పొరపాటు పునరావృతం కాకూడదు.

"ప్రియో!"

కేకేసాడు.

అంతే!—

ప్రియో ఒక్క ఉదటున లేచింది గెంటినట్టుగా. సముద్ర వొడ్డున, యిసుకలో పరుగెత్త సాగింది, బెదిరిన లేడి పిల్లలా.

ఆమె ప్రియో అన్న విషయం రూఢి అయింది హరికి. జేబులోంచి పిస్టలు తీసి, పారిపోతున్న ప్రియోని గురి చూసి కాల్చాడు.

గుండు ఆమెకు తగల్లేదు, రెండో సారి కాల్చాడు. యీ సారి గూడా తప్పింది.

మూడవసారి, జాగ్రత్తగా చూసి, కాల్చాడు. గుండు ఆమెకు తగిలింది.

జబ్బ పట్టుకుని, బాధతో మెలితిరిగిపోతూ రెండు నిము షాలు ఉండిపోయింది.

అయినా, మరుక్షణంలో శక్తి కూడగట్టుకుని, మళ్ళా పరుగెత్తసాగింది.

లాభంలేదు! ప్రియో యీసారి తప్పించుకోవడానికి వీలు లేదు.

మళ్ళా మళ్ళా కాల్చాడు. గుళ్ళు అయిపోయాయి. ఖాళీ అయిపోయిన పిస్టల్ చూసి నివ్వెరపోయాడు.

లేదు! ఆమె పారిపోవడానికి వీలులేదు. ఆమె పీక పిసికయినా ఆమెను చంపి తీరాలి!

హరి కూడా లేచి, ఆమెను అందుకోవడానికి పరుగెత్తసాగాడు.

జబ్బలో దిగబడిన గుండు విపరీతంగా సలుపుతున్నా, లక్ష్యం చెయ్యకుండా, శక్తంతా కూడగట్టుకుని పరుగెత్తుతోంది ప్రియో.

ఆమె వైపు రివ్వున బాణంలా దూసుకు వస్తున్నాడు హరి.

అతని పిస్టలులో గుళ్ళయి పోయాయని అనిపించగానే ఆమె ప్రాణాలు కొంచెం కుదుట పడ్డాయి. కాని, జబ్బలో నుండి రక్తం విపరీతంగా కారిపోసాగింది. పరుగెత్తటానికి ఓపిక నశించిపోతూంది. అయినా తను అతడ్ని తప్పించుకోవాలి, దొరికిపోతే తనకు పక్కా చావు తప్పదు.

శక్తంతో కూడగట్టుకొని ప్రియో పరుగెడుతోంది. ఇసుకలో కాలు తీసి కాలు వెయ్యడం బహు కష్టంగా ఉంది. పైగా స్లిప్పర్లు, కాలుకి, చెప్పుకు మధ్య యిసుక చేరి, కాలు వెనక్కి గుంజుతున్నట్టుగా ఉంది.

స్లిప్పర్లు వదిలేసింది.

ఇప్పుడు కాస్త ఫరవాలేదు. ఇందాకటికన్నా, కాళ్ళు తేలిగ్గా వేస్తున్నాయి.

పరుగెడుతూ పరుగెడుతూ, హంతకుడు ఎంత దూరంలో ఉన్నాడో అని, వెనక్కి తిరిగి చూసింది.

చాలా ముందుకు దూసుకు వస్తున్న హరి, ఫర్లాంగు దూరంలో ఉన్నాడు తనకు.

ఆమె గుండెల్లో గుబులు రెట్టింపయింది.

ప్రియో ఒక్కొక్క అడుగు దగ్గరవుతున్న కొద్దీ, హరి హృదయంలో అలలెత్తిన ఆనందం చెప్పనలవి కాదు.

యెట్టకేలకు తన ఆశయం నెరవేర బోతోంది. సరోజ ఆత్మకు శాంతి కలగబోతోంది. తన గుండెల్లోని, ఇన్నాళ్లూ రగిలిన ప్రతీకార జ్వాల చల్లారబోతోంది.

ఇనుమడించిన ఉత్సాహంతో ఉరుకుతున్నాడు హరి ప్రియోను అందుకోవాలని.

ప్రియోది చిన్న మెడ. దానిచుట్టూ తన చేతులు బిగిస్తాడు. తనను విడిపించుకోవాలని ప్రియో గింజుకుంటుంది. కొట్టుకుంటుంది. తన చేతుల్ని లాగేస్తుంది. బలాన్నంతా ఉపయోగించి, ఇంకా లాభంలేకపోతే, గోళ్ళతో గిచ్చుతుంది. అయినా, తను వదలడు. ఆమె శ్వాస నిలిచిపోయి, నిశ్చేతనంగా నేలకొరిగేవరకూ, బిగించిన తన చేతులు సడలించడు. ఆమె కళ్ళు బయటికి పొడుచుకువస్తాయి. వాడిపోయిన మందార మొగ్గలాగు నాలిక నోట్లో మెలితిరిగి వేలాడిపోతుంది.

ఉప్పొంగిన ఆవేశంతో పరుగెత్తుతున్నాడు.

ప్రియోకి పరుగెత్తడం కష్టమయిపోతోంది పోనుపోను. జబ్బులో దూరిన గుండు రక్తంతో దేస్తోంది బయటకు విపరీతంగా.

అయినా, పరుగెడుతోంది!

కాని, ఎంత దూరం యిలా? ఎంతసేపని యిలాగ పరుగెత్తగలదు?

తనకు రక్షణ దొరికేమార్గం కనిపించలేదు ఎటుచూసినా. తను హోటల్లో ఉండిఉంటే, తనకు సెక్యూరిటీస్టాఫ్ అయినా రక్షణ ఉండేది.

ఇప్పుడు గట్టిగా కేకేసినా లాభంలేదు. అన్ని శబ్దాల్నీ మింగేసే సముద్రపుహోరు ఒకప్రక్క, ఇంకోప్రక్క అర్ధరాత్రివేళ.

తను హంతకుడి చేతిలో దిక్కుమాలిన చావు చావడ

మేనా?

లేదు! లేదు! అలా కావడానికి వీలులేదు.

పరుగెత్తుతూ, ఓసారి వెనక్కి తిరిగిచూసింది.

అతడు పదిగజాల్లో మాత్రమే ఉన్నాడు.

ప్రియా పూర్తిగా పిచ్చిదయిపోయింది.

వచ్చేస్తాడు! తప్పదు! తను అతని చేతిలో దిక్కుమాలిన చావు చావక తప్పదు!

అయ్యో! ఏంచెయ్యడం? కాళ్ళూ, చేతులూ అడ్డం మానే శాయి.

అక్కడే కూలబడిపోయింది. పిచ్చిగా యిసుకలో చేతులుగుచ్చి, యిసుక ఎత్తిపోస్తోంది.

అతడు అయిదు గజాల్లోనే ఉన్నాడు.

లాభంలేదు. తను ప్రతిఘటించి తీరాలి. తాను అతని చేతిలోచావడం తధ్యమయినా, పోరాడితీరాలి, ఆఖరి ఊపిరి వరకూ.

అంతే!—

హారి ఆమెను యింకో క్షణంలో అందుకుంటాడనగా, ఆమె మనస్సులో మెరపులాంటి ఆలోచన!

అతడు చేరువగా వచ్చి, ముందుకువంగి, ఆమె మెడ అందుకోబోయాడు.

చక్! చక్! చక్! చక్!

సూటిగా, దోసిళ్ళతో యిసుకయెత్తి, అతని కళ్ళల్లోకి కొట్టింది.

అంతే!

అతని కళ్ళనిండా యిసుకే! తాత్కాలికంగా గుడ్డివా డయిపోయాడు.

ఎలాగో, కళ్ళు తెరిచి, ఆమె ఉనికిని గుర్తించి తిరిగి అందుకోబోయాడు.

చక్! చక్! ఆమె మళ్ళా ఇసుక విసిరింది.

ఆమె చేతుల్లోకి ఇసుక వచ్చి, అతని కళ్ళల్లో కూరుకు పోయింది.

"అబ్బా!" మూలిగాడు కళ్లు కరకర మండిపోతుంటే.

అదేసమయంలో ఆమెకు అందుబాటుగా, ఓరాయి కనిపించింది.

ఆమెను కౄరఆవేశం ఆవహించింది.

దాన్ని అందుకుని, కళ్ళు కనబడక అటూ యిటూ చేతులు సారించి తడుముతున్న, హరి తలమీద గట్టిగా మోదింది.

"అమ్మో!"

బాధగా కేకవేశాడు అతడు. నేలను పడిపోయాడు రక్తం కారుతున్న తలను పట్టుకుని.

అదను కనిపెట్టి, యింకే మాత్రం వ్యవధి యివ్వకుండా, అదే రాయితో... ఒకటి, రెండు, మూడు... అతడు నిర్జీవుడయ్యేంత వరకూ అలా కొట్టుతూనే వుంది. హరి తల పచ్చడి పచ్చడి అయిపోయింది.

పావుగంట పోయాక గాని, ఆమె ఆవేశం చల్లారలేదు.

అప్పుడు గాని తనేం చేసిందో అర్ధం కాలేదు. హరి ఎప్పుడో చనిపోయాడు. తనకు వంట్లో అప్పటిదాకా బాగా రక్తం కారిపోవటం వలన నిస్సత్తువగా వున్నది. లేచి నిలబడే ఓపిక కూడా రావటం లేదు. కళ్ళల్లో ఏదో మైకం క్రమ్ముసాగింది. ఎంతో ఓపిక తెచ్చుకుని లేచి నిలబడబోయింది. శరీరం అదుపు తప్పింది. తూలి హరి శవం మీద అలాగే పడిపోయింది.

సముద్రపు టొడ్డున తిరిగి ప్రశాంతం అలుముకొంది.

—: అయిపోయింది :—

# చావు కాచుకో?

మిస్. మధుబాల

"మిస్టర్ కృష్ణకుమార్..." రాగిణి ఒక్కొక్క పదాన్ని ఒత్తిపలుకుతూ అంది.

"నీవు హైద్రాబాద్ సెంట్రల్ జైలునుండి పారిపోయిన పన్నెండుమంది అపరాధులలో ఒకడివి అయిన కృపాల్ సింగ్‌వి. నీవు 'రావ్ అండ్ చారి' కంపెనీలో ఉద్యోగం చేస్తున్న కాలంలో కంపెనీసొమ్ము యాభయివేల రూపాయలు మాయంచేశావు. కాని పట్టుబడ్డావు. న్యాయస్థానం నీకు రెండేళ్లు జైలుశిక్షను విధించింది. రెండేళ్ళక్రితం నీ శిక్షా కాలం ఇంకా ఆర్నెల్లు వుందనగా నీవు జైలునుండి పారిపోవడంలో సఫలీకృతుడవు అయినావు. జైలునుండి నీవు ఎలా

పారిపోయావు—ఆ విషయం చెప్పాల్సిన అవసరం లేదనుకుంటాను."

నేను అదిరిపడ్డాను. ఆశ్చర్యంతో రాగిణినే చూస్తూండిపోయాను.

నిజంగా ఆవేళ రాత్రి ఎలక్ట్రిక్ షార్ట్ సర్క్యూట్ అవటంవల్ల జైలులో భయంకరంగా మంటలలుముకున్నాయి. అప్పుడు జరిగిన గందరగోళంలోనే ఎందరో ఖైదీలకు పారిపోయే అవకాశం లభించింది. ఇతర ఖైదీలతోపాటు నేను కూడా ఏమీ ఆలోచించకుండా పరుగెత్తాను. ఆ తరువాత ఎందరో ఖైదీలు తిరిగి పట్టుబడ్డారు. కాని నేను పట్టుపడలేదు. నేను నా గడ్డము, మీసాలు తీసేసి, జుత్తుని కత్తిరింపచేశాను. దాంతో నా రూపం బాగా మారిపోయింది. ఆ తర్వాత నేను హైద్రాబాద్ వదిలి ఇక్కడికి, బొంబాయికి చేరుకున్నాను.

"రెండు సంవత్సరాలక్రితం పరారయిన ఖైదీ కృపాల్ సింగ్ తన గడ్డం, మీసాలు తీసేసి ఇక్కడ లాల్‌చంద్ ఎస్టేట్‌లో పనిచేస్తున్నాడని, అతను తన పేరు కృష్ణకుమార్‌గా మార్చుకున్నాడని పోలీసులకి తెలిసిన మరుక్షణం నీవు తిరిగి ఇనుపచువ్వల వెనుక వుంటావు."

నేనేమీ మాట్లాడలేదు; కాని, నా మెదడు వేగంగా పనిచేస్తూంది.

"ఒకవేళ నీవు ఇక్కడినుండి పారిపోవాలి అనుకున్నట్లయితే ఆ ఆలోచన మానేయి" రాగిణి అంది.

నేను ఆశ్చర్యంగా రాగిణిని చూడసాగాను. నిజంగా ప్రస్తుతం నేను యీ ఎస్టేటేకాదు, బొంబాయినే వదిలి పారిపోవాలని ఆలోచిస్తున్నాను.

"నేను ఏ కృపాల్‌సింగ్‌ని ఎరగను" దబాయించబోయాను.

"అంటే, నిన్ను నీవే ఎరగవన్నమాట?"

"మీరు చెబుతున్నది నా పేరుకాదు. నా పేరు కృష్ణ కుమార్."

"పేరు మార్చుకున్నంత మాత్రాన మనిషి మారడు మిస్టర్," రాగిణి తీవ్రంగా అంది. "అంతేకాదు; నేను నిన్ను ఇప్పుడు గుర్తుపట్టాననిమాత్రం అనుకోవద్దు; నేను నిన్ను మొదటిసారి చూసినప్పుడే గుర్తించాను."

ఈసారి నేను నిజంగానే వులిక్కిపడ్డాను.

"కాదు," నమ్మలేనట్లుగా అన్నాను.

"ఫూలిష్‌గా ప్రవర్తించక. నేను నిన్ను ఎలా గుర్తుపట్టాను అని అడుగు."

"ఎలా గుర్తించారు?" అనుకోకుండానే ఈ ప్రశ్న నా నోటినుండి వచ్చింది.

"నేను నిన్ను హైద్రాబాద్‌లో నీవు రావ్ అండ్ చారి కంపెనీలో అసిస్టెంట్ అకౌంటెంట్ గా పనిచేస్తున్నప్పటి నుండి ఎరుగుదును."

"ఎలా?"

"నీ భార్య 'కుల్‌దీప్' నేను మంచి స్నేహితురాళ్ళం. నేను చాలాసార్లు హైద్రాబాద్‌లో మీ ఇంటికికూడా వచ్చాను. అప్పటికి నీకు నీ అందమయిన భార్య ముఖం తప్పితే మరో ఆడదాని ముఖమే కనిపించేదికాదు."

"కాని; నేను మిమ్మల నెప్పుడూ చూడలేదు."

"ఒకవేళ చూసివున్నా గుర్తుపట్టేవాడివికాదు. ఎందుకంటే అప్పుడు నేను ఒక సామాన్యమయిన స్త్రీని. ఇప్పుడు కోట్లకు అధిపతి అయిన లాల్‌చంద్‌కు పత్నిని."

నేనేమీ మాట్లాడలేదు.

రాగిణి తన గౌనులోంచి ఒక న్యూస్ పేపర్ కటింగ్ తీసి దానిని విప్పి నాముందు పరచింది.

ఆ కటింగ్‌లో వరుసకు ముగ్గురు చొప్పున పన్నెండుగురు వ్యక్తుల ఫొటోలు ప్రచురించి వున్నాయి. పైన పెద్దపెద్ద అక్షరాలతో 'పారిపోయారు' అని వుంది. ప్రతి ఫొటో క్రింద పేర్లు వ్రాసివున్నాయి. అందులో యువకుడయిన ఒక సర్దార్జీ ఫొటో క్రింద 'సర్దార్ కృపాల్ సింగ్' అని వ్రాసి వుంది.

"నీవు తిరిగి జైలుకి వెళ్ళాలనుకుంటున్నావా? లేక నేను చెప్పినట్లు విని లక్షాధికారి అయి, గౌరవనీయమయిన జీవితం గడపాలనుకుంటున్నావా? ఏదో ఒక విషయం వెంటనే తేల్చి చెప్పు?" ఆమె అంది, ఆమె కంఠంలో నాకు బెదిరింపు కూడా కనిపించింది.

"మేడమ్!" నన్ను నేను స్థిమిత పరచుకుంటూ అన్నాను.

"అవును. నీవు సర్‌లాల్‌చంద్‌ను అంటే నా రోగిష్టి ముసలి భర్తను హత్యచేయాలి. అది కూడా సింపుల్. ఇవాళ అతణ్ని వీల్ చెయిర్ నుండి నీవు మంచం మీదికి చేరుస్తూ, చెయిర్ అడ్డం రావడంవల్ల, తడబడి నిలదొక్కుకున్నావు. మరోసారి అలా నిలదొక్కుకోనవసరంలేదు. అంతే! దాంతో పని పూర్తవుతుంది. నాకూ స్వేచ్ఛ లభిస్తుంది, నిన్నూ లక్షాధికారిని చేస్తాను. అంతటితో మన మధ్య సంబంధం పూర్తవుతుందని ఎందుకనుకుంటావు. నీవు చేసిన యీ సహాయానికి ప్రతి ఫలంగా, నీవు ఎప్పుడు కావాలన్నా, నా అందం, యవ్వనం నీ పరం చేస్తాను."

"ఈ పనిని మీరు, నా స్థానంలో నా కన్నా ముందున్న యూసుఫ్‌తో ఎందుకు చేయించలేదు. అతనికి వుద్యోగమిప్పించింది కూడా మీరే కదా?"

"వాడు వట్టి మూర్ఖుడు. నేను ప్రయత్నం చేశాను. అతను లొంగి పోయాడు కూడా?! కాని, అతని వ్యవహారం చూస్తే, ఎవరయినా అతను కావలనే అలా ప్రవర్తించాడని అనుమా

నించే ఆస్కారముంది. ఒకసారి అతను కావలని సర్ లాల్ చంద్ ని వదిలేశాడు. ప్రక్కనే నర్స్ జూలీ వుంది. ఆమె సమయానికి లాల్ చంద్ ని క్రింద పడకుండా పట్టుకుంది. అతని ఆ ప్రవర్తన డాక్టర్ గుప్తకు కోపం తెప్పించింది. అతను వెంటనే యూసుఫ్ ని పనిలోంచి తీసేయించాడు.''

రాగిణి ఒక్క క్షణం ఆగి తిరిగి చెప్పసాగింది. ''ఆ రోజు నేను నా స్నేహితురాలొకావిడను సెండ్ ఆఫ్ ఇవ్వడానికి 'విక్టోరియా' స్టేషన్ కి వెళ్ళాను. అక్కడ అనుకోకుండానే నా దృష్టి నీపై పడింది. ఆ తర్వాత నిన్ను అనుసరించి నీవెళ్ళిన రెస్టోరెంట్ ప్రక్కనున్న టెలిఫోన్ బూత్ లోకి వెళ్ళాను. నేను అందులోకి వెళ్ళటం నీవు గమనించావని నాకు తెలుసు. కావలనే నేను పదివేల రూపాయలున్న నా హాండ్ బ్యాగ్ ని బూత్ లో వదిలివచ్చాను. నేననుకున్నట్లు గానే, నేను బ్యాగ్ మరచిపోయి రావడం నీవు గమనించి అందులోని డబ్బుని మాయం చేశావు; అంతలోనే నేను తిరిగి వచ్చి నిన్ను రెడ్ హాండెడ్ గా పట్టుకున్నాను. అయినా నేను నిన్ను పోలీసులకి పట్టివ్వక నీ వాస్తవాన్ని బయట పెట్టకుండా, నిన్ను ఈ ఎస్టేట్ లోకి తీసుకువచ్చి ఉద్యోగం ఇప్పించాను.''

''నేను మీరు చెప్పినట్లు చేస్తానని ఎలా అనుకున్నారు?''

''అందమూ, వయస్సు గల ఆడది తనంత తానుగా కోరి రావడంతో పాటు లక్ష రూపాయలకు అధికారివి కూడా కావచ్చన్న ఆశ, నా పని పూర్తయ్యేలా చేస్తుందని అనుకున్నాను. అయినా ఒకసారి తప్పుచేసిన వ్యక్తి రెండవసారి ప్రలోభంగా తప్పు చేయడానికి లొంగిపోతాడుకూడా.''

''నిజమే! మీరన్నట్లు ఒకసారి అపరాధం చేసినవాడు మరోసారి సులువుగా అపరాధం చేయడానికి ఒప్పుకుంటాడు.

కాని, ఆ పోలీసు నాపు నమ్మరించదు. ఎందుకంటే నేనింత వరకు ఒక్కసారికూడా అపరాధం చేయలేదు, అపరాధిని కాను.''

''అంటే నీవు 'రావ్ అండ్ చారి' కంపెనీనుండి యాభై వేల రూపాయలు మాయంచేసి జైలుకి వెళ్ళలేదంటావా?''

ఆ విషయాలు జ్ఞాపకంవచ్చి నేనొకసారి దీర్ఘంగా నిట్టూర్చాను. ''మేడమ్, నేను చెప్పిన దానిని నమ్మమని నేను ఒత్తిడి చేయను, కాని నేను నమ్మిన భగవంతునిపై ప్రమాణం చేసి చెబుతున్నాను, ఆ డబ్బు నేను దొంగతనం చేయలేదు. ఇందులో నేను ఇరికింపబడ్డాను.''

''నో'' నమ్మలేనట్లుగా విస్ఫారిత నేత్రాలతో నన్ను చూస్తూ అంది రాగిణి,

''కాని; వాస్తవ మదే!''

''మరి...మరి...నువ్వు ఇందులో ఎలా ఇరుక్కున్నావు?''

''అదొక పెద్ద కథ'' మళ్ళీ ఒకసారి దీర్ఘంగా నిశ్వసించి అన్నాను. ''ఆ రోజుల్లో నా జీవితం పూలబాటలా వుండేది. చక్కని ఉద్యోగం, అందమైన భార్య...ఆ రోజుల్లో ప్రతి వ్యక్తి మంచివాడులాగే కనిపించేవాడు నా కళ్ళకి. నాపు చెడురోజులు ప్రాప్తించినవి. నా భార్య కుల్‌దీప్‌ని నేను ఆరాధించాను. అంతమంచి స్త్రీ నా అదృష్టంవల్లే లభించిందని మురిసిపోయేవాణ్ని. కాని, 'రావ్ అండ్ చారి'కంపెనీ మేనేజర్, నా స్నేహాన్ని కోరుతూ నా ఇంటికి రాకపోకలు సాగించడం నా కోసం కాక, నా భార్య కొరకని, ఇందులో నేను ఇరుక్కున్న తర్వాత తెలిసింది. ఆ తర్వాత ఆ మేనేజర్ నాకీ దొంగతనం అంటగట్టాడు. నేను నా కంఠనాళాలు చిరిగిపోయేటట్లుగా 'నేనీ దొంగతనం చేయలేద'ని అరిచాను. నేను, ప్రాణపదంగా ప్రేమించిన నా భార్యే నా వద్ద వంద రూపాయల నోట్లకట్టలు తాను చూసినట్లు చెప్పింది.

దాంతో నాకు రెండేళ్ళ జైలు శిక్ష విధించబడింది.''

నేను కొన్ని క్షణాలు మౌనం వహించాను. గత మూడు న్నర సంవత్సరముల జీవితం నా కళ్ళముందు ఫిల్మ్ రీల్‌లా కదలసాగింది.

''ఆ తర్వాత నా శిక్షాకాలం కేవలం ఆర్నెల్లు వుందనగా జైలులో మంటలు అంటుకోవడంలాంటి సంఘటన ఏర్పడింది. ఖైదీలకు పారిపోవడానికి అవకాశం లభించింది. అందరితో నేనూ బయటపడ్డాను. పోలీసుల చేతుల్లోంచి బయటకు వచ్చిన తర్వాత వాళ్ళనుండి తప్పించుకోవడానికి, నేను మా కులంలో ఎవరూ చేయగూడని పనిచేశాను. నా గెడ్డం, మీసాలు, జుత్తు తొలగించి నేను చాలా పాపం చేశాను. అప్పటినుండి నా కష్టాలు మరింత ఎక్కువయ్యాయి.

''నేను ఎమ్. కామ్; ఎల్. ఎల్ బి. డిగ్రీ పొందాను. కానీ నేనెవరికి అంత చదువుకున్నానని చెప్పుకోలేను. ఎందు కంటే ఆ డిగ్రీ పొందింది కృపాల్ సింగ్, కాని కృష్ణకుమార్ కాదు. కృష్ణకుమార్ తాను చదువుకున్నానని చెబుతూ ఏ విధమైన సర్టిఫికేట్ చూపించలేడు. అందుకోరకు నేను అడుగు అడుగున ఎదురుదెబ్బలు తిన్నాను. పోస్టాఫీసు ముందు కూర్చుని, అయిదు పైసలకు మనిఆర్డర్ ఫార్మ్‌లు నింపడం, ఉత్తరాలు రాయడం మొదలు, పాసింజర్ల కొరకు టాక్సీ స్టాండులనుండి టాక్సీలు పట్టుకువచ్చే పనివరకు రకరకాల పనులు చేశాను. అది నా మంచితనమో, లేక నా దురి దృష్టమోకాని, ఇంత ప్రయత్నించిన తర్వాతకూడా నేను ఒక్కపూట కడుపునిండా భోజనం చేయలేకపోయేవాణ్ని. మీరు నాకు ఉద్యోగం ఇచ్చిననాడు, భగవంతుడికి నాయీ కష్టాలు చాలనిపించి ఈ ఉద్యోగం ఇప్పించాడనుకున్నాను కాని, ఇలా తిరిగి వలలో నేను ఇరుక్కోవలసివస్తుందని అనుకోలేదు.''

"హల్ దీప్ ఎక్కడుందో, ఏమో నీకు తెలియదా?"

నా పెదవులపై ఒక కుటిల మందహాసం వెలిసింది.

"ఏమో, ఎక్కడుందో?" నేను చెప్పసాగాను. "ఆ మేనేజర్‌తోనే వుందో లేక ఇంకొకర్నెవరినయినా పట్టిందేమో! కాని, మేడమ్! ఇప్పుడు నాకు నా భార్యను గురించిన చింతలేదు. ఆమెనన్ను మోసగించినందుకు బాధపడటం కూడా లేదు. నా యీ జీవితం ఎంత కఠినంగా గడిచిందో, అందులో ఇతరుల తప్పులేదు. తప్పంతా నాది. న్యాయంగా ప్రతికేవాళ్ళకు ఈ ప్రపంచంలో స్థానంలేదు. ఈ ప్రపంచం నమ్మినవాళ్ళను తడిగుడ్డతో గొంతుక కోసే వాళ్ళకే మంచిని చేస్తుంది. నేటి యీ ప్రపంచంలో ఎవరయినా నిన్ను ప్రేమగా కౌగలించుకున్నారంటే, అతను నీపట్ల తన ప్రేమను కాదు వ్యక్తం చేసేది, నీ వీపుని తడిమి ఎక్కడ సుళువుగా పొడవవచ్చోనని పరీక్షిస్తున్నాడన్నమాట. నాకు తగిలిన ఎదురు దెబ్బలు చాలాచాలా పాఠాలు నేర్పాయి మేడమ్. ఒకప్పుడు నాకున్న ఆశయాలు ఇప్పుడు నావి కావు. ఇప్పుడు నేను ప్రతివ్యక్తిని నేను దొంగగాను, మోసగాడుగాను అనుకుంటున్నాను. ప్రస్తుతం నా దృష్టిలో ప్రతి స్త్రీకూడా మోసగత్తె, కామినీ పిశాచిని" నేను ఆగిపోయాను.

రాగిణికూడా నిశ్శబ్దం వహించింది. ఉన్నట్లుండి ఆమె కొంచెం విచలితమయినట్లు నాకనిపించింది.

కొన్ని క్షణాల వరకు మా ఇరువురిలో ఎవరూ మాట్లాడలేదు.

ఆ తర్వాత ఆమెలో తిరిగి ముందున్న నిశ్చలమూ, కఠినత్వం చోటుచేసుకుంది.

"నీ లైఫ్‌స్కెచ్ నేను విన్నాను" ఉన్నట్లుండి ఆమె తీక్షణంగా అంది. "ఇప్పుడు నీవు నా ప్రశ్నకు జవాబు

చెప్పు. నేను చెప్పినట్లు చేస్తావా? లేక జైలుకి వెళ్తావా?"

"మీలో చోటుచేసుకున్న యీ దురాలోచనను వదిలేయ లేరా మేడం?" నేను అర్థిస్తున్నట్లుగా అన్నాను. "పెద బాబుగారు యిప్పటికే, ఇప్పుడో,అప్పుడో అనేట్లున్నారు. ఆయన్ని హత్య చేయించి ఎందుకు అనవసరంగా పాపం నెత్తిన చుట్టుకుంటారు. ఎలాగూ నాలుగు సంవత్సరాలు కాచుకున్న వాళ్లు, మరో కొన్నాళ్లు ఆగండి."

"నే నింకా కాచుక్కూర్చోలేను" రాగిణి,విసుగుతో తీక్ష ణంగా అంది.

"నేను గత నాలుగుసంవత్సరాలుగా యీ పక్షవాయువు రోగి ఖైదులో కుళ్ళిపోతున్నాను. నా కిప్పుడు స్వేచ్ఛ కావాలి. ఈ నాలుగేళ్లుకూడా నేను ప్రతిక్షణం ఆ ముస లాడి చావు గురించి ఎదురు చూశాను. ఆ ముసలాడు తనంత తానుగా ఈ ప్రపంచాన్ని వదిలేట్లు లేడు. అతణ్ని తొల గించే ప్రయత్నం చేయకుంటే మరో యాభయి ఏళ్ళయినా అలా మంచంమీదుగా తీసుకుంటూ బ్రతుకుతాడు. నీవన్నట్లు ఈ యాభయిఏళ్ళు వేచివుంటే ఆ తర్వాత అతని ఈ డబ్బుకి అప్పుడు నా దృష్టిలో ఏ విలువ వుండదు. ఇక నీ ఉప దేశాలు చాలించి నా పని చేస్తావా, లేదా? ఆ విషయం చెప్పు?"

"నో; నేను చేయను" నేను శాంతంగా జవాబిచ్చాను.

"ఏమిటి?" ఆశ్చర్యంతో నా ముఖం చూస్తూ అంది.

"నేను నీవు చెప్పినపని చేయను, అనిఅంటున్నాను" నేను అదే శాంత స్వరంతో అన్నాను.

"మిసెస్ రాగిణీ లాల్ చంద్! నేను యీ పని చేయను. నీవు నన్ను బ్లాక్ మెయిల్ చేయలేవు. నన్ను బ్లాక్ మెయిల్ చేయడానికి నీ వద్దనున్న ట్రింప్ కార్డ్స్ అంత బలంగాలేవు. అసహాయుడయిన ఆ వృద్ధుణ్ని చంపి, నిన్ను, నీ లక్ష రూపా

యలు సంపాదించే కంటే జైలుకి వెళ్ళటం నా కిష్టం. నిజం చెప్పాలంటే మేడమ్, నేను జైలునుండి పారిపోయి చాలా తప్పుపని చేశాను. నా శిక్షాకాలం కేవలం ఆర్నెల్లు వుండింది. ఇతర ఖైదీలలాగే నేను పారిపోయి ఎంత పొరపాటు చేశానో నా కిప్పుడు అర్థం అవుతోంది."

"నేను పారిపోకుండా వుంటే ఇప్పటికి నాశిక్ష పూర్తయి, నేను మళ్ళీ సమాజానికి, ప్రపంచానికి నా నిర్దోషిత్వాన్ని నిరూపించుకుని నా కొరకు ఒక స్థానం సంపాదించుకుని వుండే వాణ్ని. నేను నిరపరాధిని; అయినా జైలునుండి పారిపోయి నేను రెంటికీ చెడ్డ రేవడినయ్యాను. ఒక వేళ ఇప్పుడు నీవు నన్ను పోలీసులకి పట్టిచ్చినా వాళ్లు నన్ను ఉరికంబ మేమీ ఎక్కించరు. జైలునుండి పారిపోయినందుకి శిక్షగా ముందున్న ఆరు నెలలకి తోడుగా మరో సంవత్సరమో, లేక రెండు సంవత్సరాలో జైలు శిక్షను విధిస్తారు. ఆ శిక్షను నేను అనుభవించడానికి సిద్ధంగా వున్నాను. జీవితం చాలా పెద్దది. జీవితాంతం ప్రతిఘటించటం కూడా చేతకాని ఆ అసహాయ వృద్ధుణ్ని చంపిన పాపపు బరువుని గుండెలమీద కుంపటిలా పెట్టుకోవడం కంటే అధికారులు విధించే జైలు శిక్షను అనుభవించడం చాలా సులభం. కాని నీవు నన్ను జైలుకి కూడా పంపలేవు. ఒక వేళ నీవు అలాంటి ప్రయత్నం చేస్తే మాత్రం నీ గతి చాలా దుర్గతి అవుతుంది."

"నాకేమిటి దుర్గతి అయ్యేది?"

"నీవు నాతో నీ భర్తని హత్య చేయించ దలచుకున్నట్లు నేను ప్రపంచ మంతటికి తెలియచేస్తాను. కాళ్లు, చేతులు కూడా కదిలించలేని ఆ ముసలాడి పీడ విరగడ అవుతే, అతని ఆస్తితో నీవు నీ ఇష్టం వచ్చినట్లు ప్రవర్తించడానికి ప్లాను వేశావని చెబుతాను."

"వినే వాళ్ళు నీ మాటలు నమ్ముతా రంటావా?"

వ్యంగ్యంగా అందామె.

"చెప్పవలసిన విధంగా చెబితే ఎవరయినా నమ్ముతారు. నేనేమని చెబుతానో తెలుసా. నేను నీ ప్రియుణ్నని, మనిరువురి మధ్య అనుచితమయిన శారీరక సంబంధ ముందని, నీ పెళ్ళికి ముందే, నీవు హైద్రాబాద్‌లో వుంటున్నప్పటి నుండే నీవు నాకు పరిచితురాలివనీ, అప్పుడే మనమధ్య ఈ సంబంధ మేర్పడింది. ఇప్పుడు కూడా వివాహమయిన తర్వాత వృద్ధుడు మంచానపడటంవల్ల తన కామాన్ని తీర్చుకోవడానికి, పూర్వ పరిచితుడనయిన నేనుక నబదేసరికి వుద్యోగం నెపంతో తన ఎస్టేట్‌లో రప్పించుకుందని చెబుతాను. ఇప్పుడు నీవు ఇలా దొంగచాటుగావడంతో విసుగెత్తావు. దానితోపాటు నీకు లాల్‌చంద్ అపారమయిన ఆస్తిపై ఆశకూడా వుంది. అది అతను చనిపోతేకాని పూర్తికాదు."

"డియర్ మేడమ్, ఫార్ యువర్ ఇన్ఫర్మేషన్, నిన్న రాత్రి మన మిద్దరం ఇక్కడ నుండి బంగళా వరకు వెళ్ళి నప్పుడు,హౌస్ కీపర్ 'దయామయి' మన ఇరువురిని చూసింది. నిన్న అర్ధరాత్రి తర్వాత నీవు ఇక్కడికి వచ్చిన విషయం దయామయికి తెలుసు. ఆమె ఇచ్చే ఒక్క స్టేట్‌మెంట్ మనిద్దరి మధ్య అనుచితమయిన సంబంధ ముందని తెలుప డానికి చాలనుకుంటాను. ఇవాళ కూడా ఆమె నిన్నటిలాగే మిమ్ములను కవర్ చేస్తుందేమో! ఇవాళ ఆమె ఒక్కర్తే ఉండక పోవచ్చు. ఆమెతోపాటు నర్స్ జూలీ, కాకుంటే ఈ ఎస్టేట్ యొక్క నమ్మకమయిన మరో నౌకరెవరయినా వుండవచ్చు. తమ యజమానిని మోసగించి, తమ యజమాను రాలు ఎలా ప్రవర్తిస్తోందో వారికూ కూడా తెలిసి వస్తుంది."

రాగిణి శిలామూర్తిలా నా ఎదురుగా కూర్చుని వుంది. ఆమె ముఖం బూడిదలా పాలిపోయింది.

"అంతేకాదు;" నేను తిరిగి చెప్పసాగాను. "ఈ విషయా

లన్నీ నేను సర్‌లాల్‌చంద్ గారితో కూడా చెప్పగలను. ఆయన మాట్లాడలేరు, కదలలేరు. రాయలేక పోవచ్చు. కాని ఆయన ఆలోచించగలరు. ఏదో ఉపాయాన్ని ఆలోచించి ఆయన కొత్త వీలునామాని తయారు చేయించవచ్చు, లేదా నీ 'కారెక్టర్'ని గురించి ప్రమాణాలు సిద్ధం చేసుకుని నీకు విడాకులు ఇవ్వవచ్చు... మిసెస్ రాగిణీ లాల్‌చంద్, నీవు నన్నేమని బ్లాక్‌మెయిల్ చేయగలవు. తలచుకుంటే నేనే నిన్ను బ్లాక్‌మెయిల్ చేయగలను. నీవు నా గురించి ఏదైనా ఎవరికయినా చెప్పిన మరుక్షణం నీ గురించి అంతా బయట పడుతుంది. నీవు నోరు మూసుకుని వున్నంతవరకు నా పెదవులకి తాళం ఉంటుంది. ఏమంటావ్?"

"నీవు ఇంత తుచ్ఛుడవని నేననుకోలేదు?" రాగిణి పాములా బుసకొడుతూ అంది.

"నీ అంత తుచ్ఛుణ్ని మాత్రం కాదు మిసెస్ రాగిణీ లాల్‌చంద్!" అన్నాను నేను నవ్వుతూ.

ఆమె నన్ను నిప్పులు కురిసే కళ్ళతో చూడసాగింది.

"మేడమ్; నేనిదివరకే ఒక స్త్రీతో చాలా బాగా దెబ్బ తిన్నాను. ఆ గాయం మానింది కాని, మచ్చ పోలేదు. ఆ మచ్చను చూస్తూ కూడా మళ్ళీ ఒక స్త్రీ వలలో పడేంత మూరుఖ్ణ్ని మాత్రం కాదు."

రాగిణి తన స్థానంలోంచి విసురుగా లేచి నిలబడింది.

"ఇంకొక విషయం విని పో" నేను వెంటనే అన్నాను.

ఏమిటన్నట్లుగా ఆమె నన్ను తినేసేట్లుగా చూసింది.

"ఒకవేళ నన్ను ఉద్యోగం లోంచి తీసేయాలనుకుంటున్నట్లయితే బలమయిన ప్రమాణాన్ని చేపట్టండి. చిట్టి, చిట్టి ఆరోపణలు పనిచేయవు. అందరూ ఇక్కడ నా పని వల్ల సంతుష్టులయి వున్నారు. నన్నవసరంగా ఉద్యోగం లోంచి తొలగిస్తే ఇతరులకి నీపై సందేహం ఏర్పడుతుంది.

మొదట యూసుఫ్ చేతుల్లోంచి సర్ లాల్‌చంద్ క్రింద పడుతూకూడా తప్పించుకోగలిగారు. రెండవసారి కూడా నాతో కూడా అలాగే జరిగింది. ఇప్పుడు నీవు తీసుకు వచ్చే మూడవ మనిషివల్ల ఒకవేళ కాకతాళీయంగానే అటువంటి దేదయినా జరిగినా నిన్ను అందరూ అనుమానిస్తారు. ప్రస్తుతం నీ పొజిషన్ చాలా డెలికేట్‌గా వుంది. అందుకని ఆయన్ని తొలగించాలనే ఆలోచనను మానేసి, ఆయన్ని త్వరగా తన వద్దకు పిలిపించుకోమని దేవుణ్ని ప్రార్థించు. అందులోనే నీ మంచి వుంది.”

రాగిణి నన్ను నోటితో ఒక్కమాట కూడా అనలేదు. కాని ఆమె చూసిన చూపుకిగాని ఏ మాత్రం శక్తి వున్నా నేనక్కడే భస్మం అయి వుండేవాణ్ని. అలా చూసిన ఆమె వెనక్కి తిరిగి గబగబా బయటికి వెళ్ళిపోయింది.

## 2

రెండవరోజు సుమారు పదకొండు గంటలయింది. అప్పటికి సర్ లాల్‌చంద్ తన బ్రేక్‌ఫాస్ట్ పూర్తిచేసి మంచంపై పడుకున్న పొజిషన్‌లోనే వెనక్కి చేరగిలబడి విశ్రాంతి తీసుకుంటున్నారు. అప్పుడే రాగిణి వచ్చి నన్ను గారేజ్ లోంచి కారు తీయమని ఆదేశించింది.

నేను గ్యారేజ్ లోంచి రాగిణికి ఇష్టమయిన బేబి ఆస్టిన్ కారుని తీసి పోర్టికోలో తెచ్చి ఆపాను.

నేను ఒక సిగరెట్ వెలిగించుకుని పోర్టికో స్తంభానికి ఆనుకుని దమ్ముపై దమ్ము లాగుతున్నాను. బహుశా రాగిణి నన్ను కారు డ్రయివ్ చేయమనవచ్చని నేను అక్కడే ఆగాను.

ఉదయంనుండి ఇప్పటి వరకు 'దయామయి' నాకు చాలా సార్లు ఎదురయింది. ఆమె ప్రతిసారికూడా సాధారణంగానే

వ్యవహరించింది. ఆమె యొక్క ఏ ప్రవర్తన వల్లగాని, మాటలవల్లకాని, రాత్రి రాగిణి నా గదిలోకి వచ్చినవిషయం తనకు తెలిసినట్లు ప్రకటింపచేయలేదు. ఒకవేళ ఆమె రాగిణి నా క్వార్టర్ లోకి రావడం చూసివుంటే తప్పకుండా ఆ విషయమై ఏమయినా అడిగివుండేది.

అప్పుడే రాగిణి బయటకు వచ్చింది.

ఆ సమయంలో ఆమె డార్క్ రెడ్ కలర్ లో డిజైన్ లున్న బాంబెడైయింగ్ శారీ, అదేరంగు బ్లౌజు వేసుకుంది. పెద్దపెద్ద అద్దాలున్న 'గోగో' సన్ గ్లాసెస్ పెట్టుకుంది.

ఆమె నావైపు చూడనయినా చూడకుండా నేరుగా వెళ్ళి కారు డ్రయివింగ్ సీట్ లో కూర్చుంది. మరుక్షణం ఆమె కారు స్టార్ట్ చేసి గియర్ మార్చి, కారుని ముందుకి దూకించింది.

కొన్ని క్షణాలవరకు నేను అక్కడే వుదాసీనంగా నిలుచున్నాను. ఉన్నట్లుండి నాకో ఆలోచన తట్టింది. నేను సిగరెట్ పారవేసి తిరిగి గారేజ్ వైపుకి పరుగెత్తాను. షెవర్లే ఇంపాలా ఆగివున్న గారేజ్ తెరిచి కారుని బయటకు తీసి తిరిగి గారేజ్ మూశాను. తిరిగి ఇంపాలాలో కూర్చుంటూనే కారు స్టార్ట్ చేసి గేటువైపుకి పోనిచ్చాను.

సర్ లాల్ చంద్ వద్దనున్న నాలుగు కార్ల తాళంచెవులు ఎప్పుడు నావద్దనే వుంటాయి. అయినా వాటిని ఎప్పుడు వుపయోగించలేదు. రాత్రి రాగిణితో జరిగిన వాదవివాదాల వల్ల ఒకవేళ ఆమె పోలీసులకి నాగురించి రిపోర్ట్ చేయడానికే వెళ్ళిందేమోనని భయంపట్టుకుంది. అందుకే ఆమెను వెంబడించాలన్న ఆలోచన కలిగింది.

కొద్దిసేపటిలోనే నాకు రాగిణి నడుపుతున్న ఆస్టిన్ కనిపించింది.

నేను జాగ్రత్తగా ఆమె కారుని వెంబడించసాగాను.

రాగిణి మాహీమ్ వైపుకి పోతూంది.

ఇప్పటికి నా మనస్సు శాంతపడింది. ఆమె పోలీస్ స్టేషన్‌కి వెళ్ళడంలేదు. ఆమె పోలీస్ స్టేషన్‌కి వెళ్ళదలచుకుంటే శాంతాక్రజ్, అంధేరీ, బాంద్రా మొదలయిన పోలీస్ స్టేషన్లలో ఎక్కడికయినా వెళ్ళివుండేది.

మరింత వుత్సాహంతో నేనామెను వెంబడించసాగాను.

మాహీమ్ దాటాము. మాటుంగా దాటింది. దాదర్ కూడా పోయింది. మా రెండుకార్లు జేకబ్ సర్కిల్ ఏరియాలోకి ప్రవేశించాయి.

ఉన్నట్లుండి రాగిణి తన కారుని మహాలక్ష్మి బ్రిడ్జ్ వైపు తిప్పింది. మహాలక్ష్మి బ్రిడ్జికి సమీపంలో ఒకచోట ఆమె కారుని ఆపి కారులోంచి బయటకు వచ్చింది.

నేను నా కారుని దూరంగా రోడ్డుకి వారగా ఆపాను. నేను కారులోంచి క్రిందికి దిగలేదు. డ్రయివింగ్ సీట్‌లో కూర్చునే నేను ఆమె ప్రతి కదలికను గమనించసాగాను.

రాగిణి బ్రిడ్జి ప్రక్కగావున్న గుడిసెలవైపుకి వెళ్ళింది. మలుపువద్ద ఆమెకు ఒక చిన్న కుర్రాడు కనిపించాడు. ఆమె తన పర్సులోంచి ఒక నాణెంతీసి కుర్రాడికి ఇస్తూ ఏదో చెప్పింది.

కుర్రాడు సరే అన్నట్లుగా తలూపి ఆ గుడిశెల్లోకి పరుగెత్తాడు. కొద్ది సేపటిలోనే ఒక వ్యక్తి రాగిణివైపు వస్తూ కనిపించాడు. అతనిపై తన చూపు పడగానే రాగిణి వెనక్కి తిరిగి కారువైపు నడిచింది.

నేనొచ్చిన రెండవరోజుననే తన లెక్క పూర్తిగా తేలలేదంటూ దయామయితో వాదులాడిపోయిన యూసుఫ్ అతను. రాగిణి తిరిగి వచ్చి తన కారులో కూర్చుంది. ఆమె చేసిన సైగతో యూసుఫ్ కూడా ఆమె ప్రక్కన కూర్చున్నాడు.

కారులో కూర్చునే వాళ్ళిరువురూ ఏదో మాట్లాడుకుంటు

న్నారు. నాకు యూసుఫ్ అవును, కాదు అన్నట్లుగా తలూపడం కనిపిస్తోంది. సుమారు పదినిముషాల తర్వాత యూసుఫ్ కారులోంచి క్రిందికి దిగాడు. అతను రాగిణికి అభివాదం చేసి తిరిగి గుడికెళ్లవైపుకి సాగిపోయాడు.

రాగిణి కారుని స్టార్ట్ చేసింది. ఆమె కారుని బాక్ చేయసాగింది.

నాకారు ఆమె కారుకి చాలా వెనుకగావుంది. నేను కూడా కారుని బాక్ చేసి వెనక్కి తిప్పాను. రాగిణి ఇంకా తన కారుని బాక్ చేస్తూనేవుంది. అప్పటికే నాకారుగాలితో పందెం వేయసాగింది.

రాగిణి, యూసుఫ్‌ని కలవడం, నాకెందుకో ఒక పెద్ద దుర్ఘటన జరగనున్నదనిపించింది. అయితే అది ఎలాంటి అపాయమయి వుంటుదన్నదిమాత్రం నాకు అర్థంకాలేదు.

నేను తిరిగి లాల్‌చంద్ ఎస్టేట్‌లోకి చేరుకున్నాను. నేను ఇంపాలాను గారేజ్‌లో పెట్టి నా క్వార్టర్‌లోకి చేరుకున్నాను. సుమారు పావుగంట తర్వాత రాగిణికారు ఎస్టేట్‌లోకి ప్రవేశించింది. కారుని గారేజ్‌లో పెట్టడానికి రాగిణి నన్ను పిలుస్తుందేమో అనుకున్నాను.

కాని ఆమె నన్ను పిలవలేదు.

కారు పోర్టికోలోనే నిలబడివుంది.

# 3

సాయంత్రం టీ తర్వాత సుమారు రెండుగంటల వరకు నేను సర్ లాల్‌చంద్‌కి ఆయన కిష్టమయిన నవల చదివి వినిపించాను.

రాత్రి ఎనిమిది గంటల ప్రాంతంలో నర్స్ జూలీ ఆయనకు మితంగా భోజనం చేయించింది. ఆ తర్వాత నేనాయన్ను వీల్‌చెయిర్‌నుండి మంచంపైకి చేర్చాను.

సుమారు ఎనిమిదిన్నర ప్రాంతంలో రాగిణి నన్ను పిలిపించింది.

"నర్స్ జూలీ కొలాబా వెళ్ళాలి" ఆమె చెప్పసాగింది. "నా ఆస్టిన్ పోర్టికోలో వుంది. నీవు నర్స్‌ని కొలాబాలో వదిలి రావాలి."

"రైట్ మేడమ్!" నేను నమ్రతగా అన్నాను.

నర్స్ జూలీ నా వెంట బయలుదేరింది.

ఆమె కారులో కూర్చోగానే నేను కారుని కొలాబా వైపుకి పోనిచ్చాను.

"మిమ్మలని తిరిగి తీసుకురావడానికి నేనక్కడ ఎంత సేపు ఎదురు చూడాల్సివుంటుంది మేడమ్?" నేను నర్స్‌ని అడిగాను.

"నీవు నాకోరకు ఎదురు చూడాల్సిన అవసరంలేదు. నీవు నన్ను వదిలి తిరిగి వచ్చేయవచ్చు. నే నీరాత్రి అక్కడే వుంటాను. మా అమ్మగారి ఆరోగ్యం బాగాలేదు. రేపు ఉదయం నేనే తిరిగి వచ్చేస్తాను" నర్స్ జూలీ అంది.

"ఓహ్!" నేనేదో ఆలోచిస్తూ అన్నాను. "అయితే ఈ రాత్రికి మీరు లేకుండా బాబుగారిని ఎవరు చూస్తుంటారు?" అడిగాను.

"సాధారణంగా యీ భారాన్ని 'దయామయి' తీసుకుంటుంది, కాని ఇవాళ 'రాగిణి' చూసుకోవాలి."

"ఎందుకు?" నేను అనుమానంగా అడిగాను.

"దయామయికి కూడా వంట్లో బాగుండలేదు. ఆమెకు కీళ్ళనొప్పులున్నాయి. ఆ బాధ తాళలేకుండావుంటే నేనామెకు సెడెటివ్ డ్రగ్ ఇచ్చాను. ఆమె తన గదిలో మత్తుగా నిద్రపోతూండవచ్చు."

నా చెవుల్లో డేంజర్ అలార్మ్ మ్రోగసాగింది. సర్ లాల్ టే లో ఒక్కడే రాగిణి రక్షణలో వున్నాడు.

ఇవాళ వుదయం రాగిణి 'యూసుఫ్'ని కలిసి రహస్యంగా ఏదో మాట్లాడివచ్చింది.

తప్పకుండా ఏదో గందరగోళముంది.

ఒకవేళ రాగిణి కావలసే యీ అవకాశాన్ని వుపయోగించదలుచుకుని యూసుఫ్‌తో మాట్లాడి వచ్చిందా?

నాగుండె వేగంగా కొట్టుకోసాగింది. సర్ లాల్ చంద్ ఏకాంతంగా రాగిణితో వుండడం, తప్పకుండా ఏదో గడబిడ జరుగుతుందని నా మనస్సు హెచ్చరించింది.

నా కళ్ళముందు ఉండి ఉండి రాగిణి ముఖం, యూసుఫ్ ముఖం కదలాడసాగింది.

కొలాబా, సర్ లాల్ చంద్ ఎస్టేట్ నుండి ఎంత లేదన్నా పదిహేను మైళ్ళ దూరం వుంది. ట్రాఫిక్‌తో నిండివుండే బొంబాయిరోడ్లపై ఎంత వేగంగా కారు నడపాలన్నా కేవలం రాకపోకలకు ఒక గంటకు పైగా పడుతుంది.

ఈ గంటకాలంలో రాగిణి, యూసుఫ్ లిరువురుగాని, లేక రాగిణి ఒక్కర్తెగాని ఏంచేస్తుందో ఎవరికి తెలుసు.

నేను మనస్సులోనే ఒక నిశ్చయానికి వచ్చాను. కారుని కొంతదూరం పోనిచ్చి ఒకచోట ఆపాను.

"ఏమయింది?" జూలీ అడిగింది.

"ఇంజన్‌లో ఏదో మిస్టేక్ వున్నట్లుంది, ఇప్పుడే చూస్తాను" అంటూ కారుదిగి బోనెట్ తెరిచి ఇంజన్ పరీక్ష చేస్తున్నట్లు నటించాను.

జూలీ ఆదుర్దాగా నాకేసి చూస్తోంది. సుమారు అయిదు నిముషాల తర్వాత నేను ఇంజన్‌లోంచి తలఎత్తాను.

"ఇంజన్ రిపేర్ కావడానికి ఎంతసేపు పడుతుందో తెలియదు. అసలు మిస్టేక్ ఏమిటో నాకింకా అర్థంకాలేదు. మీరు టాక్సీలో వెళ్ళిపోవడం మంచిదనుకుంటాను" నేను జూలీతో చెప్పాను.

"ఆల్ రైట్" అందామె.

నేనో టాక్సీ ఆపి జూలీని అందులో ఎక్కించాను.

టాక్సీ నా దృష్టిపథంనుండి తప్పుకోగానే నేనుబోనెట్ వేసి తిరిగి వచ్చి డ్రయివింగ్ సీట్లో కూర్చున్నాను.

మరుక్షణం నాకారు లాల్ చంద్ ఎస్టేట్ వైపు దూసుకు పోసాగింది.

అయిదు నిముషాల్లో నేను ఎస్టేట్ చేరుకున్నాను.

కారుని ఎస్టేట్లోకి పోనీయక కొద్దిదూరంలో ఫుట్ పాత్ కి ఆనించి ఆపాను. కారుదిగి చుట్టు తిరిగి నేను ఎస్టేట్ కి వెనుక వైపుకి చేరుకున్నాను.

వెనుక సముద్రపు అలల ఘోష తప్ప ఇంకేవిధమయిన శబ్దం లేదు.

సర్ లాల్ చంద్ రూం కిటికీలు వెనుక సముద్రపువైపు తెరుచుకుంటాయి.

నేను నిశ్శబ్దంగా పిల్లిలా అడుగులు వేసుకుంటూ వెళ్ళి ఒక కిటికీ చాటున నిలబడ్డాను.

"మైడియర్ హస్బెండ్" లోపలినుండి నాకు రాగిణి యొక్క విషమిళితమయిన కంఠస్వరం వినిపించింది. "నీకు నవలలు, కథలు వినే అలవాటుంది కదూ! ఇవాళ నేను ఒక కథ వినిపిస్తాను. కాని ఈ కథ వినిపించడానికి నేను ఏ నవలా చదవాల్సిన అవసరంలేదు.అంతేకాదు ఆ కథలోని ముఖ్యమయిన పాత్రవు నీవే అని తెలిసినప్పుడు నీవు సంతోషిస్తావుకూడా!"

నేను రాతిబొమ్మలా అక్కడ నిలబడి లోపలినుండి విని పించే ఒక్కొక్క శబ్దాన్ని వినసాగాను.

"స్వీట్ హార్ట్" రాగిణి చెప్పసాగింది. "నన్ను యీ ముసలివయస్సులో పెళ్ళిచేసుకుని, నీవెంతగా పశ్చాత్తాప పడ్డావో అంతకు పదిరెట్లు నేను నిన్ను చేసుకున్నందుకు

పశ్చాత్తాపపడ్డాను. నీవు చెప్పినట్లల్లా విని, ప్రతినిత్యము నీ పాద ధూళిని శిరస్సున ధరించే పతివ్రత లభించింది అని నీవనుకున్నావు, కాని అలా కాలేదు. నీ కలాంటి భార్య దొరక లేదు. నిన్ను నీ యీ ముసలితనంలో వివాహం చేసుకుని, నీవద్ద మూల్గుతున్న ధనంతో ప్రపంచంలోని ఆనందాన్ని కొనుక్కోవచ్చని నేను ఆశించాను, కాని అలా కాలేదు. నాకలాంటి భర్త లభించలేదు.

"పాతచింతకాయ పచ్చడిలాంటి నీ పాత భావాలతో నీవు నన్ను అనుక్షణం అనుమానించావు. నే నే యువకుని వైపు కన్నెత్తి చూసినా నీగుండె పగిలిపోయేది. వయస్సులో అందంగా వున్న నీ భార్యను ఎవడయినా ఎగరేసుకుపోతాడేమోనననీవునన్ను సొసైటిలోతిరగకుండా ఆంక్షవిధించావు. నీవు ఎప్పుడయినా ఎక్కడికయినా తీసికెళ్ళావంటే అక్కడ కూడా నీలా ముసలాళ్ళు, వాళ్ళ ముసలిభార్యలుండే పార్టీలకు తీసికెళ్ళావు. నీవు వీలయివుంటే నీ లక్షల ఆస్తిని బాంక్ లాకర్లలో దాచినట్టు నన్నుకూడా ఏ లాకర్ లోనో దాచి, నా అవసరం వచ్చినప్పుడే బయటకు తీసేవాడివి.

"నేనే ఆ స్తిని ఆశించి నిన్ను పెళ్ళిచేసుకున్నానో, ఆ ఆస్తి వాసనకూడా నావరకు రాకుండా చేశావు నీవు. నిన్ను పెళ్ళిచేసుకున్న తర్వాత, నీ మొత్తం ఆస్తి కాకపోయినా అందులో కొంత భాగమయినా నీ చేతిలో వుంటుందని కలలు కన్నాను. ఇటు నేను నీ ఆస్తిని పీల్చాలని ప్లాను చేస్తున్నాను. నీవేమో నా రక్తాన్ని పీల్చడం మొదలు పెట్టావు. నీవు పూర్తిగా నన్ను నీ పిడికిలిలో బంధించాలని చూశావు. అయినా నేనేదో విధంగా సర్దుకు నేదానిని.కాని నీవు వీలునామానికూడా మార్చుకున్నావని తెలిసింది."

లోపలినుండి రాగిణి మాటలు ఆగిపోయాయి. ఆస్థానంలో

ఆమె బరువుగా ఊపిరి పీల్చి వదులుతున్న చప్పుడు వినిపించసాగింది.

లోపలినుండి వచ్చే ప్రతిశబ్దంకూడా స్పష్టంగా నా శ్రవణేంద్రియాల్లోకి దూరుతూంది.

"మన వివాహానికి ముందు నీవో వీలునామా వ్రాశావు. ఆ వీలునామా ప్రకారం, నీ మరణం తర్వాత నీ యీ యావదాస్తి నాకూ, నీ మొదటి భార్య కూతురు సబితకు చెరిసగం చెందాలని వ్రాశావు. కాని మన పెళ్ళయిన సంవత్సరం లోపునే నీవు నాకు పూర్తిగా విరుద్ధమయ్యావు. అంతేకాదు, ఆ వీలునికూడా మార్చాలనుకున్నావు. ఇవాళ కాకుంటే రేపైనా నీ మరణం తర్వాత నా భాగంలో లభించే లక్షల ఆస్తిపై ఆశ పెట్టుకునే నేను నీతో కాపురం చేస్తున్నాను. కాని, నీవు నా ఆ ఆశను కూడా పూర్తి కాకుండా చూడాలనుకున్నావు. నా భవిష్యత్తు అంధకారంగా కనిపించసాగింది. ఆ అంధకారంనుండి తప్పుకోవడానికి నే నేమయినా వెంటనే చేయాలనుకున్నాను, చేశాను కూడా! ఏమిటి డియర్ కథ ఇంట్రెస్టింగ్ గా వుందా సస్పెన్స్ మంచి గ్రిప్ గావుందా?"

లోపల కొన్ని క్షణాలు నిశ్శబ్దం చోటుచేసుకుంది. ఆ తర్వాత రాగిణి తిరిగి చెప్పసాగింది. "ఇప్పుడీ కథలోని అత్యంత ఉత్తేజిత పూరితమయిన సంఘటనను విను డియర్! నీవు ఆ వీలునామాను మార్చేలోగానే నేను నిన్ను ఈ ప్రపంచంనుండి తప్పించాలనుకున్నాను. అర్థమయిందా నే నేమి చేయాలనుకున్నానో? నిన్ను హత్య చేయాలనుకున్నాను... వాట్? వులిక్కిపడ్డావుకదూ డియర్?

"నీ ముఖం చూస్తుంటే యీ విషయమై నీ వెప్పుడూ ఆలోచించలేదని తెలుస్తూంది. ఏ కారు ఆక్సిడెంట్ వల్ల

నీవీనాడు ఈ దుస్థితిలో వున్నావో ఆ స్థితి నా వల్ల జరిగింది. నేను బ్రేక్ ఆయిల్ టాంక్ లో రంధ్రం చేసి, నీ కారు బ్రేకులు పనిచేయకుండా చేశాను. నీకు స్పీడుగా కారు నడిపే అలవాటుందని నాకు తెలుసు. బ్రేకులు పనిచేయక పోవటంవల్ల నీ కారుకి ఆక్సిడెంటు జరుగుతుందని దాంతో నీ పని ఆఖరు అని నేను దృఢంగా నమ్మాను. కాని నా దురదృష్టం...!"

"అంతటి భయంకరమయిన ఆక్సిడెంట్ తర్వాత కూడా నీ ప్రాణాలు పోలేదు. కేవలం పక్షవాయువు రోగివి అయి నోటిమాట కూడా పోగొట్టుకున్నావు. తర్వాత నేననుకున్నట్లు పోలీసులు కూడా ఇది ఒక ఆక్సిడెంట్ గానే కేసుని క్లోజ్ చేశారు. మిస్టర్ లాల్ చంద్; నీవు చనిపోలేదు. నిజమే కాని, ఇప్పుడు నీవు నాకు చెందనున్న నీ ఆస్తి విషయంలో ఏమీ చేసే స్థితిలో కూడా లేవు. ఆ రోజు తర్వాత నుండి నేను ప్రతి దినము, ప్రతి క్షణం నీ చావు గురించి ఎదురు చూడసాగాను. ఆక్సిడెంట్ జరిగిన ప్రారంభపు రోజుల్లో ఇవాళో, రేపో అనేట్లుగా వున్నావు... కాని; టు మై బాడ్ లక్ నాలుగేళ్ళు గడిచినా మృత్యువు కూడా నీ వద్దకు రావడానికి భయపడుతోంది."

"ఇంకా చావుతో పోరాడుతూ ఉజ్వలం కానున్న నా భవిష్యత్తుపై తిరిగి కాటుక పులమాలని అనుకుంటున్నావు నీవు. యీ నాలుగేళ్లుగా నీ చావు కెదురు చూస్తూ నే నోడి పోయాను. కాని, నీవు చావుతో పోరాడుతూ కూడా ఓడి పోలేదు. ఇప్పుడు నిన్ను ఇక్కడి నుండి బలవంతంగా పంపించకుంటే నీవు మరో నూరేళ్ళయినా బ్రతుకుతావని పిస్తుంది. కాని నీ చావు యీసారి అంత సులభంగా వుండదు. ఈసారి నీవు ఏలాంటి చావు చస్తావో తెలుసా? హే! భగవాన్! నేనింతకు ముందే ఎందుకు చనిపోలేదా అని గుండెలవిసి పోయేట్లుగా కుళ్ళి, కుళ్ళి చస్తావు. సర్ లాల్ చంద్ ఇది

నా ప్రతీకారం నీకు శిక్ష..."

తిరిగి గదిలో నిశ్శబ్దం అలుముకుంది. రాగిణి బహుశా గా వుద్రేకితురాలయి నట్లుంది. బరువయిన ఊపిరి శబ్దం బయటివరకు స్పష్టంగా వినిపిస్తోంది.

"రేపు నీ ముద్దుల కూతురు సవిత తన దసరా శెలవులు గడపడానికి వస్తుంది." రాగిణి శాంతంగా చెప్పసాగింది. "వచ్చే శనివారం దసరా! వచ్చే శనివారం దయామయితో సహా ఇంట్లోని నౌకర్లందరికి శెలవు ఉంటుంది. నర్స్ జూలీ ఈ శనివారం తనకు రెండు రోజులు శెలవు కావాలని, డాక్టర్‌ని అడిగింది. అతనామెకు శెలవు మంజూరు చేశాడు కూడా! ఆనాడు ఈ బంగళాలో, నీతోపాటు, నేను, సవిత, కృష్ణకుమార్ మాత్రమే ఉంటాం. ఆ రాత్రి సవిత తన గదిలో చచ్చి పడివుంటుంది. ఆమె శరీరంపై ఒక గుడ్డ పీక్కూడా వుండదు. పోలీసుల పరిశోధనలో ఎవరో బల వంతంగా సవితను చెరచి, గొంతుక పిసికి చంపారని తేలు తుంది. సవితను బలాత్కారంగా చెరచి, ఆమెను చంపే బాధ్యత నీ పాత నౌకరు యూసుఫ్ చూసుకుంటాడు. నే నతనికి అందులో సహాయం చేస్తాను. కాని ఆ రెండు అపరా ధాలు మాత్రం కృష్ణకుమార్ పై తోయబడతాయి."

వింటున్న నా ఒళ్ళు ఒక్కసారిగా "ఝుల్లు" మంది. గుండె వేగంగా కొట్టుకోసాగింది.

"పోలీసులకి ఫోన్ చేసి నేను పిలిపిస్తాను. సవిత గదిలో నే నేదో శబ్దం విన్నానని, ఆ తర్వాత ఆ గది కిటికీలోంచి కృష్ణకుమార్ దూకి పరుగెత్తటం చూశాను. నేను సవిత ఒంటిపై నూలుపోగు లేకుండా చచ్చి పడివుందని చెబుతాను. నీకో విషయం చెబుతున్నాను విను, కృష్ణకుమార్ జైలులోంచి పారిపోయిన అపరాధి. ఆ విషయం పోలీసులకు తెలిసిన మరు క్షణం నా మాటలు వారు పూర్తిగా విశ్వసిస్తారు."

స్తబ్ధుడయిన నేను ఆమె మాటలను వింటున్నాను.

"మై డియర్ పతిదేవ్!" రాగిణి మెత్తని కత్తిలాంటి పదునుతో చెప్పుకుపోతూంది.

"ఇప్పుడు నేను చెప్పిందంతా కేవలం నిన్ను భయపెట్ట డానికి చెబుతున్నానని మాత్రం అనుకోవద్దు. ఇంత వరకు నేను చెప్పిందంతా జరుగుతుంది. వచ్చే శనివారం, నీ ముద్దుల కూతురు సబిత భయంకరంగా హత్యా చేయబడుతుంది. ఒక వేళ డాక్టరు గుప్త నీ గుండె బలహీనతను గురించి చెప్పిందే నిజమయితే; నీ కూతురు బలాత్కారము, ఆమె బీభత్స మయిన చావు కబురు వినగానే నీ గుండె ఆగిపోతుందని నాకు నమ్మకముంది. ఒక వేళ యీ సారి కూడా నీ గుండె ఆగడాన్ని నేను ఆపుతాను నీ ముఖంపై దిండుని పెట్టి కేవలం అర నిముషం అదిమి వుంచానంటే చాలు ఈ ప్రపం చంతో నీ సంబంధం పూర్తవుతుంది. కూతురు మరణ వా విని, తండ్రి కూడా గుండె ఆగి కూతురుని చేరుకున్నాడనే అందరూ అనుకుంటారు. ఆ తర్వాత యావదాస్తికి నేను ఏకైక వారసురాలిని అవుతాను. వ్చ్! ఏ ఆస్తినయితే నా చేతికి అందకుండా చేయాలనుకున్నావో ఆ ఆ స్తంతటికి నేను అధికారిణి అవుతాను..."

"నా... మై డియర్! నేనేమి చెప్పానో దాని గురించి ఆలోచించు. రాబోయే శనివారం నీ కూతురికి పట్టబోయే స్థితికి తలచుకుంటూ కుళ్ళి కుళ్ళి ఏడువు. ఆమె ఎంతటి నరక యాతనను అనుభవించ బోతూందో ఆలోచిస్తూ ఆ నరక యాతనలో నీవు మాడిపో; నీవు నీ స్థానం నుండి కదల్లేవు. నీవు మాట్లాడలేవు కూడా, అందుకని నీవు నా స్కీముః ఇతరులకి చెప్పలేవు కూడా! నీవు నీ కూతురిని హెచ్చరించ లేవు."

"వచ్చే శనివారం, నర్స్ జూలీ రెండు రోజుల శెలవుపై

ఎస్టేట్ నుండి బయట పడుతుంది. ఇతర నౌకర్లందరూ, దసరా ఉత్సవాల్లో పేల్గొనడానికి సెలవు తీసుకుని బయటకు వెళ్ళి పోతుంటే అసహాయంగా చూస్తుండటం మినహా నీవేమీ చేయ లేవు. కేవలం కృష్ణకుమార్ మాత్రమే బంగళాలో వుంటాడు. ఆనాడు అతను బయటకు ఎక్కడికి వెళ్ళకుండా నేను చూసు కుంటాను. యూసుఫ్ వస్తాడని, నీ కూతురిని చెరచి, చంపు తాడని నీకు తెలసింది, అయినా నీవు ఏమీ చేయలేవు."

"సర్ లాల్ చంద్ ఈ తొమ్మిది రోజులు నీ ముఖాన్ని చూస్తూ నే నెంతగా సంతోషిస్తానో చెప్పలేను. నీవు విల విల్లాడుతుంటావు, ఏడుస్తుంటావు. నీ కూతురు భవిష్యత్తుని తలచుకుంటూ ఆమెకు రాబోయే గతిని తలచుకుంటూ నీ గుండె చిల్లులు పడిపోతుంది. కాని ఏమీ చేయలేని దయనీయ స్థితి నీది. నీవీ నరకాగ్నిలో మలమల మాడాలనే తొమ్మిది రోజులు ముందుగా నా స్కీముని నీకు చెప్పాను. ఇదే నీ శిక్ష, నా ప్రతీకారం కూడా!" రాగిణి తన హీల్స్ని టక టక లాడిస్తూ వెళ్ళిపోయింది. గదంతా భయంకరమయిన శబ్దం అలుముకుంది.

కొద్దిక్షణాల తర్వాత నేను కొద్దిగా తలనువంచి తొంగి చూశాను. మంచంపై స్పందనరహితమయిన లాల్ చంద్ శరీరం పడివుంది. ప్రక్కనున్న బీరువా గదితలుపు తెరిచివుంది. కాని నా కక్కడ రాగిణి కనిపించలేదు.

నేను కిటికీ ప్రక్కనుండి కదిలి చుట్టు తిరిగి కారుని ఆపినచోటుకి చేరుకున్నాను. కారు డ్రయివింగ్ సీటులో కూర్చుని, సిగరెట్ వెలిగించి ఆలోచించసాగాను.

చాలా సంకటమయిన పరిస్థితి ఏర్పడింది.... కేవలం నా ఒక్కడికేకాదు, సర్ లాల్ చంద్, సబితలకూ్కడా సంకట పరిస్థితే! నన్ను గురించిన చింత నాకు లేదు. రాగిణి స్కీముని గురించి నాకు తెలిసిపోయింది. కాబట్టి పరిస్థితినుండి నేను

ఏదో విధంగా చేతులు దులుపుకోగలను. వచ్చే శనివారం వరకు మాట అటుంచి నేను రేపే, సబిత ఇక్కడికి రాక ముందే నేను యీ ఎస్టేటుని, వీలయితే బొంబాయినుండే దూరంగా వెళ్ళిపోగలను.

కాని, నేను పారిపోయినంత మాత్రాన లాల్‌చంద్, సబితలు చావునుండి తప్పుకోగలరా?

ఊహూ!

నేను లేకున్నా కూడా రాగిణి తన స్కీముని సమర్థవంతంగా పూర్తి చేసుకోగలదు. ఆ ధైర్యం ఆమెకు వుంది. యూసుఫ్ సబితను చెరచి చంపిన తర్వాత ఆమె అతణ్ని తుపాకితో కాల్చి చంపవచ్చు. యూసుఫ్, సబితను చంపి పారిపోతుండగా తాను చూశాననీ, అతణ్ని ఆపడానికి వేరు మార్గం తోచక కాల్చి చంపానని ఆమె పోలీసులతో చెప్ప వచ్చు. లేక అలాంటిదే మరో అయిడియా ఏదైనా వేయ వచ్చు.

రాగిణిలాంటి దిగజారిన ఆడది తన ఇష్టం వచ్చినట్లు చేయ దలచుకుంటే ఆమె నెవరూ ఆపలేరు.

నేనే ఏమయినా చేయాలి...స్టీరింగ్ వీల్‌ని పిడికిలి బిగించి గుద్దుతూ గొణుక్కున్నాను.

కాని నేనేం చేయగలను...

నేను విన్న విషయాలను పోలీసులకుగాని, డాక్టర్ గుప్తాకుగాని, ఇంకొకరికిగాని చెప్పలేను. చెబితే నాకు మొదటినుండే రాగిణిపై అనుమానం వుండిందని, అందుకే ఇంజన్ పాడయిన నెపంతో నర్సుని టాక్సీలో పంపి వెనక్కి తిరిగి వచ్చానని చెప్పాల్సి వస్తుంది. రాగిణిపై నా కెందుకు అనుమానం కలిగింది అన్నదానికి నేను సరయిన సమాధానం చెప్పలేను.

చెబితే నేను జైలునుండి పరారయిన ఖైదీనని కూడా తెలిసి

పోతుంది. నేను జైలుకి వెళ్ళడానికి సిద్ధంగా వున్నానని రాగిణితో చెప్పటం వేరు. కేవలం ఆమెను బెదిరించడానికే ఆ మాట అన్నాను కాని వాస్తవానికి నా కా అభిప్రాయం లేదు.

అదీకాక నేను - అంటే పరారయిన ఖైదీ చెప్పేమాటలు నిజమేనని పోలీస్ నమ్ముతుందని గ్యారంటీ ఏముంది? రాగిణి నా దృష్టిలో దిగజారిపోయిన నీచురాలు. కాని సమాజం దృష్టిలో మానమర్యాదలతో వైభవంగా వెలుగొందుతున్న మహిళ. కోట్లకు అధిపతి అయిన సర్ లాల్‌చంద్‌కి భార్య.

నేను చెబుతున్నది అబద్ధం అని నిరూపించడానికి రాగిణికి అంత కష్టమనిపించదు. అంతేకాక రాగిణికి, తన హావభావాలను, యవ్వనాన్ని, అందాన్ని ట్రంప్ కార్డులుగా వుపయోగించటం బాగా తెలుసు.

నేను పోలీసులవరకు వెళితే అందులో నాకే నష్టం కలుగుతుంది. తిరిగి నేను జైలులో వుంటాను.

సర్ లాల్‌చంద్‌నికాని, సబితనుకాని రాగిణి చేసిన ఈ స్కీములో బలికాకుండా చూడాలనుకున్నాను.

ఎలా?ఉన్నట్లుండి నా మెదడులో ఒక మెరుపు మెరిసింది. రాగిణి లాల్‌చంద్‌నుగాని, సబితనుగాని చంపకముందే నే నామెను చంపితే?

రాగిణిలాంటి అపాయకరమైన స్త్రీ మోసగత్తెకు అసలు బ్రతికే హక్కులేదు. రాగిణి మరణంవల్ల సబిత యొక్క అమాయిక ప్రాణం బ్రతుకుతుంది.

రాగిణి మరణంవల్ల నేను మళ్ళీ జైలు కెళ్ళకుండా తప్పించుకోగలను. నేను జైలునుండి పారిపోయినప్పటినుండి నన్ను పరారయిన ఖైదీగ గుర్తించిన మొదటివ్యక్తి ఆమే! ఆమెను చంపితే?

ఇప్పుడు నేను, రాగిణిని చంపినా ఎవరికి నాపై అను

మానం కలగకుండా చూడాలి. అలాంటి ప్లాను వేయాలి.

నేను సిగరెట్ పారవేసి కారుస్టార్ట్ చేశాను.

## 4

ఆ రెండవరోజు వుదయం పదిగంటలకు నర్స్ జూలీ తిరిగి వచ్చింది. పదిఅయిదు నిముషాలకు ఆమె లాల్‌చంద్ వద్దకు వెళ్ళింది. ఆ తర్వాత రెండు నిముషాలకు ఆమె డాక్టర్ గుప్తాకు ఫోన్ చేసింది.

డాక్టర్ గుప్తా తన పనంతా వదిలి ఫైరింజన్‌లా పరుగెత్తుకు వచ్చాడు.

అతను రాగానే సర్‌లాల్‌చంద్ గదిలోకి వెళ్ళాడు. గదిలోకి వెళ్ళిన అతను నర్స్ జూలీని, రాగిణిని గది బయటకు పంపి లోపలనుండి తలుపులు మూసుకున్నాడు.

బాబుగారికి ఏమో జరిగింది. ఈ విషయం నిముషాల్లో ఎస్టేట్ అంతా వ్యాపించింది. నేనూ, దయామయి కూడా ఆయనగారి బెడ్‌రూం బయట వరండాలోకి చేరుకున్నాం. రాగిణి, నర్స్ జూలీలు మొదటినుండీ అక్కడ వున్నారు. మిగిలిన నౌకర్లెవరూ అక్కడివరకు రాకుండా కట్టుదిట్టం చేయబడింది.

సుమారు పదిహేను నిముషాల తర్వాత గుప్తాగారు బయటకు వచ్చారు. ఆయన చాలా గంభీరంగా వున్నాడు. అతను పరిశీలనగా మా అందరిని గుచ్చి, గుచ్చి చూడసాగాడు. ఆ తర్వాత అతను కఠినంగా అడిగాడు "ఏం జరిగింది?" అతని కంఠంలో అధికారంకూడా పొడసూపింది.

ఎవరూ ఏమీ చెప్పలేదు. ఆయనకూడా ప్రశ్న ఏ ఒక్కరిని వుద్దేశించి అడగలేదు. మే మందరము ఒకరి మొఖాలు ఒకరు చూసుకున్నాం.

"అసలు విషయం ఏమిటి డాక్టర్?" కొద్దిసేపటి తర్వాత రాగిణి అడిగింది.

"సర్ లాల్‌చంద్ వున్నట్లుండి తీవ్రంగా కొలాప్స్ అయ్యారు" డాక్టర్ గంభీరంగా చెప్పసాగాడు. "నిన్న వుదయం ఆయన పరిస్థితి ఎంతో మెరుగ్గా వుంది. ఇవాళ ఆయన ఎంతగా భయభీతులు, ఉత్తేజితులు అయివున్నారంటే ఆయన భూతాన్ని చూశానేమో అన్నట్లుగా వున్నారు. నిన్నటికి, నేటికి మధ్య ఏదో అప్రియమైన సంఘటన జరిగింది. ఆ సంఘటనవల్ల ఆయన చాలా కంగారు పడుతున్నారు. ఆయన్ను చూస్తుంటే ఆయన ఎదురుచూడనిదేదో జరిగినట్లు తోస్తుంది. ఆయన..."

"వాట్ డాక్టర్" రాగిణి ఆదుర్దాగా అంది. "ఇదెలా సంభవము. నిన్న నర్స్ లేకపోవడంవల్ల నేనే ఆయనవద్ద వున్నాను. నిన్న ఆయన మూడ్‌లో ఏ విధమయిన పరివర్తన నాకు కనిపించలేదు. నర్స్ జూలీ తిరిగి వచ్చేవరకు, ఆయన వద్దకు నేనుతప్ప మరోవ్యక్తి వెళ్ళలేదు."

"ఆయనలో ఏ విధమయిన పరివర్తన మీకు కనిపించలేదా?"

"ఆయన కాస్త ఉత్తేజితులయివున్నట్లుమాత్రం తోచింది. అదీగాక ఆయన అలా వుత్తేజితులు కావడం స్వాభావికమే అనుకున్నాను. ఇవాళ ఆరునెలల తర్వాత సబిత తన కాలేజి నుండి ఇంటికి వస్తుంది. కూతురుని కలుసుకోబోయే సంతోషంలో ఆయన వుత్తేజితులయి వున్నారనుకున్నాను."

"కేవలం ఉత్తేజితులు కావడంకాదు, బాగా ఆందోళన పడుతున్నారాయన. భయంవల్ల ఆయన నేత్రాలు వెళ్లుకు వస్తున్నాయి, ప్రతిక్షణంకూడా, ఆయన ఏదో చేయడానికి తీవ్రంగా ప్రయత్నిస్తున్నట్లు తోస్తోంది. ఆయన పల్స్ తీవ్రమయింది. ఆయన గుండెల్లో తుఫానువీస్తోంది. సబిత ఇంతకు ముందుకూడా శెలవులకు వచ్చింది. కాని ఆయన ఎప్పుడూ ఇంతగా ఉద్రిక్తులవలేదు."

"అయితే ఏం జరిగిందో భగవంతునికే తెలియాలి" రాగిణి విచారంగా అంది.

"మీా కెవరికయినా, ఏమయినా తెలుసా?" డాక్టర్ గుప్తా మమ్మలను అడిగాడు.

మాలో ఎవరూ జవాబివ్వలేదు.

"ఆల్ రైట్" డాక్టర్ ఒక నిమిషం తర్వాత అన్నాడు. "నే నాయనకు ఇంజెక్షన్ యిచ్చాను. ఇప్పుడాయన పడుకుని వున్నారు. ఆయన కేవిధమయిన డిస్టర్బ్ కలగకుండా చూడండి. నర్స్ ఈ బాధ్యత నీపైవుంది. నీకు ఆయన పరిస్థితి శోచనీయంగా తోస్తే నాకు వెంటనే ఫోన్ చేయి. ఆయన పరిస్థితిలో మెరుగు కనిపించేవరకు నేను ఇక్కడికి ప్రతిరోజూ వస్తాను. నేనో క్రొత్త ప్రిస్క్రిప్షన్ తయారు చేశాను. మందులు, ఇంజక్షన్లు తెప్పించుకో. ఒకవేళ యీ వారంలో ఆయన మెరుగు కాకపోతే, జూలీ నీ లీవు కాన్సిల్; తెలిసిందా?" ఆయన చెప్పాడు.

నర్స్ సరే అన్నట్లుగా మెల్లిగా తలూపింది.

రాగిణి కళ్ళలో కంగారు కనిపించింది. కాని ఆ కంగారుని, నేను తప్ప ఇంకెవరూ అర్థం చేసుకోలేదు. జూలీ లీవు కాన్సిల్ అయిందంటే ఆమె సిద్ధంచేసిన స్కీమంతా పనికిరాకుండా పోతుంది. రాగిణి మంచి నటీమణి కూడా! తన ఆందోళనను ఆమె లాల్‌చంద్ ప్రస్తుత పరిస్థిలోవున్న స్థితినిబట్టి వ్యక్తం చేసింది.

"డాక్టర్" రాగిణి విచారంగా అడిగింది. "అంత ప్రమాదమేమీా లేదుకదా?"

"ఇప్పటివరకు పరిస్థితి కంట్రోలులోనే వుంది. కాని ప్రస్తుతం ఆయన పరిస్థితినిబట్టి ఏం జరిగినా అసంభవమేమీా కాదు."

"బహుశా, సబిత రావడంవల్ల ఆయన ఆరోగ్యంలో

ఎయినా మార్పు రావచ్చంటారా?''

"ఆ నమ్మకముంది! కాని అసలు జరిగిందేమిటో నాకు అర్థంకావడంలేదు. ఉన్నట్లుండి ఆయన ఎందుకింత ఆందోళన పడుతున్నారు? ఏదో విపరీతమయిన చింత ఆయన్ను లోలోపలే తినేస్తున్నట్లు తోస్తోంది. ఇంతకుముందు ఆయన, ఏదో చెప్పాలని ఇంత తీవ్రంగా ప్రయత్నం చేయడం నేను చూళ్లేదు. ఆయన చెప్పదలచుకున్న దేమిటో నాకు తెలిస్తే లేక ఆయన చెప్పగలిగితే?''

డాక్టర్ గుప్తా ఒకసారి దీర్ఘంగా నిశ్వసించి ఆగిపోయాడు. ఆ తర్వాత నర్స్‌ని తనతో రమ్మని సైగచేసి తిరిగి బెడ్‌రూంలోకి వెళ్ళాడతను.

రాగిణికూడా బెడ్‌రూంవైపు అడుగు వేసింది కాని, అంతలోనే ఏదో ఆలోచించి ఆగిపోయింది.

సుమారు అయిదు నిముషాల తర్వాత డాక్టర్ వెళ్ళి పోయాడు.

డాక్టర్ వెళ్ళిపోయిన తర్వాత రాగిణి బెడ్‌రూంలోకి ప్రవేశించింది, కాని ఆమె ఎక్కువసేపు వుండలేదు. వెంటనే తన గదిలోకి వెళ్ళిపోయింది.

నర్స్ జూలీ బెడ్‌రూం తలుపులన్ని లోపలినుండి మూసింది.

సాయంత్రం నాలుగు గంటలకు రాగిణి నన్ను తీసుకుని ఏర్‌పోర్ట్‌కి వెళ్ళింది.

సబిత ప్లేన్ దిగింది.

సబితను చూడగానే రాగిణి పరుగున వెళ్ళి ఆప్యాయంగా కౌగిలించుకుంది. రాగిణి చూపించే ఆప్యాయతను చూస్తుంటే సబిత ఆమెకు సవతికూతురుకాక స్వంతకూతురా అనిపించేలా వుంది. సబితను హత్య చేయించాలనుకున్న తన స్కీముని మార్చుకోలేదుకదా అనిపించింది నాకే!

సబిత పదహారు వసంతాలను చూచిన, ఒక అందమయిన

అమాయిక బాలిక. ఆమెను చూచిన తర్వాత, శనివారం నాడు రాత్రి యూసుఫ్ ఆమెతో ప్రవర్తించబోయే స్థితిని, గురించి తలచుకుంటే నాకే గుండె బరువుగావుంది. మరి ఆ తండ్రి ఎంతగా బాధపడుతున్నాడో?

అమాయికమయిన సబిత ముఖం చూచిన తర్వాత రాగిణిని చంపాలన్న సంకల్పం నాలో మరింత ధృఢమయింది.

ఆ ఇరువురూ వచ్చి కారులో కూర్చున్నారు. వారిని నేను ఎస్టేట్ కి తీసుకువచ్చాను.

సబిత నేరుగా తండ్రి గదిలోకి వెళ్ళింది.

సబితను చూసింతర్వాత సర్ లాల్ చంద్ లో ఏవిధమయిన పరివర్తనలు కలిగాయి అన్న విషయం గమనించే అవకాశం నాకు కలుగలేదు.

# 5

ఆరురోజులు నిర్విఘ్నంగా గడిచిపోయాయి.

ఈ ఆరురోజులు డాక్టర్ ప్రతిరోజూ వచ్చాడు.

గురువారంనాటి సాయంత్రం ఆయన సర్ లాల్ చంద్ పరిస్థితి కాస్త మెరుగు అయిందని చెప్పడమేకాక, అనుకున్న ప్రోగ్రాం ప్రకారం నర్స్ జూలీ లీవ్ తీసుకోవచ్చని చెప్పాడు.

ఆ రాత్రి రాగిణి కళ్ళలో ఒక విధమయిన పైశాచికమైన మెరుపుని నేను గమనించాను.

ఈలోపల రాగిణి తప్పకుండా ఒకసారి యూసుఫ్ ని కలుస్తుందని నాకెందుకో నమ్మకంగా వుంది. ఈ ఆరు రోజులుకూడా నేను ప్రతిక్షణం రాగిణిని అంటిపెట్టుకునే వున్నాను.

ఆరాత్రి పదకొండు గంటల ప్రాంతంలో రాగిణి నిశ్శబ్దంగా బయటకు రావడం నేను చూశాను. ఆమె శరీరంపై

కేవలం ఒక సిల్క్ నైట్ గౌన్ మాత్రమేవుంది. ఆమె తన గది కిటికీలోంచి బయటకు వచ్చింది.

ఆమె కిటికీలోంచి బయటకు రావడం నేను నాక్వార్టర్ నుండ్ బయటకు వస్తూ చూశాను. ఆమె ఇలా బయటకు వస్తుందని నేను అనుకోలేదు.

రాగిణి కిటికీలోంచి బయటకుదూకి, బంగళా ప్రక్క నుండి వెనుక సముద్రంవైపు సాగింది.

నేనూ నిశ్శబ్దంగా ఆమెను వెంబడించసాగాను.

బంగళా వెనుకవైపు సముద్రానికి దగ్గరగా ఒక చిన్న కాబిన్ వుంది. అందులో ఫిషింగ్ సామాను, స్విమ్మింగ్ దుస్తులు, వున్నాయి. ఒకవిధంగా అది రెస్ట్‌హౌస్‌లా వుపయోగపడుతుంది.

రాగిణి కాబిన్ తలుపు తెరచి లోపలకు ప్రవేశించింది. ఆమె కిటికీలకు, తలుపులకున్న కర్టెన్లను సరిచేసి లైటు వెలిగించింది.

కాబిన్ బంగళానుండి కొంచెందూరంలో వుండటమే కాకుండా చెట్లగుంపు మధ్యనవుంది. అందువల్ల బంగళా నుండి, కాబిన్‌నిగాని, అందులోని వెలుగునికాని చూడడం కష్టం. కర్టెన్స్ వేయటంవల్ల అతి తక్కువ వెలుగు బయటకు ప్రసరిస్తూంది.

నేను పిల్లిలా అడుగులువేస్తూ కాబిన్ సైడ్‌కి చేరుకుని, చెక్కగోడకు ఆనుకుని నిలబడ్డాను. కాబిన్ యొక్క సముద్రంవైపున్న కిటికీ తెరిచేవుంది. అక్కడ కర్టెన్ కూడా తొలగించబడివుంది.

కొద్దిసేపటి తర్వాత నేను సముద్రంలో తెడ్డువేస్తున్న శబ్దం విన్నాను. చూస్తుండగానే ఒక చిన్న చేపలుపట్టే ఒడ్డున ఆగింది. అందులోంచి ఒకవ్యక్తి క్రిందికి

అతను 'యూసుఫ్.'

నేను గాలి పీల్చటంకూడా మరచిపోయి ఎదురుచూస్తు న్నాను.

అతను క్రిందికిదిగి పడవను బలంగా ఇసుకలోకి లాగి కాబిన్ వైపు సాగాడు.

నేరుగా అతను తలుపువైపుకి వెళ్ళకుండా తెరిచివున్న కిటికీవైపు వచ్చి లోపలకు తొంగిచూశాడు. మందమయిన పసుపురంగు లైట్ వెలుగు అతని ముఖంపైబడి అతనిముఖం భయంకరంగా కనిపించింది నాకు.

అతను తలుపువైపు సాగాడు.

అతను తొంగిచూడటం రాగిణి గమనించినట్లుంది. అతను తలుపువద్దకు వెళ్ళేసరికి తలుపు తెరుచుకుంది. యూసుఫ్ లోపలకు వెళ్ళగానే తలుపులు మూసుకున్నాయి. మరో నిముషం తర్వాత తెరిచివున్న ఆ కిటికీకూడా మూసుకుంది.

నేను వెంటనే ఆ కిటికీవద్దకు వెళ్ళాను.

లోపలి వెలుగు బయటకు ఏమాత్రం ప్రసరించటంలేదు. కిటికీ కర్టెన్ లాగబడటంవల్ల, కిటికీకున్న సందుల్లోంచి లోప లకు చూచినా ఏమీ కనిపించటంలేదు.

నేను కిటికీకి చెవులానించి నిలబడ్డాను.

"థాంక్ గాడ్; టైముకే వచ్చావు. ఆలస్యం చేస్తా వేమో ననుకున్నాను" లోపలినుండి రాగిణి కంఠం వినిపిం చింది.

"శనివారంనాటి ప్రోగ్రాంలో మార్పేమీలేదు" రాగిణి తిరిగి చెప్పసాగింది. "నేనిక్కడే ఈ కాబిన్‌లో నీ కొరకు ఎదురుచూస్తుంటాను. సముద్రంవైపునుండి వచ్చేటప్పుడు, ఇవాళ్టి లాగే ఈ కిటికీలోంచి లైటువెలుగు కనిపిస్తే లైన్ క్లియర్‌గా వుందనుకుని నీవు ఇక్కడికిరా. ఒకవేళ లైటు వెలగకుంటేమాత్రం ఎస్టేట్ వైపు కన్నెత్తికూడా చూడకు.

తెలిసిందా? ఇక్కడ లైటు వెలగకుంటే బంగాళాలో ఏదో గందరగోళం జరిగిందనుకో..."

"మంచిది" యూసుఫ్ అన్నాడు.

"ఒకవేళ లైటు వెలుగుతూంటేమాత్రం సరిగ్గా పదకొండు న్నరకంతా ఇక్కడికి వచ్చేయ్. నేను నీకిక్కడే కలుస్తాను. టైం విషయంలోమాత్రం పొరపాటు చేయకు."

"అచ్ఛా; అచ్ఛా!"

"చేతులకు గ్లవుస్ తొడుక్కోవడం మరచిపోవద్దు. మరో విషయం. సబిత అరవకుండా చూడు. ఒకవేళ అరచినా ఫరవాలేదనుకో, మొత్తం బంగళాలో ఎవరూ వుండరు. మిస్టర్ లాల్‌చంద్, సబిత అరుపులన్నీ విన్నా కదలలేడు కనుక ఏమీ చేయలేడు. ఆమె అరుపు కృష్ణకుమార్ క్వార్టర్ వరకు వినిపించదు. అయినా నీ జాగ్రత్తలో నే వుండటం మంచిది."

"ఆ విషయం చూసుకుంటాను. సబిత పని పూర్తి చెయ్యటం చిటికలో అయిపోతుంది."

"రైట్; ఇక నీవు వెళ్ళు. ఎల్లుండి రాత్రి పదకొండు న్నరకి రా!"

"ఈ కాబిన్‌లో లైటు వెలిగితేనే..."

"శబాష్."

ఆ తర్వాత కాబిన్‌లోంచి మాటలు వినిపించటంలేదు. నేను అక్కడనుండి నిష్క్రమించాను.

# 6

ఆ రోజు శనివారం సాయంత్రం ఎస్టేట్‌లోని మొత్తం స్టాఫ్ దసరా వుత్సవాలు చూడడానికి వెళ్ళిపోయారు. నర్స్ జూలీకూడా సబితకి సర్ లాల్‌చంద్‌కి ఇవ్వాల్సిన మందుల విషయం బోధపరిచి వెళ్ళిపోయింది.

చీకటిపడే సమయానికి ఆ ఎస్టేట్‌లో నేనూ, రాగిణి,

సబిత, సర్‌లాల్‌చంద్ ఈ నలుగురమే మిగిలిపోయాము.

రాత్రి ఎనిమిదిన్నరకి సబిత నన్ను వెళ్ళిపొమ్మని, తను ఒక నవల అందుకుని తండ్రిపక్కగా కూర్చుంది.

నేను నా క్వార్టర్‌లోకి వచ్చాను.

పది గంటలకంతా బంగళాలోని లైట్లన్నీ ఆరిపోయాయి.

నేను నా బెడ్‌పై పడుకుని ఒక మాగజైన్ చదవటం మొదలు పెట్టాను. నా మంచాన్ని నేను కిటికీ పక్కగా జరిపాను. దానివల్ల బయటి నుండి చూసే వాళ్ళకు నేను గదిలోనే వున్న విషయం స్పష్టమౌతుంది. నేను నామ మాత్రంగా పత్రికను చేత్తో పట్టుకున్నానే కాని నా దృష్టంతా బయటే వుంది.

సుమారు అరగంట తర్వాత నాకు నా క్వార్టర్‌కు కొద్ది దూరంలో వున్న పొదలవద్ద ఒక స్త్రీ ఆకారం కనిపించింది. కొద్దిసేపు ఆ ఆకారం అక్కడే నిలబడి తర్వాత బంగళా వైపు సాగింది. ఆమె నడకను బట్టే ఆమె రాగిణి అని చెప్ప గలను. నేను నా క్వార్టర్‌లోనే వున్నానో, లేదో చూడ్డా నికి వచ్చిందామె.

ఆమె లోపలకు వెళ్ళగానే నేను మ్యాగజైన్ విసిరి ఎదురు చూడసాగాను.

దూరంగా ఎక్కడో గడియారం పదకొండు గంటలు కొట్టింది. నేను నా క్వార్టర్‌లోని లైటు ఆర్పాను.

నేను, బయటకు వచ్చి కాబిన్ వైపు నడిచాను.

కాబిన్‌లో ఇంకా చీకటిగానే వుంది.

నేనో చోట చెట్టుక్రింద నిలబడి చేతులకు గ్లవ్స్ తొడి గాను. నా పాంటు కుడి జేబులో ఇసుకనింపి కుట్టిన సంచి. రెండవ జేబులో నేను దొంగిలించి తెచ్చిన రాగిణి ముత్యాల హారం వుంది. నేను ఓపిగ్గా ఎదురు చూస్తూ నిలబడ్డాను.

సుమారు పది నిముషాల తర్వాత రాగిణి కాబిన్ వైపు

వెల్తురు కనిపించింది.

నేను జాగరూకుడనై వూపిరి బిగపట్టి నిలబడ్డాను.

రాగిణి తలుపు దగ్గరకు వెళ్ళి తలుపు తెరచి లోపలకు ప్రవేశించింది. నేను నిశ్శబ్దంగా ముందుకు సాగి కాబిన్ కి ఆనుకుని నిలబడ్డాను. లోపల లైటు వెలిగింది, మొన్నటిలాగే సముద్రపు కిటికీ తప్ప మిగిలిన కిటికీలన్నీ మూసేవున్నాయి.

నేను నా స్థానంలో కదలకుండా నిలబడ్డాను.

నలువైపులా భయంకర నిశ్శబ్దం అలుముకుని వుంది.

నా అనుమానం ప్రకారం పదకొండు ఇరవయి అయి వుంటుందనుకున్న తర్వాత నా స్థానంలోంచి కదిలి కాబిన్ ప్రవేశ ద్వారం వైపుకి సాగాను.

నేను నెమ్మదిగా తలుపుని నెట్టాను.

తలుపు తెరుచుకుంది.

"యూసుఫ్" రాగిణి మెల్లగా గుసగుస లాడుతున్నట్లుగా అంది.

నేను కర్టన్ తొలగించుకుని లోపలకు ప్రవేశించాను.

నన్ను చూడగానే రాగిణి భూతాన్ని చూసి వులికి పడ్డట్లుగా వులికి పడింది. ఆమె నోటినుండి మాట పెకలటం లేదు. కళ్ళు విస్ఫారితమయ్యాయి. "నీవా?" అంది చివరకు.

నన్ను చూసి ఆమె భయపడటం సహజమే. ఏ క్షణంలో నయినా యూసుఫ్ అక్కడికి రావచ్చు. నన్ను అక్కడ చూసి అతను ఆమెను అనుమానించ వచ్చు.

"పదకొండున్నర అయిపోయినా మీరింకా రాలేదు మేడమ్! నాకు కాబిన్ లో లైటు కనిపించి ఒకవేళ మీరు కాని ఇక్కడ వున్నారేమోనని వచ్చాను," నేను అతి సహజంగా అన్నాను.

నన్ను చూసిన కంగారులో ఆమెకు నా క్వార్టర్ నుండి

కాబిన్ లైటు కనిపించదన్న విషయం కూడా జ్ఞాపకం రాలేదు.

ఆమె కంగారుగా తలుపు వేపు చూడసాగింది.

"నో, నో," ఆమె కంగారుగా అంది. "నీవు నీ క్వార్టర్ లోకి వెళ్ళు. నేను అక్కడికే వస్తాను."

"బట్, మేడమ్! నేనే ఇక్కడికి వచ్చిన తర్వాత... మళ్ళీ..."

"నేను చెప్పాను కదా! నీవు వెళ్లు."

"ఇంతకీ విషయమేమిటి మేడమ్! మీరెందుకింతగా భయపడుతున్నారు?" అడిగాను.

ఆమె నాకు జవాబివ్వలేదు. ఒకసారి తన వాచికేసి చూసుకుని కంగారుగా స్విచ్ బోర్డ్ వైపు సాగుతూ "పద! నేను నీతో వస్తాను" అంది.

కాబిన్‌లో చీకటిగా వుంటే యూసుఫ్ రాకూడదని ఆదేశించింది. కాబిన్‌లో లైటు ఆర్పి యూసుఫ్‌ని రాకుండా చేయాలనుకుంది ఆమె.

ఆమె వీపు నా వైపు కాగానే నేను టేబిల్ పైనుండి వీనస్ ప్రతిమను అందుకున్నాను. దానిని బలంగా నా చేత్తో పట్టుకుని, చేతిని పైకి లేపాను.

అప్పుడే రాగిణి ఎందుకో వెనక్కి తిరిగింది.

ఆమె నా చేతిలో వీనస్ ప్రతిమని, పైకి లేచిన చేతిని చూసింది. నా చేతులకున్న గ్లవుస్, నా కళ్ళలో ఆమెకు మృత్యువు కనిపించి వుండాలి. తక్షణమే తనకేగతి పట్టనుందో ఆమె అర్థం చేసుకుంది.

భయంవల్ల నేత్రాలు వెళ్ళుకు వచ్చాయి. తనని రక్షించు కోవడానికి రెండు చేతులు ముందుకు చాస్తూ అరవడానికి నోరు తెరిచింది కాని, ఆమె గొంతుక లోంచి శబ్దం బయటకు రావడానికి ముందే వీనస్ ప్రతిమను పట్టుకున్న నా చేయి మెరుపులా క్రిందికి జరిగింది. ఆ బరువయిన ప్రతిమ రాగిణి

తలను ముద్దుపెట్టుకుంది.

రాగిణి తల పగిలింది. ప్రతిమవల్ల అయిన గాయంలోంచి రక్తం పిచికారిలోంచి ఎగజిమ్మినట్లు చిమ్మింది. తడబడుతూ నా కాళ్ళ వద్ద పడింది.

ఆమె ప్రాణాలు పోయాయి.

నేను నెత్తుటితో తడిసిన ఆ ప్రతిమను అలాగే పట్టుకుని వణుకుతూ నిలబడ్డాను.

అనుకోకుండానే నా దృష్టి కిటికీలోంచి బయటపడింది. దూరంగా సముద్రంలో ఒక దోనె వస్తూంది.

యూసుఫ్ వస్తున్నాడు.

నేను వీనస్ ప్రతిమను రాగిణి శవంవద్ద పారేసి వేగంగా బయటకు వచ్చాను. నేను కాబిన్ తలుపులు చేరవేసి సముద్రం వైపు నడిచాను. యూసుఫ్ ఇంకా దూరంలోనే వున్నాడు. అనుకోకుండానే నా చేతులు జేబులో దూరి ఇసుక సంచిని బలంగా పట్టుకున్నాయి. దానితో అతని మెడమీద బాది చంపి, ముత్యాల హారం అతని జేబులో పెట్టి, అతనిని, దోనెను నీళ్ళలో ముంచెయ్యాలని నా ప్లాను. చూచిన వాళ్లు అతనే రాగిణిని చంపి ముత్యాల హారం దొంగిలించాడంటారు.

నేను మెల్లగా చెట్లగుంపు మధ్యగా ముందుకు పోతున్నాను.

అంతలో "కృష్ణకుమార్!" అని ఎవరో పిలవడంతో నేను ఉలిక్కిపడ్డాను.

నా రక్తం గడ్డ కట్టింది. ఇంకొక్క అడుగు ముందుకు వేసినా నేను లోతైన లోయలోకి దిగజారి పోతానే అన్నట్లుగా తక్కిన ఆగిపోయాను.

## 7

చెట్టు చాటునుండి ఒక ఆకారం నా వైపుకి రాసాగింది. అతిసున్నితమయిన ఆ స్థితిలో మరో వ్యక్తిని అక్కడ

చూచి నా గుండెలు గుబగుబ లాడుతున్నాయి.

"కృష్ణకుమార్!"

ఈసారి నేనా ఆకారపు కంఠంతో పాటు అతని ముఖాన్ని కూడా పోల్చుకో గలిగాను.

ఆ ఆకారం డాక్టర్ గుప్తాది.

"ఆఁ!" నేను మెల్లగా అన్నాను.

"నీవు ఇక్కడ ఏం చేస్తున్నావు?" అతను నాతో అన్నాడు. కాని నా జవాబు గురించి ఎదురుచూడ లేదతను. అతను నా జబ్బ పట్టుకుని చెట్టుచాటుకి లాగాడు.

"ఇప్పుడిక్కడికి యూసుఫ్ వస్తాడు. నీవు అతనికి కనిపించే ఉంటే అంతా సర్వనాశనమయి వుండేది... అయినా నీవు ఇక్కడికి ఎందుకు వచ్చావ్?"

"నేను... నేను... నాకు నిద్రరాలేదు. మనస్సంతా బరువుగా...వుంది. అందుకని చల్లగాలికి సముద్రం వైపు వచ్చాను" తడబడుతూ చెప్పాను.

"నీవు కాబిన్ వద్ద నుండి వెళ్ళావా?"

"ఆఁ!"

"లోపలకు వెళ్ళలేదా?"

"లేదు, ఎందుకు?"

"కాబిన్‌లో లైటు వెలుగుతోంది. అయినా నీకు అనుమానం కలగలేదా?"

"కలిగింది" నేను మెల్లిగా అన్నాను.

"అయినా లోపల ఎవరున్నారో చూడాలనిపించ లేదా?"

"లేదు. నేను చెప్పాను కదా! నా మనస్సు బాగుండు లేదని. అందుకని ఆ విషయం నేను పట్టించుకో లేదు."

"మంచి పని చేశావు. లేకుంటే రాగిణిని హెచ్చరించి నట్లయ్యేది."

"రాగిణీ!"

"అవును, కాబిన్‌లో రాగిణి వుంది."

"ఈజిట్?"

"హాఁ! ఆ తుచ్ఛురాలు ఏం చేయాలనుకుంటోందో నీకు తెలుసా?"

"ఏం చేయాలనుకుంటోంది?" నేను అడగడమయితే అడిగాను కాని, నాలో నిలబడే శక్తి క్షీణించినట్లు అనిపించసాగింది.

"రాగిణి; యూసుఫ్ లిరువురూ కలిసి సబితను హత్య చేయనున్నారు. రాగిణి కాబిన్‌లో కూర్చుని యూసుఫ్ గురించి ఎదురుచూస్తూండవచ్చు. అతను ఏ క్షణంలోనయినా ఇక్కడికి రావచ్చు. వాళ్ళను బంధించడానికి నేనో వల పన్నాను. ఫర్ యువర్ ఇన్ఫర్మేషన్, ఈ ఇంటిని పోలీసులు చుట్టుముట్టి వున్నారు."

నేనేమీ చెప్పలేదు. మాట్లాడే స్థితిలో లేనుకూడా! ఇప్పుడో అప్పుడో గుండె కొట్టుకోవడం ఆగిపోతుందేమోననిపిస్తోంది.

"సర్ లాల్‌చంద్ మోటార్‌కార్ ఆక్సిడెంట్‌కి కారకురాలు రాగిణి అని చెబితే నీవు ఆశ్చర్యపోవచ్చు" డాక్టర్ గుప్తా చెప్పుకుపోసాగాడు. "ఆ ఆడది, ఆయన కారు బ్రేకులు పనిచేయకుండా చేసింది. దాంతో ఆయన మరణిస్తే వీలునామా మార్చరని, పాత వీలునామావరకు సగం ఆస్తిని హస్తగతం చేసుకోవచ్చని ఆశించింది. కాని ఆయన మరణించలేదు. కేవలం పారాలిసిస్ ఆటాక్ అయింది.

"ఇన్నాళ్ళు ఆమెకి అతని చావు గురించి ఎదురుచూసి విసుగెత్తినట్లయింది. ఇవాళ యూసుఫ్‌తో కలిసి కొత్తఎత్తు వేసింది. మొదలు యూసుఫ్ సబితను బలాత్కారం చేసిన తర్వాత ఆమెను హత్యచేస్తాడు. ఆ విషయం వినగానే సర్ లాల్‌చంద్ హార్ట్‌ఫేల్ అవుతుంది. ఒకవేళ కాకున్నా,

వారాయన్ని చంపి, అది కేవలం కూతురు విషయంవిని గుండె ఆగి మరణించినట్లు నిరూపించదలిచారు. వాళ్ళు యీ స్కీములో సఫలీకృతులయితే నీవు ఇరుక్కుంటావు. సవితెను చేరిచి ఆమెను చంపింది నీవేనని వాళ్లు పోలీసులకు తెలుపదలచుకున్నారు."

"కాని...కాని...డాక్టర్ మీ కిదంతా ఎలా తెలుసు?" నేను నా గొంతుక తడారిపోతుండగా అడిగాను.

"సర్ లాల్ చంద్ ని మానసికంగా బాధపెట్టాలవి రాగిణి తన యీ స్కీముని గురించి ముందే ఆయనకు తెలిపింది. ఆయన కదల్లేరని, మాట్లాడలేరని ఆమె అంత ధైర్యంగా చెప్ప గలిగింది. కాని అసలు జరిగిందేమిటంటే రాగిణి మాటలు ఆయనను బాగా దెబ్బతీసాయి. ఆయన గుండెకు బలమయిన గాయం కలిగింది. అంతటి స్థితిని ఆయన ఎలా ఓర్చుకో గలిగాడో నాకే ఆశ్చర్యంగా వుంది. తన కూతురుకి కలుగబోయే ఆపదను గురించి అందరికి తెలియచేయాలని ఆయన ఎంతగా వ్యాకులపడ్డారంటే, ఆ వ్యాకులమే ఆయనకు మాట వచ్చేటట్లు చేసింది.

"రాగిణి ఈ విషయం ఆయనకు చెప్పినప్పటినుండి, తన కూతురుని రక్షించుకోవడానికి, తానేమయినా చేయాలని, లేకుంటే తన కూతురు అమానుషంగా చంపబడుతుందన్న భావనవల్ల ఏదో చెప్పడానికి, ఆయన చాలా వ్యాకులపడ్డారు. విపరీతమయిన శ్రమవల్ల, తన కూతురు క్షేమం ఆయన్ని మాట్లాడేటట్లు చేసింది. ఆయన మొన్న మొత్తం విషయాన్ని నాకు వివరించారు. నే నా విషయం పోలీసులకి తెలిపాను. తత్ఫలితమే ఇవాళ పోలీసులు యింటిని చుట్టుముట్టి వున్నారు. వాళ్ళు, ఆ ఇద్దరిని రెడ్ హాండెడ్ గా పట్టుకోడానికి ఎదురు చూస్తున్నారు."

ఓహ్ గాడ్!...నిస్సహాయంగా నిలబడిపోయాను నేను

తొందరపడి నేను అనవసరంగా రాగిణిని చంపి, ఆ హత్యాపరాధాన్ని తలపైకి తెచ్చుకున్నాను. నే నేమీ చేయకున్నా రాగిణి పట్టుబడేదే! నా తరఫున నే నోమంచి చేయబోయి, నన్ను నేను సర్వనాశనం చేసుకున్నాను. యూసుఫ్‌ని పోలీసులు అరెస్ట్ చేస్తే రాగిణి హత్యాపరాధాన్ని నే నతనిపై ఎలా తోయగలను.

నలువైపులనుండి చుట్టుముట్టబడినట్లయింది నా స్థితి.

"అంతేకాదు, రాగిణి సర్ లాల్‌చంద్‌కి నీవు పరారయిన ఖైదీ కృపాల్‌సింగ్‌వనికూడా చెప్పింది. ఆయనవల్ల నాకూ నా ద్వారా పోలీసులకి తెలిసింది. వాళ్ళిద్దరితోపాటు వాళ్ళు నిన్ను కూడా అరెస్టు చేస్తారు. నీ విప్పుడు పారిపోవాలనుకున్నా పారిపోలేవు."

నా మోకాళ్లు కంపించాయి. తొడల్లో నరాలు విపరీతంగా కదిలాయి. నా జేబుల్లోవున్న ఇసుకసంచి, ముత్యాలహారం, ఏ క్షణంలోనయినా ప్రేలడానికి సిద్ధంగావున్న టైంబాంబులలా వున్నాయి.

"అరె! నీ యీ కమీజుపై మరకలేమిటి?" ఆయన అడిగారు. అప్పటికే కళ్ళు చీకటికి బాగా అలవాటు పడటం వల్ల ఆయన నా షర్ట్ చూస్తూ అడిగారు.

నేను తల వంచి షర్ట్ చూసుకున్నాను. నా షర్టునిండా రక్తం. నా గొంతుక ఎండారిపోయి, నాలుక పిడుచకట్టుకపోతూంది. కళ్ళు తిరిగి నేల కొరిగాను.

డాక్టర్ గుప్తా చేయిచాచి నన్ను పడిపోకుండా పట్టుకున్నారు.

"అరె! ఇది నెత్తురులా వుందే!" అని ఆయన కంగారుగా అనటం నాకు లీలగా వినిపించింది.

—: అయిపోయింది :—

# యురేనియం - 235

## కె. శివరామ్

భుజంగరావు తన కారులో ఎస్టేట్ వైపు వెళ్ళుతున్నాడు.

నలభై ఏళ్ళవాడు. దృఢమైన శరీరం గలవాడు. స్ఫురద్రూపి. మెరిసే కళ్ళు.

భుజంగరావు అతి వుత్సాహంగా కారు నడుపుతున్నాడు. ఆతని మనసు సంతోషంతో గంతులేస్తూంది.

భుజంగరావుకు మాతృదేశమంటే అలవిమాలిన భక్తి. ఏదో ఒకటి దేశసేవ చేయాలని వువ్విళ్ళూరుతూంటాడు.

'ప్రభుత్వం నీకేం చేస్తున్నది అని అడగడానికి ముందు నువ్వు ప్రభుత్వానికి ఏం చేస్తున్నావో ఆలోచించుకో' అన్న స్వర్గీయ కెన్నెడీ మాటలను భుజంగరావుకి పదేపదే మననం

చేసుకోవడం అలవాటు.

ప్రతివ్యక్తీ ప్రభుత్వానికి అండగావుంటే దేశం సుభిక్షంగా వుంటుంది, అను సిద్ధాంతం కలవాడు భుజంగరావు. తనకు రెండు ఎస్టేట్లున్నవి. సాలీనా ఆదాయం కొన్ని లక్షలకు దాటుతుంది.

పెద్దలు సంపాదించిన ఆస్తిపాస్తులున్నై. వాటితో తను దేశానికి వుపయోగపడు కార్యం ఏదైనా చేయాలని భుజంగ రావుకు చిరకాల వాంఛ.

తన వాంఛను నెరవేర్చుకోడానికి భూగర్భశాస్త్రాన్ని, అణుశాస్త్రాన్ని క్షుణ్ణంగా నేర్చుకున్నాడు. దేశదేశాలు తిరిగాడు. కొన్ని కోట్లరూపాయలు ఖర్చు పెట్టాడు. రేయిం బవళ్లు శ్రమిస్తున్నాడు.

తన కోర్కె ఈ దేరుకాలం ఆసన్నమైపోయింది.

అందుకే భుజంగరావుకు అంత వుత్సాహంగావుంది.

భుజంగరావు కారు ఎస్టేట్‌లో ఒక రహస్య ప్రదేశంలో తిరిగింది. కొంతదూరం చెట్ల మధ్యగుండా కారు ప్రయాణించింది.

ఎదురుగా—

న్యూక్లియర్ చెయిన్ రియాక్టింగ్ పైల్ వుంది. అంటే అణుబాంబుల ఉత్పత్తి నిలయం!!

భుజంగరావు కారు దిగగానే అక్కడున్న వైజ్ఞానికు లందరూ విష్ చేశారు. అక్కడున్న వారందరి ముఖాల్లోను ఆనందోత్సాహాలు వుట్టిపడుతున్నై. కరచాలనం ముగిసింది. భుజంగరావును లోపలకు తీసుకెళ్లారు.

అక్కడ "ఫిషన్-ఫ్యూషన్-ఫిషన్" బాంబు వున్నది. ఆ బాంబును తయారుచేసిన శాస్త్రజ్ఞులందరూ గర్వంతో నిలబడి వున్నారు. ఆ బాంబు యిప్పటికి తెల్సిన బాంబు లన్నిటిలో కెల్లా అధిక విధ్వంసక శక్తిగలది. దాని శక్తి

అపారమైనది.

అంతేగాక రకరకాల భయంకరమైన బాంబులువుత్పత్తి అయివున్నవి. ఫిషన్ ద్వారా ప్రేలే ఆటంబాంబులు, ఫ్యూషన్ ద్వారా ప్రేలే హైడ్రోజన్ బాంబులు అతి జాగ్రత్తగా భద్రపరచబడి వున్నవి.

అక్కడున్న సైంటిస్టులందరూ దేశదేశాలకు చెందినవారు. జర్మన్లు, అమెరికన్లు, ఇజ్రాయిల్ వారు, రష్యన్లు, గొప్ప గొప్ప విజ్ఞానులు. వాళ్ళందరినీ భుజంగరావే ఎంతో వ్యయ ప్రయాసలకు ఓర్చి పిల్చుకువచ్చి బాంబులను తయారు చేయించాడు.

భుజంగరావుకి భూగర్భశాస్త్రంలో ప్రవేశంవుంది గనక తన ఎస్టేటులో ఒకచోట యురేనియం లభ్యమవుతుందని పసిగట్టాడు. వెంటనే వెలికి తీయించి పరిశోధించాడు. సహజమైన యురేనియం సమృద్ధిగా లభ్యంకావడం తెల్సుకున్నాడు. అతని మెదడులో రకరకాల ఆలోచనలు మెదిలాయి.

మన ప్రభుత్వాన్ని అణుబాంబులను తయారు చేయడానికి లైసెన్సు యివ్వవలసినదిగా కోరాడు. శాంతిని ఆకాంక్షించు మన భారత ప్రభుత్వం లైసెన్సు యివ్వ నిరాకరించింది.

అందుకు భుజంగరావు విచారించలేదు. అమెరికా, జర్మనీలకు వెళ్ళాడు. అక్కడున్న ప్రయివేట్ వైజ్ఞానికులతో సంప్రతించాడు. రహస్యంగానూ, మర్మంగానూ చాలా మంది శాస్త్రజ్ఞులను తన ఎస్టేటుకు రప్పించాడు. బాంబులను తయారుచేయడం ప్రారంభించాడు.

ఆ బాంబులన్నింటిని యేం చేస్తాడో, ఏంచేసుకుంటాడో ఎవరికీ అంతుపట్టలేదు. ప్రపంచంలో ఏ ఒక వ్యక్తి స్వంతముగా న్యూక్లియర్ రియాక్టర్లను నిర్మించడం అసంభవం

అయినపని!

కానీ భుజంగరావు నిర్మించుకున్నాడు. పైగా తను అనుకున్న ప్రకారం బాంబులను తయారు చేయించాడు. నిల్వ చేశాడు.

పరమాణు యుగంలో ఉత్పత్తి అయిన పదిలక్షల టన్నుల ప్రేలుడు మందుకు సమమైన అణుబాంబులాటి మెగాటన్ను బాంబుకంటె ప్రముఖ పదార్థం రేడియో ఐసోటోపు. ఈ ఐసోటోపు న్యూక్లియర్ రియాక్టర్ల సాయంతో విరివిగా ఉత్పత్తి చేయొచ్చు. ఈ రియాక్టర్ భుజంగరావు ఎస్టేటులో వుంది.

అక్కడవున్న బాంబులన్నిటిని శాస్త్రజ్ఞులు భుజంగరావుకు విడమర్చి చెప్పారు. ఆ తరువాత భుజంగరావును ఆటంబాంబులను తయారుచేయు ఫిషన్ విభాగానికిపిలుచుకు వెళ్ళారు. విచ్ఛిన్నం చేసే ప్రక్రియను ఫిషన్ అంటారు. ఈ ఫిషన్ ద్వారానే ఆటంబాంబులు ప్రేలుతాయి.

సహజమైన యురేనియం తాలూకు 140 పాళ్ళల్లో ఒక్క పాలే యురేనియం_235.

మిగతా 139 పాళ్ళు యురేనియం_238 ఐసోటోపు.

స్వచ్ఛమైన, అసలైన సిసలైనది యురేనియం_235. దీనిని పేర్చుకుంటూ రావాలి. 8 లేక 9 అంగుళాల వ్యాసం వచ్చేంతవరకు పేర్చుకుంటూ వస్తే ప్రేలిపోతుంది. దీనినే ఎ_బాంబు అంటారు. యు_238 ఖండనకు గురికాదు.

యురేనియం_235 ఉండ ఒక పరిమాణానికి తక్కువగా వున్నట్టయితే ప్రేలుడు జరగదు. యురేనియాన్ని యెలా పేర్చుతారో భుజంగరావుకు తెలియదు. ఆ విషయం శాస్త్రజ్ఞులకే తెల్సు.

ఒక్క అణుబాంబు తయారుకావడానికి 16 లక్షల రూపాయలు వ్యయమవుతుందని అంచనా. యురేనియం_235

వేరుపరచడమే కష్టతరమైనది. ఇప్పుడు అక్కడ తయారగు బాంబు మూడవది. రెండు తయారైపోయివున్నవి. మూడు హైడ్రోజన్ బాంబులు ఎప్పుడో తయారు చేసివున్నారు. మొత్తం ఆరు బాంబులు తయారు కావల్సివున్నది. అయిదు తయారైపోయాయి.

యురేనియం అవధి ప్రమాణం చేరుకుంటే న్యూట్రానుల సంఖ్య పెరిగి సెకండులో మిలియనో వంతు కాలవ్యవధిలో అసంఖ్యాకమైన ఖండనలు జరుగుతాయి. ప్రతి ఖండనకు Mev శక్తి ఉత్పత్తి అవుతుంది. ఫలితం ప్రచండమైన భయంకరమైన బాంబు.

సృష్టిలో యు-235 కు భగవంతుడు ఎందుకంత శక్తి ఇచ్చివున్నాడో ఆశ్చర్యం! అది తెల్సుకున్న మానవుడు ఇపుడు దేవుణ్ణీ లెక్క చేయడంలేదు. ఈ ఆటమ్‌ను క్రీస్తు పూర్వం 5 వ శతాబ్దంలోనే డెమోక్రిటస్ అనునతడు కని పెట్టి పేరుపెట్టాడు. ఆటమ్ అంటే గ్రీకు భాషలో విభజింప రానిదని అర్థం! అంటే పరమాణువు!

చివరిబాంబు తయారైపోతూంది. శాస్త్రజ్ఞు లందరినీ వారివారి దేశాలకు తగిన రీతిని సత్కరించాడు భుజంగరావు.

యురేనియం-235 పేర్చుకు రావడమే కష్టం. అది జరిగి పోయింది. పేర్చిన తరువాత బాంబుగా అమర్చడం తేలిక. ఇక తనే బాంబును తయారు చేసుకోవచ్చు.

శాస్త్రజ్ఞు లందరికీ వీడ్కోలివ్వాలి. గనక అందరితో పాటు భుజంగరావు విమానాశ్రయానికి బయలుదేరాడు. బ్రాంట్ తో భుజంగరావు ముచ్చటించుతున్నాడు. బ్రాంట్ కూడా చాలా ఉత్సాహంగా కబుర్లు చెప్పుకు పోతున్నాడు.

బ్రాంట్ తన జేబులో వుండిన డైరీ క్రిందకు జారిపోయిన సంగతి తెల్సుకోలేక పోయాడు. అతను కూర్చుని వుండిన

సీటు మీదనుండి క్రిందకు జారిపోయింది. ఎవరూ గమనించ లేదు.

ఇంతలో విమానం బయలుదేర బోతుందని లౌడ్ స్పీకర్లో అనౌన్స్ వినబడగానే ఆదరాబాదరాగా విమానం వైపు బ్రాంట్ వెళ్ళిపోయాడు. క్రిందపడ్డ డైరీ నేలమీదనే పడి వుంది. ఆ డైరీ అప్రయత్నంగా ఒకతని దృష్టిలో పడింది.

## 2

"డియర్ హనీ! నా లక్ష్యం నెరవేరింది. ప్రపంచంలో ఏ దేశానికీ ఏ దేశ భక్తుడూ చేయని మహత్కార్యం నేను మన దేశానికి చేశాను," అని ఉప్పొంగి పోయాడు భుజంగ రావు.

"ఏం చేశారేమిటి?" ప్రశ్నించింది దేవకి, భర్తను.

"దేశానికి శక్తిని పెంపొందించాను.బలాన్ని చేకూర్చాను. మాతృభూమికి అపారమైన, అఖండమైన ఎనర్జీని తయారు చేయించాను. నేటివ్ పవర్ని రక్షించుకోడానికి నేను తయారు చేసిన శక్తి మన దేశానికి యెంతో వుపకరిస్తుంది." అని భుజంగరావు గంతులేశాడు. అతనిలోని వుల్లాసం గమనించిన దేవకికి కారణం ఏమిటై వుంటుందో వూహకందలేదు.

"వివరంగా చెప్పండి" గోముగా అడిగింది దేవకి.

"చెప్తాను. నీకు చెప్పడానికి, చూపడానికే తెచ్చాను." అనంటూ భుజంగరావు రెండు వేరువేరు పెట్టెలను దేవకి ముందు బెడ్ మీద పెట్టాడు. ఆమె విచిత్రంగా ఆ పెట్టెలను చూచింది.ఆ పెట్టెలలో ఏముందో? ప్రశ్నార్థకంగా చూస్తూ వుండి పోయింది.

ఆనందంతో భుజంగరావు ఒక పెట్టెను తెరిచాడు. ఏదో లోహం తళతళ మెరిసిపోతూంది. అది ఏమిటో ఆమెకు తెలియరావడం లేదు.

"ఏమిటండి అది?" అడిగింది దేవకి.

"ఇదే యురేనియం_235!!"

"ఎందుకు?"

"ఎందుకేమిటి? ఇదే అణుబాంబు!!"

"మైగాడ్!అణుబాంబే... యురేనియం ఆటమ్ బాంబ్?!"

"యస్. యస్." అన్నాడు భుజంగరావు.

ఆత్రంగా యురేనియం_235ని భర్త చేతిలో ఉన్నదాన్ని దేవకి తీసుకుంది. తిప్పి తిప్పి చూసింది. చాలా బరువుగా వుంది. కాసేపుకూడా చేతిలో పట్టుకోలేకపోయింది. బెడ్ మీదున్న పరుపు మీదుంచింది. ఆ యురేనియాన్ని విచిత్రంగా చూచింది దేవకి. అది యెలా ప్రేలుతుందో ఆమె కంతుపట్టలేదు.

"ఇది యెలా పేలుతుంది?" అడిగింది దేవకి.

"అది ఒక్కటే ప్రేలదు. మరో సగం ఈ పెట్టెలో వుంది" అనంటూ భుజంగరావు ఇంకో పెట్టెనూ తెరిచాడు. అందులో వేరే సగం యురేనియం_235 వుంది.

"ఈ రెండు యురేనియం ముద్దలు కల్సుకుంటే చాలు భయంకరమైన ప్రేలుడు సంభవిస్తుంది" అని చెప్పాడు భుజంగరావు.

భార్యాభర్తలవద్ద రెండు యురేనియం ముద్దలున్నవి. ఆ రెండూ కొబ్బరిచిప్పల ఆకారంలో వున్నవి. రెండూ కలిపితే తొమ్మిది అంగుళాల వ్యాసంవుంటుంది.రమారమి బాస్కెట్ బాల్ అంత వుంటుంది.

"ఈ రెండూ కలిపితే ప్రేలుతుందంటున్నారు కదా! ప్రయోగించే దెలా?" అడిగింది దేవకి.

"ఈ రెంటినీ కలపడమే!" చెప్పాడు భుజంగరావు.

"ఇంతటి భయంకరమైన బాంబును యింటికి ఎందుకు తెచ్చారు?"

“నీకు చూపాలని తెచ్చాను. అణుబాంబునుగూర్చి నీకు చెప్పాలని తెచ్చాను” అన్నాడు భుజంగరావు. అతనికి భార్యమీద ఎంత అనురాగం, ప్రేమ వుందో దేవకి అర్థం చేసుకో కలిగింది.

“పొరబాటున యెవరైనా ఈ యురేనియం ముద్దలు కలిపితే ఏమవుతుంది? ఈ నగరమే కాదు...చుట్టు ప్రక్కల ప్రదేశాలన్నీ భస్మీపటలమైపోతాయి. ముందు తీసుకెళ్ళండి” అని దేవకి భయాన్ని వ్యక్తపరిచింది.

భుజంగరావు నవ్వాడు.

“అణుబాంబు ప్రయోగం మూలంగా యెంతటి విధ్వంసం సంభవిస్తుందో లోకమెరిగిన సత్యం! అందుకే అణుబాంబులు గల దేశాలు అగ్రరాజ్యాలని, శక్తివంతమైనవని గణన కెక్కుతున్నవి.”

“ఒక దేశానికి ఉండవల్సిన అణుబాంబు మన వద్ద ఎందుకు?”

“మన దేశంలో అణుబాంబులేవు. అణుబాంబులు తయారు చేయడానికి సకల సదుపాయాలు ఉన్నవి. కానీ తయారు చేయడంలేదు. మనదేశం వద్ద అణుబాంబులు లేవు గనక కొన్ని శత్రు దేశాలు పొంచి వున్నవి. యుద్ధానికి ఆయత్తమవుతున్నవి. ఈ రోజుల్లో అణ్వస్త్రాలు లేని దేశం బలహీనమైనదని, సాంకేతిక రంగంలో వెనుక బడిందని, పేద దేశమని రకరకాలుగా హేళనకు గురవుతూంది.”

“అందుకని?”

“అణ్వస్త్రాలు తయారు చేశాను. దేశానికి శక్తిని, సామర్థ్యాన్ని యినుమడింప జేశాను” గర్వంతో అన్నాడు భుజంగరావు.

“మనదేశం శాంతిని ఆకాంక్షించటంలో పేరు మోసింది. అందుకే అణ్వాయుధాలు ఉత్పత్తి ప్రారంభించలేదు”

చెప్పింది దేవకి.

"శాంతిని పలికే దేశాలన్నో ప్రపంచంలో అణ్వాయుధాలను సిద్ధంగా వుంచుకుని ఉన్నవి. మనదేశానికి ప్రస్తుత ప్రపంచ పరిస్థితుల దృష్ట్యా అణ్వాస్త్రాలు అత్యవసరమైనవి. అత్యవసరమైన అణు బాంబులను తయారు చేసుకొనడానికి సదుపాయాలన్నీ వుండీ కొందరు నాయకులు రాజకీయాల పేరుతో, పదవీ వ్యామోహంతో, కీర్తిదాహంతో అణ్వాస్త్రాలను తయారు చేయక శత్రుదేశాల దృష్టిలో బలహీనమైనదిగా భారత దేశాన్ని చిత్రిస్తున్నారు" అంటూ భుజంగరావు బాధపడిపోయాడు.

"ఆ గొడవ మనకెందు కంట?" అన్నది దేవకి.

"మనకు కాకపోతే మరెవరికి! మనది ప్రజాస్వామ్యం. కమ్యూనిస్టు రాజ్యాలలో లాగా యంత్రాల్లాటి పౌరులం కాము. ప్రతి వ్యక్తి తన ప్రభుత్వాన్ని తీర్చి దిద్దుకోడానికి హక్కు గల్గి వున్న దేశం మనది. గనక ప్రతిపౌరునికీ బాధ్యత ఉంది" అని చెప్పాడు భుజంగరావు.

# 3

"మిస్టర్ జగదీష్! నువ్వు భుజంగరావు భార్య దేవకితో దొంగ తిరుగుళ్ళు తిరగడం మాకు తెల్సు. దేవకికి నీ వంటె అలవిమాలిన ప్రేమ. ఆమె వద్దనుండి కొన్ని రహస్యాలు తెల్సుకు రావాలి" చెప్పాడొకడు క్రూరంగా. రెండవవాడు జగదీష్ భార్య జలజను బంధించటంలో నిమగ్నమయ్యాడు.

"నా వల్ల కాదు," అన్నాడు జగదీశ్, ఆవేశంగా.

వెంటనే ఢాం, ఢాం అని పిస్తోలు ప్రేలింది. ఒక గుండు జగదీశ్ చెవువద్దనుండి గీ(పెట్టుకుంటూ వెళ్ళింది. మరోగుండు జలజ చీర వచ్చెళ్ళగుండా దూసుకువెళ్ళి గోడకు ఖంగుమని మ్రోగింది. గుడ్డకాలిన వాసన గుప్పున కొట్టింది.

"నీ భార్య బ్రతకాలంటే, నువ్వు జీవించాలంటే చేసి తీరాలి. తెల్సిగా... మేము రాక్షసులం. మేము ఇహపరాలలో వుండే మానవులకో, దేవుళ్ళకో భయపడం. భయం అనేది, ఓటమి అనేది మా జీవితాల్లో మేము ఎరుగం" హుంకరించారు.

వాళ్ళ సాహసానికీ, ధైర్యానికి జగదీశ్ గడగడ లాడి పోయాడు. పిస్తోలు ప్రేల్చడంలో అఖండులని యిట్టే తెలిసి పోయింది. అఱచి గొడవ చేద్దామనుకుంటే పిస్తోలుతో కాల్చేస్తారు. ఒకరికి ఇద్దరు దుండగులు అంబోతుల్లా నిలబడి వున్నారు.

తన బలం వారిముందు కాలిక్రింద చీమలావుంది. ఒప్పుకో వాలి. ఒప్పుకుని తీరాలి. వాళ్ళెవరు? దేవకివద్ద రహస్యా లంటున్నారు. ఏమిటవి? ఎలా తెల్సుకోవాలి? తెల్సుకున్నంత మాత్రాన వాళ్ళు వదిలిపెట్టారన్న నమ్మకం ఏమిటి? ఏమిటీ విషమ పరిస్థితి! దౌర్జన్యంగా తనింట్లో జొరబడి అధికారం చలాయిస్తున్నారు.

జగదీశ్ జీవచ్ఛవంలా నిలబడిపోయాడు.

"చెప్పండి ఏం తెల్సుకోవాలి?" అడిగాడు.

"చెప్తాం. చెప్పడానికి ముందు ఒక విషయం గుర్తుంచుకో. నిన్ను మేము అడిగినట్లు ఎవరికీ చెప్పకూడదు. అలా చెప్పావో ముల్లోకాల్లో ఎక్కడున్నా చిత్రవధ చేస్తాం."

"చెప్పను," అన్నాడు జగదీశ్ భయంగా. వాళ్ళ ఆకారాలు, మాటల దురుసుతనం వింటూంటే జగదీశ్ కు బ్రతుకుతామన్న ఆశ సన్నగిల్లుతూంది.

"అయితే విను. దేవకి భర్త భుజంగరావు ఎస్టేటులో రహస్యంగా న్యూక్లియర్ రియాక్టర్ పైల్ వుంది. అందులో కొన్ని బాంబులను అతి రహస్యంగా, మర్మంగా. భద్రంగా

దాచి వుంచివున్నాడు. వాటిని ఎక్కడ ఏ విధంగా దాచి వున్నది దేవకికి చెప్పివుంటాడు. ఆమె వద్ద ఈ రహస్యాన్ని ఎలాగైనా తెల్సుకుని చెప్పాలి. పొరపాటు జరిగిందా నీ భార్య నీకు దక్కదు. అంతేకాదు నువ్వు దేవకితో కులికిన రాత్రులు, పగళ్లు భుజంగరావుకు తెలియజేయబడతాయి,'' అని ఉరిమారు.

జగదీశ్ గడగడలాడిపోయాడు. బాంబులు అనగానే అతనికి వూపిరి ఆగిపోయింది. మోల్డింగ్ బొమ్మలా మోడు బారిపోయాడు. శరీరమంతా కంపించిపోయింది.

''నాకేదో భయంగా వుందండి,'' నీళ్లు నమిలాడు జగదీశ్.

''ఆ రహస్యం తెల్సుకుని చెప్పావంటే నిన్ను కోటీశ్వరుణ్ణి చేస్తాం. నువ్వు నీ భార్యతో ఏ విదేశానికో వెళ్ళిపోయి హాయిగా బ్రతుకు. ఇప్పుడు కాదన్నావంటే మీరిద్దరూ ఛస్తారు'' అని భయపెట్టారు; ఆశపెట్టారు.

''దేవకికి తెల్సి వుంటుందని నమ్మకం ఏమిటి?'' అడిగాడు జగదీశ్, వాళ్ళకు కాదని చెప్పడానికి గుండెలు చాల్లేదు.

''తెలియకపోతే తెల్సుకొమ్మని చెప్పు.''

''చెప్పకపోతే?''

''నీ ఖర్మ. ఛస్తారు.''

వాళ్లు కిరాతకులు. అన్నంతపనీ చేస్తారు. దైవం తన కెందుకింత క్లిష్ట పరిస్థితులను సృష్టించాడో; వాపోయాడు జగదీశ్.

''చేస్తాను. ప్రయత్నిస్తాను. అంతవరకు నా భార్య గతి?''

''ఆమె సంగతి మేము చూసుకుంటాం. మరో విషయం నువ్వు బయటకు వెళ్లుతున్నావు. పోలీసులకు చెప్ప ప్రయత్నించవచ్చు. గనక నీ భార్యను తీసుకెళ్ళుతున్నాము.

నువ్వు దేవకి యింట్లోనుండి బయటకు రాగానే మా యిద్దరిలో ఎవరో ఒకరు నిన్ను కల్సుకుంటారు. కూడా రావాలి. బాంబులు ఎక్కడున్న సంగతి చెప్పగానే నీ భార్యను, నిన్ను సురక్షితంగా వదిలిపెట్టాం," అన్నారు.

జగదీశ్ కు నవ్వాలో, ఏడ్వాలో అంతుపట్టలేదు. "నా భార్యను ఎక్కడకు తీసుకెళ్ళతారు?" ఆదుర్దాగా ఖంగారుతో ప్రశ్నించాడు జగదీశ్.

"నీకు తెలియని చోటుకి! మమ్మల్ని మోసం చేయ ప్రయత్నిస్తే నీ భార్య శవం కానుకగా యివ్వాలిగా!"

"వద్దు. తెల్సుకుని వస్తాను" భీరువైపోయాడు జగదీశ్.

జగదీశ్ ని ఆ వ్యక్తులు నఖశిఖ పర్యంతమూ గమనించారు. అతను పూర్తిగా భయాందోళనలకు గురయ్యాడని, తప్పక భార్యకోసం చేస్తాడని నమ్మకం కుదిరింది.

"భుజంగరావు ఇపుడు యింట్లో వుండడు. తిన్నగా దేవకివద్ద కెళ్ళి రహస్యాన్ని రాబట్టడానికి ప్రయత్నించు. ఆ సమయంలోనే యింకోపని చేయాలి."

"ఏమిటి?"

"యురేనియం అను లోహం వాళ్ళ యింట్లో వుంది. రెండు భాగాలుగా వుంటుందట! అది కళ్ళబడితే దేవకిని చంపైనా సరే మోసం చేసైనా సరే ఎత్తుకునివచ్చేసెయ్" చెప్పారు.

"దొంగతనం చేయలేను" వేదనతో అన్నాడు జగదీశ్.

"చేయాలి. చేయక తప్పదు. బలవంతంగా మేమే చేయగలం. కానీ, సులువైన మార్గాన్నొదిలి ఆపదలకు గురి కాదలుచుకోలేదు. నీయిష్టం. బాంబులు ఎక్కడున్నది, యురేనియం తీసుకురావలిసిన బాధ్యత నీది. ఆ తరువాత నీ ఖర్మ!"

అప్పటికి చీకటి పడిపోయింది.

ఒకడు జలజను అమాంతం ఎత్తుకున్నాడు. జగదీశ్ బెంబేలు పడిపోయాడు. బావురుమనేశాడు. "వద్దు, వద్దు. నేను తెల్సుకుని వస్తాను," ఆక్రోశిస్తున్నాడు.

"తెలుసుకునివస్తే నీ భార్యను నీకిస్తాం," అంటూ అడ్డొచ్చిన జగదీశ్ ని ఒక్క నెట్టు నెట్టారు. అల్లంత దూరానికి విరుచుకుపడిపోయాడు.

ఒకడు బయట ఎవరైనా వున్నారా, లేరా అని చూడడం, భార్యతో యింకొకడు వెళ్ళిపోవడం స్పష్టంగా గోచరిస్తూ వుంది జగదీశ్ కు.

# 4

ఆ దుండగులు జలజను ఎత్తుకెళ్ళిపోగానే జగదీశ్ తనివి తీరా ఏడ్చుకున్నాడు.

ఆ దుర్మార్గులు చెప్పినట్టు చేసి తన భార్యను తను రక్షించుకు తీరాలి. పట్టుదలతో బయలుదేరాడు జగదీశ్.

ఇంట్లోనుండి బయటకురాగానే బయట ప్రపంచం క్రొత్తగాను, వింతగానూ కనుపించినట్టుంది. లైట్లవెలుగులో తలొంచుకుని చకచక నడుస్తున్నాడు.

భుజంగరావు బాంబులను ఎక్కడ దాచివున్నది దేవకికి తెల్సివుంటుందా? తెల్సినా దేవకి తనతో చెప్తుందా? చెప్పించి తీరాలి. తన భార్యను కాపాడుకోవాలి. ఏవేవో ఆలోచిస్తూ నడుస్తున్నాడు.

భుజంగరావు బాంబులను ఎందుకు తయారుచేశాడు? భద్రంగా ఎందుకు దాచాడు? యురేనియం బాంబులకు ఉపయోగపడే కీలకపదార్థమని తనకు తెల్సు. ఆ యురేనియాన్ని దుండగులు ఏంచేసుకుంటారు? తన చేతికి అది అందుతుందా?

దేవకి యింటిగేటు నెట్టుకుని లోపలకు ప్రవేశించాడు.

"ఎవరూ?" అంటూ నౌఖరు అడిగాడు.

"మీ అమ్మగార్ని చూడాలి. నా పేరు జగదీశ్!"

"ఉండండి. అడిగి వస్తాను," అంటూ నౌఖరు లోనికెళ్ళాడు.

జగదీశ్ గుండెలు గుబగుబలాడుతున్నవి. మనసుని దిటవు పరచుకుంటున్నాడు. ఏదో భీతి, అదురుపాటు కల్గుతున్నవి. సమాళించుకోడానికి సతమత మవుతున్నాడు.

ఆదరా బాదరా వచ్చిన దేవకి జగదీశ్‌ని చూచి, "ఏమిటి యిలా వచ్చావ్!" అని కొంటెగా ప్రశ్నిస్తూ ఆహ్వానించింది.

అప్పుడే స్నానంచేసి నైట్ గౌన్ ధరించివుంది. ఆమె వెంట్రుకలు తడితో వున్న కారణంగా తళతళమంటున్నవి. ఆమె శరీరం ట్యూబ్ లైట్ల వెలుగులో వింతగా మెరుస్తున్నది.

"ఏమీలేదు. ఒక్కసారి మిమ్మల్ని చూచి వెళ్ళదామని వచ్చాను" అన్నాడు జగదీశ్, నసుగుతూ.

"పగలు రావచ్చుగా!"

"ఉండబట్టలేకపోయాను. మీవా రున్నారా?"

"లేరు. ఢిల్లీ వెళ్ళి వున్నారు. రేపుదయం వస్తారు. రండి" అంటూ దేవకి మేడపైకి దారితీసింది. ఇల్లు చాలా అందంగావుంది. అన్నీ ఖరీదుగల వస్తువులు. తనకు దేవకితో అక్రమ సంబంధం వున్నప్పటికీ ఇంటికి ఎప్పుడూ రాలేదు. దేవకి వెనుకనే మెట్లు ఎక్కాడు జగదీశ్.

సరదాగా ఆ కబుర్లు, ఈ కబుర్లు చెప్పుకుంటున్నారు. సమయం,సందర్భం రాగానే,"మీకు రెండు ఎస్టేట్‌లు వున్నవట. మీ వారు ఏం చేస్తుంటారు?" అనడిగాడు జగదీశ్.

"మా వారు చేయవలసినవి అన్నీ చేస్తున్నారు. ప్రపంచంలో దేశానికని ఏ వ్యక్తి చేయని సేవ చేస్తున్నారు."

"అంటే?"

"బాంబులు తయారు చేశారు."

"ఎందుకు?" ఆశ్చర్యాన్ని చూపాడు.

"ఆ విషయం నాకు యిదమిద్ధంగా తెలియదు."

"తయారు చేసిన బాంబులతో ఏం చేస్తారు? బాంబులు భయంకరమైనవి. ప్రమాదకరమైనవి. వాటిని ఎలా భద్ర పరచి వుంటాడు?"

"నిజమే! తగిన రీతిగానే జాగ్రత్త చేసి ఉన్నారు. మా ఎస్టేటులో భూగర్భంలో దాచి వుంచారు."

ఎక్కడ అని అడిగితే సందేహ పడుతుందని జగదీశ్ జాగ్రత్త వహించాడు.

"బాంబులు తయారుచేయటం మాటలుకాదు. బాంబులను తయారుచేసి ఎలా దాచగల్గారు??" అబ్బురంగా అడిగాడు జగదీశ్.

"తయారు చేయడానికి సదుపాయాలన్ని సమకూర్చుకున్న మా వారికి దాచడం పెద్ద పనికాదు. ఎస్టేటులో ఒక రహస్య ప్రదేశంలో నున్న న్యూక్లియర్ రియాక్టర్ షెల్ కు వుత్తరంగా మైలు దూరంలో గల మఱ్ఱి చెట్టువద్ద భూగృహంలో దాచి వున్నారు," అని దేవకి చెప్పేసింది.

కొన్ని రహస్య విషయాలు, చెప్పకూడని విషయాలు సైతము స్త్రీలు తమకు మనసు పడిన పురుషులతో చెప్పడం పరిపాటి. ఆమె చెప్పిన విషయాలను జగదీశ్ అయిదారు తడవలు మననం చేసుకుని మెదడులో దాచుకున్నాడు.

"బాంబులను ఎలా తయారు చేస్తారు?" అమాయకంగా అడిగాడు జగదీశ్.

"యురేనియం మూల కారణ మంటారు. యురేనియం చూస్తావా?" అనడిగింది దేవకి. ఆమెది కల్లాకపటం లేని హృదయం. జగదీశ్ అంటే ఆమెకి ప్రాణం. జగదీశ్ కి తెలియని విషయం చెప్పాలని ఆమె ఉబలాట.

"చూస్తాను" అన్నాడు జగదీశ్.

దేవకి లేచి బీరువా వద్ద కెళ్ళింది.

జగదీశ్ గుండెలు జలదరించి పోతున్నవి. వళ్ళంతా వణికి పోతూంది. తనకి యురేనియం చూపబోతూంది. బాంబులున్న చోటు చెప్పింది. యురేనియాన్ని అపహరించి పారిపోవాలి. భార్యను రక్షించుకోవాలి. మనసుని రాయి చేసుకుంటున్నాడు. దేవకిని ఏం చేస్తే యురేనియం తీసుకెళ్ళ వచ్చో చకచక ఆలోచిస్తున్నాడు.

బీరువాలో నుండి యురేనియం వున్న పెట్టెలను దేవకి తెరచి, జగదీశ్ ని పిలిచింది.

జగదీశ్ కాళ్ళు వణికి పోతున్నై. మనసు దుర్మార్గంతో నిండిపోతూంది. ఒక విధమైన తెగింపుతో బీరువా వద్దకు నడిచాడు.

"ఇదే ఆ యురేనియం. ఈ రెండు యురేనియం ముద్దలను కలిపితే చాలు. ప్రేలిపోతుంది" అని ఏవేవో చెప్పుకు పోతూంది దేవకి.

ఆమె చెప్పే మాటలు జగదీశ్ కు వినబడలేదు. వాటిని ఎలా అపహరించుకు పోవాలో దీక్షగా ఆలోచిస్తున్నాడు.

జగదీశ్ తన ఊపిరిని బిగపట్టాడు. అమాంతంగా దేవకిని జవిరి పట్టుకుని, చేతులు విరుచుకుంటూ లాక్కెళ్ళాడు. ఆ ప్రక్కనే యేవో తీగలు కళ్ళబడగానే అందుకుని దేవకిని మెరుపులా బంధించాడు.

అతని చేష్టలకు దేవకి నిర్విణ్ణురాలై అవాక్కయి పోయింది. అతనిని అయోమయంగా చూస్తూ వుండిపోయింది. జగదీశ్ ఆమె అరవకుండా ఉండడానికి నోటిలో గుడ్డలు కుక్కేశాడు. క్షణం ఆలస్యం చేయలేదు. యురేనియం ఉండలున్న బీరువా వద్దకెళ్ళాడు.

యురేనియం వేరు వేరుగా వుంది. రెండు పెట్టెలలో రెండు

సగాలుగా వుంది. పెట్టెలను తీసుకెళ్ళితే నౌఖర్లు చూచి ఆటకాయించవచ్చు. లేదా అనుమానపడవచ్చు. ఇంటి నుండి బయట పడేంత వరకు జాగ్రత్తగా వుండాలనుకుని జగదీశ్ రెండు పెట్టెలలో వున్న యురేనియపు ఉండలను రెండు చేతులతో పైకి ఎత్తుకున్నాడు. బరువుగా వున్నవి. తన బలాన్నంతా ఉపయోగించి గట్టిగా పట్టుకున్నాడు.

బరువు మూలంగా ఒక్కో చేత్తో ఒక్కో దాన్ని పట్టుకోలేక పోతున్నాడు. రెంటినీ కలిపి రెండు చేతులతో మోసుకెళ్ళాలని పిస్తూంది. అలా మోసుకెళ్ళితే ఎవరైనా చూచి సందేహించవచ్చు. గనక అలా పట్టుకోలేదు. పట్టుకోడానికి అప్రయత్నంగా రెండు చేతులు దగ్గరవుతున్నవి.

దేవకి గుండెలు ఆవిరించి పోతున్నవి. యురేనియం ఉండలు రెండూ కలిస్తే ప్రేలిపోతుంది. ఆ ప్రేలుడికి ఆ నగరమే ధ్వంసమై జీవకోటి అసాంతం తుడిచి పెట్టుకు పోతుంది. కోతి చేతికి పూమాల చిక్కినట్టయింది.

యురేనియం పొరబాటున కలిస్తే ప్రళయం సంభవించుతుంది. ఎందరో మానవులు, ఆ నగరం యావత్తూ భస్మమై పోతుంది. ఎలా? తన మూలంగా వినాశనం సంభవించ పోతూంది. జగదీశ్ ఎందుకలా చేశాడు? దేవకి అల్లకల్లోలంతో గిజగిజ లాడిపోతూంది.

జగదీశ్ ఆదరాబాదరా పిల్లిలా అడుగులు వేస్తూ తిరిగి చూడకుండా పారిపోతున్నాడు. జగదీశ్ అలా పారిపోవడం ఆమెకు బాధ అనిపించలేదు. అతను ఆమెను బంధించినందుకు వేదన పడలేదు. అతని చేతిలో వున్న యురేనియం కలిస్తే కలుగబోవు దారుణ పరిస్థితులు ఆమెను చలింప జేసినై. దేవకికి హిరోషిమా, నాగసాకీల మీద అణుబాంబు ప్రయోగం మూలంగా కల్గిన జన నష్టం, ప్రాణ నష్టం గురించి బాగా తెల్సు.

జగదీశ్ కి యురేనియంతో యేం పని? దానిని గురించి అతనికి తెలుసా? అరవలేని స్థితిలో వున్న దేవకి తన్నుకులాడి పోతూంది.

జగదీశ్ కి అదృష్టం కలిసింది. నౌఖర్లు ఎవరూ యెదురు పడలేదు. వణికే శరీరాన్ని అణుచుకుంటూ గేటు నెట్టుకుని పేవ్ మెంటు మీదకు వచ్చాడు. అతని చేతులలో వున్న యురేనియం తళతళ మంటూ ధగధగా మెరిసి పోతూంది. అంతలో అతని ప్రక్కగా ఒక వ్యక్తి వచ్చి అతనిని కలుసుకున్నాడు.

## 5

"ఈ రోజు రాత్రికి మన పని పూర్తి అయితీరాలి. భుజంగరావు వూళ్లో లేడు. ఎస్టేటు ప్లాన్ చూచి తగిన పథకం వేయాలి. కమాన్!" అంటూ అహమ్మద్ ఖాన్ బల్ల సొరుగు లాగాడు.

అతని అనుచరులైన ఆగాఖాన్, సియాంగ్ లు అతని కెదురుగా ఆసీనులయ్యారు. ఎస్టేట్ ప్లానుని తిలకిస్తూ పథకాన్ని వివరిస్తున్నాడు అహమ్మద్ ఖాన్. ఆగాఖాన్, సియాంగ్ లు అతిజాగరూకతగా వింటున్నారు.

పథకాన్ని యెలా అమలుపరచాలో క్షణాలమీద నిర్ణయమై పోయింది. ముగ్గురూ కార్యశూరులై లేచి నిలబడ్డారు.

"జగదీశ్ ని ఏం చేయాలి?" అడిగాడు సియాంగ్.

"అలాగే మూసిన గదిలో వుండనీ. తిండిలేక చస్తారు" చెప్పాడు అహమ్మద్ ఖాన్.

"ఏదైనా ప్రమాదం సంభవించవచ్చునేమో!" తన సందేహాన్ని వెలిబుచ్చాడు సియాంగ్.

"అవును. కీడెంచి మేలెంచమన్నారు. వాళ్ళకు మన రహస్యాలు కొద్దోగొప్పో తెల్సివుంటాయి. ప్రాణాలతో బయట పడితే మన కేనాటికైనా ముప్పే. గనక చంపేయడం మన

వృత్తి ధర్మం!" అన్నాడు ఆగాఖాన్.

"నీ సందేహం నమ్మదగ్గది. మనం వెళ్ళిపోయేంతవరకు జాగ్రత్తపడాలి. సియాంగ్ గో అన్" అని అహమ్మన్ ఖాన్ ఆజ్ఞ జారీచేశాడు.

వెంటనే సియాంగ్ పిస్తోలుని జేబులోనుండి తీసి పట్టుకుని జగదీశ్, జలజ లున్న గదివైపు నడిచాడు. తలుపుల ముందు నిలబడి మెల్లగా తెఱచాడు. పిస్తోలుని ఎక్కుపెట్టాడు.

'ఢాం'అని వినబడింది. కూడా జలజ చావలుపు ఆ గదిని దద్దరిల్లింప జేసేసింది.

"జలజా"అన్న విషాదమైన కేక, కేకతోబాటు'ఢాం' అని పిస్తోలుమోత మళ్ళీ వినబడింది. వెంటనే జగదీశ్ వెఱ్ఱి కేక వినబడింది. సియాంగ్ కర్కశంగా క్రిందపడిపోయిన దంపతులిద్దరి చేరొక చేతిని పట్టుకుని బడబడ దేహాలను హాలులోకి లాగుకొచ్చాడు. కారే నెత్తురు నేలమీద ధారగా పడి గడ్డకట్టుకు పోతూంది.

"ఈ శవాలను ఏం చేయాలి?" అడిగాడు ఆగాఖాన్.

"ఎక్కడో ఓ చోట పారేయండి."

"పోలీసులు, డిటెక్టివ్‌లు రంగంలోకి వురుకుతారు."

"ఆ లోపు మన పని ముగుస్తుంది. తరువాత ఆ దేవుడూ మనని బంధించలేడు,"అన్నాడు అహమ్మద్ ఖాన్ గర్వంగా.

నెత్తురు మయంతో వున్న జలజ జగదీశ్‌లను చూస్తూంటే భయంకరంగా వుంది. లాగుకొచ్చినపుడు పడిన రక్తపు చారలు భీతిని గొల్పుతున్నవి.

# 6

ఢిల్లీనుండి బయలుదేరిన కారవెల్లి విమానం విమానాశ్రయంలో వురకలుమీద వురకలతో పరుగులతో ఆగింది. ఆగిన విమానంలోనుండి భుజంగరావు దిగాడు.

తన కోసం దేవకి రాలేదని గమనించాడు. కనీసం కారు కూడా రాలేదు. చేసేది లేక టాక్సీని మాట్లాడుకుని ఇంటికి బయలుదేరాడు.

టాక్సీ యింటి గేటుగుండా వెళ్ళి పోర్టికోలో ఆగింది. ఇంట్లోవున్న నౌఖర్లందరూ విషాదంగా నిలబడి వున్నారు. భుజంగరావు కారులోనుండి దిగగానే అందరూ ఏకమ్మడిగా బావురు మన్నారు.

భుజంగరావు వాళ్ళను చూచి అర్థంకాక "ఏమయింది" అనడిగాడు ఖంగారుగా.

"రాత్రి అమ్మగార్ని చూడడానికి జగదీశ్ అనే అతను వచ్చాడు. జగదీశ్‌ని అమ్మగారు మేడపైకి తీసుకెళ్ళారు" అని ఒక నౌఖరన్నాడు.

"ఎవరా జగదీశ్?"

"ఏమో మాకు తెలియదండి. వచ్చిన జగదీశ్ ఎప్పుడు బయటకు వెళ్ళిపోయాడో మాలో ఎవరమూ చూళ్ళేదు."

"ఏం...నిద్రపోతున్నారా?"

"లేదండి. మా పనులమీద మేమున్నాం. ఎంత సేపటికి రాకపోయేసరికి నేనే పైకివెళ్ళి చూద్దునుగదా...అమ్మగార్ని రెక్కలు విరిచి, బంధించివున్నాడు. ఆదరాబాదరా కట్లు విప్పాను" అన్నాడు మంగయ్య నౌఖరు భయంగా.

"ఎవడు వాడు? వాడెందుకు వచ్చాడు? ఎందుకు దేవకిని బంధించాడు?" అని అరిచాడు భుజంగరావు.

"నాకు తెలియదండి. అయితే, అమ్మగార్ని విడిపించగానే ఆదరాబదరా లేచి, పిస్తోలు అందుకుని హడావిడిగా వెళ్లారు. వెళ్ళినవారు ఇంకా తిరిగి రాలేదండీ" అని మంగయ్య జంకుతూ జవాబిచ్చాడు.

భుజంగరావు అదిరిపడ్డాడు. దేవకిని బంధించడం, దేవకి పిస్తోలుతో వెళ్ళడం విచిత్రమనిపించింది. ఏదో అనుమానం

కల్గిందతనికి.

గబగబ మేడపైకి వెళ్లాడు.

యురేనియం వుంచిన బీరువాని తెరిచాడు. ఖాళీపెట్టెలు దర్శన మిచ్చాయి. భుజంగరావుకు గుండెలు జలదరించి పోయాయి. విషయం అర్థమైనట్టయింది.

యురేనియం దొంగలించడానికే ఆ జగదీశ్ ఎవడో వచ్చాడు. వచ్చినవాడ్ని దేవకి మేడపైకి ఎందుకుతోడ్కొని వచ్చింది? వాడెవడు? వాడి కెలా తెల్సింది? తనవద్ద బాంబు లున్న సంగతి దేవకి చెప్పిందా? లేక వాడు తెల్సుకున్నాడా? అంత సులభంగా తెల్సుకోలేరెవరూ...

తనెంతో కట్టుదిట్టాలతో న్యూక్లియర్ చైన్ రియాక్టర్ షెల్ ని నిర్మించి వున్నాడు. దేశీయులకేగాక, విదేశీయులకు ఎవరికీ తెలియకుండా అతిజాగ్రత్త వహించివున్నాడు. ఎలా తెల్సి వుంటుంది?

యురేనియాన్ని దొంగిలించి ఉన్నట్టయితే విషయాలన్నీ తెల్సినవారై వుంటారు. ఎవరు వాళ్ళు? విదేశ కుట్రదారులా? శత్రుదేశ గూఢచారులా?

యురేనియాన్ని తెలుసుకున్న శత్రువులు తనవద్ద వున్న బాంబులను గురించి తెల్సుకునికూడా వుంటారు?

ఆదరాబాదరా భుజంగరావు పిస్తోలుని లోడ్ చేసుకుని గబగబా మెట్లుదిగాడు.

అంతలోనే ఎస్టేటులో పనిచేయువారు చాలామంది వచ్చి ఉన్నారు.

"ఏమిటి?" అడిగాడు భుజంగరావు.

"మన ఎస్టేటులో పెద్ద ప్రేలుడు సంభవించింది" చెప్పారెవరో.

"ఎక్కడ? ఎందుకు?" భుజంగరావు గుండెలు దడదడ లాడిపోయాయి. వళ్ళంతా వణుకు పుట్టిపోయింది. కొంపదీసి

తను దాచిన బాంబులు ప్రేలాయా? తను దాచిన బాంబులు ప్రేలివుంటే ఈ పాటికి నగరమేగాకుండా దక్షిణ భారత దేశమే సర్వనాశనమై, దగ్ధమై, మసైపోయి వుండాలి.

అలా జరగలేదు. మరయితే ప్రేలిందేమిటి? తను దాచిన బాంబులు సురక్షితంగా వున్నాయి? యురేనియం తెలియని మూఢులెవరైనా కలిపితే నగరమే నాశనమవుతుంది? ఏమిటీ అయోమయం?! మనసు అల్లకల్లోలిత మవుతూంది. వళ్ళంతా చెమట పట్టిపోతున్నది. అవాక్కయి నిలబడి పోయాడు భుజంగరావు.

భుజంగరావు కారు ఎస్టేటు వైపు విద్యుత్ ప్రవాహంలా పయనిస్తూంది. కాసేపటికల్లా కారు ఎస్టేటు చేరుకుంది. న్యూక్లియర్ చెయిన్ రియాక్టర్ ఫైల్ వున్న రహస్య ప్రదేశం వైపు కారు మళ్ళింది. పొగలు, ఏదో వాసన వేస్తూన్నది. భుజంగరావు గుండె వేగంగా కొట్టుకుంటున్నది.

న్యూక్లియర్ రియాక్టర్ దగ్గరయింది. ఆశ్చర్యం!

ప్రేలిపోయివుంది! అక్కడ ఆకారమే గోచరించలేదు. ధ్వంసమైపోయి వున్నది. కట్టడం పూర్తిగా నేలమట్టమై పోయివుంది. చెల్లాచెదురుగా ఇటుకలు పడివున్నవి.

న్యూక్లియర్ రియాక్టర్ ఫైల్‌ని ఎవరో ప్రేల్చేశారు. ఎవరు? ఎందుకు? ఇక్కడున్నట్టు ఎవరు పసిగట్టారు? భుజంగరావు నీరుకారిపోయాడు.

ఆదరా బాదరా కారెక్కాడు. మర్రిచెట్టువైపు పోనిచ్చాడు. నిముషంలో చేరాడు. ఆశ్చర్యం!—

అక్కడా భూగృహం నాశనమైపోయింది. భూగృహం ప్రేల్చివేయబడి వుంది. అయితే అందులో వుండిన బాంబులు ఏమయినవి? భూగృహాన్ని ప్రేల్చివున్నారు. అలా ప్రేల్చినప్పుడు అందులో భద్రపరచబడిన బాంబులు ప్రేలి వుండాలి. అలా ప్రేలివుంటే సౌత్ ఇండియానే

పూర్తిగా ఈ పాటికి నామరూపాలు లేకుండా పోయి వుండేది. అలా జరగలేదు. అయితే అందులోని బాంబులు ఏమైనాయి?

భయం,ఖంగారు,ఆందోళన,ఆదుర్దా ఏకమ్మొడిగా భుజంగ రావును పీక్కు తీసేశాయి. గడగడలాడి పోయాడు. ఇక్కడ భూగృహం వున్నట్టు ఎవరు తెల్సుకున్నారు? ఎలా పేల్చారు? ఎందుకు పేల్చారు? బాంబులను దొంగిలించుకు పోయారా? అందులో వుండిన బాంబులను దొంగిలించాలంటే సామాన్యమైన విషయం కాదు.

భుజంగరావు వుండబట్టలేక ధ్వంసమై పోయివున్న భూగృహంలో క్రిందా మీద పడుతూ వెదికాడు. బాంబులేవు.

భుజంగరావు వెఱ్ఱి మొఱ్ఱిగా కేకలు పెట్టేశాడు. నోటిలో తడారి పోయింది. ఆ బాంబులు యెంతటి విధ్వంసన శక్తి గలవో తలచుకుంటూంటే భుజంగరావులోని ఆందోళన ద్విగుణీకృత మవుతూంది.

దేవకి ఏమయి వుంటుంది?యురేనియం దొంగిలించిన వారిని అనుసరించి వెళ్ళిందా? అయితే దొంగిలించిన వారు దుర్మార్గులై వుంటారు. దేవకి యెటు వెళ్ళిందో తను తెల్సుకోవాలి. తీవ్రంగా ఆలోచించాడు భుజంగరావు. ఏమీ అంతుపట్ట లేదు. తల తిరిగిపోతూంది.

అయోమయంగా కారెక్కాడు. బయలుదేరాడు. విసుగు పుట్టే వరకు నగరమంతా గాలించాడు.

దేవకి జాడ తెలియలేదు. పబ్లిక్ ఫోన్ బూతులలో నుండి యింటికి ఫోన్ చేసి దేవకి వచ్చిందా అని గంటగంటకూ అడుగుతూ తిరిగాడు. ఇంటివద్ద నుండి రాలేదని జవాబు వచ్చేది. దేవకి కోసం, బాంబులను దొంగిలించిన వారికోసం, యురేనియం దొంగిలించిన వారికోసం ఎంత వెదికినా తను

తెల్సుకోలేడని ధృవపడి పోయింది. ఏమీ పాలుపోలేదు.

పోలీసుల సహాయం అర్థించాలనుకున్నాడు. ఎందుకనో అతనికి మనస్కరించలేదు. ప్రభుత్వాన్ని వ్యతిరేకించి తను బాంబులను తయారు చేశాడు. అణుశక్తిని వినాశనానికి ఉపయోగార్థం తయారుచేశాడు తను. పైగా మన భారత దేశం అణ్వస్త్రాల ఉత్పత్తిని నిరోధించి వుంది.

ఇండియా అణ్వస్త్ర సమన్విత దేశం కావాలని ప్రగాఢంగా వాంఛించు వారిలో తనూ ఒకడు. అందుకే బాంబులు తయారు చేశాడు. తయారు చేసిన బాంబులు అపహరించబడ్డాయని రిపోర్టిస్తే ప్రభుత్వం ఏమంటుంది? పోలీసులు ఏమంటారు? తనకు సహకరిస్తారా? బాంబులను తెల్సుకోడానికి ప్రయత్నిస్తారా? భుజంగరావు అనుమానంతో తల్ల క్రిందు లయాడు.

అలా తిరిగే భుజంగరావుకు ఒకచోట ఒక బోర్డు కళ్ళబడింది. చూశాడు.

"డిటెక్టివ్ యువరాజ్, ప్రయివేట్" అని వుంది.

భుజంగరావులో యేదో ఆశ చెలరేగింది. ధైర్యం కల్గింది. కారుని అటు పోనిచ్చాడు.

# 7

పోలీసులు అప్పుడే జగదీశ్‌ని స్ట్రెచ్చర్ మీద తీసుకొచ్చి అంబులెన్స్ వాన్‌లోకి యెక్కించ బోతున్నారు. అతని ప్రాణాలు పోలేదు. కొనవూపిరితో వున్నాడు. డిటెక్టివ్ యువరాజ్ సిత్రన్ కారు ఆగడం గమనించి ఇన్‌స్పెక్టర్ ధనార్జనరావు ఆపాడు.

భుజంగరావు, యువరాజ్, నూరీలు ఆదరాబాదరా దిగివచ్చి జగదీశ్‌ని చూచారు. చూచిన తరువాత వాన్ లోపలకు ఎక్కించారు.

"ఇతనిని నే నెప్పుడూ చూచినది లేదు" చెప్పాడు భుజంగరావు.

"ఈయ నెవరు?" అడిగాడు ధనార్జనరావు.

యువరాజ్ లోపలకు దారితీస్తూ, టూకీగా భుజంగరావును గురించి చెప్పాడు. అలాగే దేవకిని గురించి కూడా చెప్పాడు.

లోపల జలజ శవం అతిదారుణంగా పడివుంది. రక్తపు చారలు భీకరంగా గోచరిస్తున్నవి. గదిలోనుండి ఈడ్చుకొచ్చినట్లు నెత్తురు చారలు స్పష్టపరుస్తున్నవి. జలజ హృదయ భాగమంతా ఎఱ్ఱగా ముద్దగా వుంది.

"మీకు యీ విషయమై ఫోన్ యెవరు చేశారు?" అడిగాడు యువరాజ్.

"ఎవరో ఆడ మనిషి."

"కొంపదీసి నా భార్య దేవకి కాదుకదా!?" అడిగాడు భుజంగరావు.

"ఏమో యెలా చెప్పగలం? దేవకి అనుసరిస్తూ వచ్చి ఈ దారుణాన్ని చూచిన పిదప పోలీసులకు తెలియజేయు సమయంలో శత్రువులకు చిక్కుపడి ఉండొచ్చు. లేదా ఆమె యెందుకనో భయపడి పోలీసులకు చెప్పి యిక్కడ నుండి తప్పుకుని వుండి ఉండొచ్చు," చెప్పాడు యువరాజ్.

"అయితే నా దేవకి యింటికి వచ్చి ఉంటుందా?"

"ఏమో? ఫోన్ చేసి కనుక్కొండి" అని చెప్పి యువరాజ్ ఆ యింటి నంతటిని గాలించడం ప్రారంభించాడు. అప్పటికే పోలీసులచే ఆ యిల్లు సోదా చేయబడి ఉంది. కాని యువరాజ్‌తో నూరి, ధనార్జనరావులు కూడా పరిశీలించడం ప్రారంభించారు.

"మిస్టర్ ధనార్జనరావ్! ఈ కేసు అతి భయంకరంగా ఉంది. బాంబులు దొంగిలించబడ్డాయి. కాక యురేనియం

దొంగిలించ బడివుంది. యురేనియం మూలంగా మన యీ నగరానికి వినాశనం సంభవించు ప్రమాదముంది. మనమిపుడు ప్రాణాలతో ఉన్నాం. అణుబాంబు ప్రేలడానికి సెకండులో మిలియనో వంతు కాలం చాలు. అంటే బాంబు ప్రేలింది, ప్రమాదం సంభవించింది, అందరమూ మరణిస్తున్నాం అని గ్రహించే లోపు నిహతులై పోతాం. గనక మీరు మీ సిబ్బందిని వెంటనే మేల్కొల్పాలి,'' చెప్పాడు యువరాజ్.

''ప్రపంచమే శాంతి, శాంతి, శాంతి అని ఘోషిస్తూంది. ఈ భుజంగరావు దేనికి బాంబులను తయారుచేశాడు?'' విసుక్కున్నాడు ధనార్జనరావు.

''ఫ్రాన్సులో తయారయే యుద్ధసామగ్రి తప్పనిసరి ఇతర దేశాలకు అమ్మితీరాలి. లేకుంటే యుద్ధపరికరాలను ఉత్పత్తి చేయు రెండున్నర లక్షల మందికి నిరుద్యోగం సంప్రాప్తమవుతుంది. ఇలా వుంటె శాంతి, శాంతి అని ఎవరెంత ఘోషించినా నిష్ఫలం. ఫ్రాన్స్ ఒకటే కాదు, స్తోమతగల దేశాలన్నీ యిపుడు అణ్వాస్త్రాలు తయారు చేసుకోవడమే గాక నవీన యుద్ధస్సామగ్రిని వుత్పత్తి గావించుకుంటున్నవి'' చెప్పాడు యువరాజ్.

''మీరు చెప్పేది పులినిచూచి నక్క వాతపెట్టుకోవాలనా?'' హేళనగా అన్నాడు ధనార్జనరావు.

''అవసరమైతే వాతలు పెట్టుకుని పులిలా కనబడడానికి ప్రయత్నించాలి. లేనిచో నక్కే అనుకుని కబళించడానికి రాజ్య విస్తరణ కాంక్షగల కర్కోటకులు మీదపడతారు,'' హెచ్చరించాడు యువరాజ్.

సూరి ఒక అలమారను తెరచాడు. అందులో ఒక డైరీ కనిపించింది. దానిని అందుకున్నాడు.

యువరాజ్ ఆ డైరీని ఆత్రుతగా తిరగవేశాడు. అది

న్యూక్లియర్ సైంటిస్టు అయిన బ్రాంట్ ది!! డైరీలో తయారుచేసిన బాంబుల వివరాలున్నవి. యురేనియం గురించి, భుజంగరావును గురించి వ్రాయబడి వుంది.

"ఈ బ్రాంట్ ఎవరు?" అడిగాడు యువరాజ్ భుజంగరావుని.

"బ్రాంట్ ఛీఫ్ సైంటిస్ట్, అండ్ ఇంజనీయర్!"

"బ్రాంట్ తన డైరీని ఎక్కడో జారవిడుచుకునివున్నాడు. డైరీ శత్రువుల చేతులలో దురదృష్టవశాత్తు పడివుండాలి. శత్రువులు బాంబులను అపహరించారు. మిస్టర్ ధనార్జనరావ్! మీరు వెంటనే ఈ చుట్టుప్రక్కలనుండి వాకబు చేయడం ప్రారంభించండి. ఈ ఇల్లెవరిది? ఎవరుండినారు? రాత్రి ఇక్కడేం జరిగింది? ఆరాతీయండి" చెప్పుకుపోయాడు యువరాజ్.

భుజంగరావు న్యూక్లియర్ చెయిన్ రియాక్టర్ పైలుని భూగృహాన్ని చూపించాడు. యువరాజ్ సునిశితంగా చూశాడు.

అన్నీ ప్రేలిపోయి నామరూపాలు లేకుండా వున్నై. చుట్టుప్రక్కల ప్రదేశాలను దీక్షగా పరిశీలించాడు యువరాజ్.

గుట్టలు, మిట్టపల్లాలు, చెట్లు, చేమలు పొదలు ఆ ప్రదేశమంతా దట్టంగా వుంది. మనిషి నడవడానికి కష్టతరమైనదిగా గోచరిస్తూంది. అటువంటి చోటుగుండా బాంబులను శత్రువులు ఎలా తీసుకెళ్ళి వుంటారు?

"మిస్టర్ భుజంగరావ్, మోటారు వాహనంమీద బాంబులను తరలించివుంటే మనం వచ్చిన రోడ్డుమీదుగానే జరిగి వుండాలి. అలా జరిగివుంటే ఎస్టేటులో పనిచేయువారు తప్పక చూచివుండాలి. మీరు అడిగిచూచారా?" అడిగాడు యువరాజ్.

"లేదు. ఈ ఖంగారులో అడగలేదు."

"సూరీ! నీవెళ్ళి తెల్సుకురా" చెప్పి పంపాడు.

సూరి అక్కడనుండి కదిలాడు.

భూగృహం వున్న స్థలం అతి మర్మంగా వుంది. అక్కడ నుండి రోడ్డు దారి సరీగా లేదు. బాంబులు అతి జాగ్రత్తగా తీసుకెళ్ళవలసిన పని.

యువరాజుకు ఏమీ అంతుపట్టక దగ్గర్లోవున్న మర్రి చెట్టును ఎక్కి బైనాక్యులర్ పెట్టుకుని చూశాడు. చాలా చాలా దూరంలో గీతగీచినట్టు సముద్రం కనబడుతోంది. యువరాజ్ మనసు వురకలు వేసింది. ఆదరా బాదరా చెట్టు దిగాడు.

"భుజంగరావుగారూ! శత్రువులు బాంబులను హెలికాప్టర్ సాయంతో తీసుకెళ్ళి వుండాలని అనుమానిస్తున్నాను" చెప్పాడు యువరాజ్.

"హెలికాప్టర్‌తోనా...! ఎలా సాధ్యం?" ఆశ్చర్యపోతూ అడిగాడు భుజంగరావు.

"మీ ఎస్టేటుకి దగ్గర్లో సముద్రముంది. బాంబులుండిన భూగృహం తెలియగానే కాపలా లేని కారణంగా దొంగిలించడం తేలిక. అసలు మీరు కాపలా మనుషులను ఎందుకు నియమించలేదు?"

"కాపలా వుంచితే అనుమానం కల్గుతుంది గనక."

ఇంతలో సూరి చేరుకుంటూ, "సార్, ఇటువైపు ఎటువంటి మోటారు వాహనమూ వెళ్ళలేదు. అయితే ఈ ఎస్టేటు పైభాగంలో విమానాల మోత వినబడిందని సాక్ష్యాలు లభించాయి" చెప్పాడు.

"నా అనుమానం ధృవపడింది. శత్రువులు హెలికాప్టర్ వుపయోగించివున్నారు" అని యువరాజ్ ఆలోచిస్తూ వుండిపోయాడు.

ముగ్గురూ వెళ్ళి కారెక్కారు. కారు బయలుదేరింది.

భుజంగరావు కారులో వున్నంతసేపూ దేవకిని, యురేనియాన్ని-బాంబులను కలవరిస్తూనే వున్నాడు. భుజంగరావుకు ధైర్యంచెప్పి, యింటివద్ద దింపి, యువరాజ్ సూరీలు తమ యింటికి బయలుదేరారు.

నగరం యావత్తూ పోలీసుల హడావిడితో నిండివుంది. పోలీసులకు దేవకి ఆచూకీ తెల్సివుంటుందా? దేవకి ఏమై వుంటుంది?

ఇంతలో స్టేట్రన్ ఇంటి ఆవరణలోకి మళ్ళింది.

డిటెక్టివ్ లిద్దరూ దిగి లోపలకు అడుగుపెట్టారు.

నౌఖరు ఎదురై ఏదో చెప్పడానికి నోరు తెరిచాడు. అదే సమయానికి టెలిఫోన్ మోగింది.

యువరాజ్ ఫోన్ వద్దకు నడిచాడు. రిసీవరందుకుని, "హలో" అన్నాడు.

"ధనార్జనరావుని మాట్లాడుతూంట. మాబలగం నగరాన్ని యావత్తూ తీవ్రంగా గాలిస్తూంది. అనుమానాస్పదమైన సమాచారం యింకా అందలేదు. హఠాత్తుగా నగరాన్ని పూర్తిగా వెదకడంలో సాధక బాధకాలు చాలా యెదురైయ్యాయి. దూషణలను, భూషణలను సమాళించుకుంటూ వెదుకుతున్నాం. ప్రతి వ్యక్తినీ, ప్రతి యింటినీ చెక్ చేయుటం ఏ డిపార్టుమెంటుకైనా కష్టతరమైన పని. నవీన పరికరాలతో ప్రారంభించాము. ఫలితం యెలా వుంటుందో చెప్పలేను."

"ప్రస్తుత పరిస్థితులు అటువంటివి. చేయగలిగినది, చేయవల్సినది గనక చేసితీరాలి," అన్నాడు యువరాజ్.

"ఏమో? నాకు సందేహంగానే వుంది. యురేనియంను దాచడం చేతకాని వారు దొంగిలించి వుండరు."

"నిరుత్సాహ పడకండి" చెప్తూ యువరాజ్ రిసీవర్ పెడుతూ నౌకరు వంక చూశాడు.

"మీ కోసం ఒకావిడ వచ్చింది. మీరు వచ్చేంత వరకు ఇక్కడే ఉంటాననన్నది," అన్నాడు నౌకరు.

యువరాజ్ కు ఆశ్చర్యమేసింది. "ఎక్కడుంది?" అడిగాడు. నౌకరు పిలుచుకు వచ్చాడు.

ఆమె దేవకి! యువరాజ్ సూరీలకు ఆశ్చర్యానికి అంతు లేకుండా పోయింది.

"ఏమిటమ్మా యిది, మీ కోసం పోలీసులు, మీ భర్త ఆందోళన చెందిపోయి వెదుకుతున్నారు. నా వద్దకు ఎందుకు వచ్చారు? మీరు అనుసరించిన దుండగులు ఎవరు? ఎక్కడుంటున్నారు?" అడిగాడు యువరాజ్ కూర్చుంటూ.

దేవకి యెటువంటి అరమరికలు లేకుండా. తు. చ. తప్పకుండా తనకు జగదీశ్ కు అక్రమ సంబంధం ఉండటం దగ్గరనుండి చెప్పడం ప్రారంభించింది.

సూరి అతి జాగ్రత్తగా ఆమె చెప్పే విషయాలను నోట్ చేసుకుంటూన్నాడు.

"అంటే మీరు ఆ శత్రువులను అసలు చూశ్ళేదా?"

"లేదు. కేవలం వాళ్ళ కారుని అనుసరిస్తూ వెళ్ళాను. ఆ ఇంట్లోకి వెళ్ళటానికి ధైర్యం చాలలేదు. పిస్తోలు చప్పుడు విని పోలీసులకు ఫోన్ చేశాను."

"మరి నా వద్దకు యెందు కొచ్చారు?"

"క్షణికోద్రేకానికి లోనై ఒక అమాయకురాల్ని బలి యిచ్చాను. జగదీశ్ కొనవూపిరితో వున్నాడు. యురేనియం అపహరించ బడింది. మీ వద్దకు మా వారు వచ్చారు. మీరంతా జగదీశ్ ని చూడడం నేను గమనిస్తూనే వున్నాను. మీరు ప్రయివేట్ డిటెక్టివ్ లు. జరిగిన విషయాలు మీతో చెప్పి, ఆ దుర్మార్గులను చీల్చి చండాడాలని అనుకున్నాను" పౌరుషంగా అన్నది దేవకి.

"మీరు జగదీశ్ తో కలవడం భుజంగరావుకు తెల్సా?"

"తెలియదు."

"ఇపుడు తెలిస్తే...!"

దేవకి అంతవరకు కోపంతోను, ఆవేశంతోనూ వున్నదల్లా బావురుమని యేడ్వడం ప్రారంభించింది.

"ఏడ్వకండి. ఏడ్వడం దేనికి?" లాలనగా అన్నాడు యువరాజ్.

"మా ఆయన దైవసమానులు.ఆయనకు ద్రోహం చేశాను. నాలోని వుద్రేకాలను, ఆవేశాలను అణచుకోలేని నీచురాల్ని. నాకీ జన్మలో ప్రాయశ్చిత్తంలేదు," ఏడుస్తూంది దేవకి.

కొన్ని సందర్భాలలో చెడుకున్నంత బలం మంచికుండదు. వివేకం మేల్కొన్న తరవాత తెలుచుకుంటే ఆ బాధ, నరక యాతన చెప్పనలవి కానిది. "చూడమ్మా... దుఃఖించి లాభంలేదు. భుజంగరావు మీరు ఏమయ్యారోనని ఆందోళన చెందుతున్నాడు. వెళ్ళి ఆయనకు కనబడండి," చెప్పాడు యువరాజ్.

"నేనెలా ఆయన ముఖం చూడడం! నా మూలంగా యురేనియం దొంగిలించబడింది."

"యురేనియమే కాదు. బాంబులూ దొంగిలించబడ్డాయి," చెప్పాడు యువరాజ్.

"బాంబులు కూడానా!?" అదిరిపోయింది దేవకి.

"అవును. మీరు బాంబులున్న ప్రదేశం జగదీశ్ కు చెప్పారా?"

"చెప్పాను."

యువరాజ్ కు 'కథ' బోధపడిపోయింది.

"ఇక చింతించి లాభం లేదు. శత్రువుల అదృష్టం మూలంగా, మన దురదృష్టం మూలంగా బాంబులు దుండగులు చేత పడ్డాయి. జరగవల్సిన కార్యక్రమం ఆలోచిం

చాలి. మీ వారికి ఫోన్ చేయనా?'' అంటూ రిసీవర్ అందుకోబోయాడు యువరాజ్.

ఆ టెలిఫోన్ గణగణ మ్రోగింది.

రిసీవరందుకుని హాలో అన్నాడు.

"ఎవరూ?'' అని వినబడింది. యువరాజ్ కు ఆశ్చర్యమేసింది. తనింటికి ఫోన్ చేసి ఎవరూ అని అడగటం ఏమిటి?

"యువరాజ్ ని.''

"మిస్టర్ యువరాజ్! భుజంగరావు యింటిలో దొంగిలించబడిన యురేనియం మావద్ద వున్నది,'' అని అన్నాడు ఆ వ్యక్తి.

యువరాజ్ అదిరిపడ్డాడు. గుండెలు గడగడ లాడేయి. సూరికి సైగ చేశాడు. సూరి ఎక్స్ టెన్షన్ ఫోన్ వద్దకు పరుగెట్టాడు. దేవకి అయోమయంగా డిటెక్టివ్ లిద్దరినీ చూస్తూ నిలబడింది.

"నువ్వెవరివి! యురేనియం నీవద్ద వుందని చెప్పడం విచిత్రంగా వుంది,'' అన్నాడు యువరాజ్

"నే నెవరయింది విపులంగా చెప్పడానికి ఇపుడు తీరిక లేదు. పోలీసులు యురేనియం ఉన్న యింటిని సమీపిస్తున్నారు. పోలీసులు వచ్చారా... ఈ నగరం నాశనం చేసేస్తాను. నేను చచ్చినా మా దేశం కోసం అని తృప్తిపడ్తాను.''

యువరాజ్ కి ఏమీ అంతు పట్టలేదు.

"సంగతేమిటి?'' అడిగాడు యువరాజ్ తనలో ఆందోళన వున్నా అణచుకుంటూ.

"నగరంలో వెదుకుతూ వస్తున్న పోలీసుల వద్ద నవీన పరికరాలున్నవి. సాధనాలూ వున్నవి. అవి యురేనియాన్ని ఇట్టే పసిగట్టి చూపగలవు. యురేనియం వున్న విషయం తెలిస్తే మమ్ములను సజీవంగానో, అజీవంగానో పోలీసులు బంధించగలరు. మేము పోలీసులకు చిక్క దలచుకోలేదు.''

"అయితే పారిపోండి," చెప్పాడు యువరాజ్.

"పారిపోవడానికి వ్యవధి మించి పోయింది. యురేని యంతో వెళ్ళితే పోలీసులు అటకాయిస్తారు. యురేనియం వదలి వెళ్ళితే ఆ యింట్లో వుండినది మేమని పోలీసులు పసి కట్టి మమ్ములను బంధించ గలరు," చెప్పాడు అహమ్మద్ ఖాన్.

"అందుకని నేనేం చేయాలి?"

"మీకు ప్రభుత్వ వ్యక్తుల మధ్య పలుకుబడి ఉందని, మీ మాట శిరసావహిస్తారని మాకు తెల్సు. మేము అన్నిటికి తెగించిన వారం. దొంగిలించిన బాంబులు చేరవల్సిన చోటికి చేరినవి. మా పని నెరవేరింది. కాని యురేనియాన్ని దొంగి లించి తరలించుకు పోవాలని అనుకున్నాం. సాధ్యపడలేదు. యురేనియానికి గల శక్తి మీకు తెలియంది కాదు. క్షణంలో ఈ నగరాన్ని ధ్వంసం చేయగలం. ఎందరో అమాయకులు, పసిపిల్లలు, నిలువునా భస్మమై పోతారు. ఆ ప్రమాదం మీ నగరానికి కలగకూడదనుకుంటే మీరు మమ్ములను పోలీ సుల బారినుండి తప్పించాలి," అన్నాడు అహమ్మద్ ఖాన్.

యువరాజ్ కు మతి పోయినట్టయింది. శత్రువులు అన్నంత పనీ చేస్తారని యువరాజ్ కు తెల్సు. దేశభక్తి మెండుగా గల వ్యక్తులే గూఢచారి వృత్తిలోనూ, తదితర కార్యకలా పాలలో ప్రవేశిస్తారని జ్ఞప్తికి వచ్చింది. పోలీసులు దగ్గరయితే బందీలు కావడానికి శత్రువులు యిష్టపడని కారణంగా అసూయా ద్వేషాల మూలంగా రాక్షస మనస్కులై యురే నియం సహాయంతో నగరాన్ని నాశనం చేయ బూను కుంటారు.

ఇపుడెలా? తను శత్రువులను ఆపగలడా? గుండెలు జలదరించి పోయినై. నోటిలో తడారిపోయింది.

"నేను కేవలం ప్రయివేట్ డిటెక్టివ్ ని. అంత మాత్రాన

అంతటి ప్రమాదకరమైన యురేనియం శత్రువుల వద్ద వున్న దని తెల్సీ చెప్పకపోతే ప్రభుత్వ దృష్టిలోనే గాక మన స్వాక్షి ముందూ ఘోర నేరస్థుణ్ణవుతాను. అసలు యింతకీ మిమ్మల్ని నేనెలా తప్పించగలను?" అడిగాడు యువ రాజ్.

"మీరు యిక్కడకు మీ సూరితో సహా వస్తే చెప్ప గలను. ఒక హెచ్చరిక. ఈ యిల్లున్న వీధిలో పోలీసుల బందోబస్తు పెరిగింది. ఏ మనిషీ ఏ యింట్లోగానీ, బయటకు గానీ వచ్చినా, వెళ్ళినా 'లైడిటెక్టర్ల' ముందు నిలబెట్టి పోలీ సులు ప్రశ్నిస్తున్నారు. గనక మేము బయటకు వెళ్ళితే లై డిటెక్టర్స్ వెంటనే పట్టివ్వగలవు. అందుకని మేము బయటకు వెళ్ళదలుచుకోలేదు."

"ఇక సెర్చివారెట్లంతో యింట్లో ప్రవేశించి ప్రత్యేక సాధనాలతో పరిశోధించబోవు పోలీసులను ఆపలేము. వారు ప్రవేశించడానికి ఇంక అరగంట కాల వ్యవధి వుందని తెలుస్తున్నాను. ఈలోగా మీరు మీ సూరితో ఈ యిల్లు చేరుకోవాలి. లేదా సరిగ్గా పన్నెండున్నరకో, లేక పోలీసులు మా గుమ్మం ముందు అడుగు పెట్టగానే నగరంలో అణు బాంబు ప్రేలుతుంది. చెప్పినది చేయడానికి, విపత్కర సమయాల్లో యెటువంటి ఘాతుకం చేయడానికి వెనుకాడని మనుషులం. మా యింటి అడ్రసు లాలా బజార్, నెంబరు ముప్పై!!"

అంటూ అహమ్మద్ ఖాన్ రిసీవర్ పెట్టేశాడు.

యువరాజ్ శిలాప్రతిమలా నిలబడి వుండిపోయాడు.

## 8

"వెల్ కమ్ మిస్టర్ యువరాజ్! మీరు వస్తారని మాకు తెల్సు. రాకుంటే జరుగబోవు పరిణామం అతిభయంకర

మైనదని మీకూ తెల్సు. ఏ పౌరుడూ తమ దేశీయులను అన్యాయంగా బలి యివ్వడానికి ఒప్పుకోడు,'' అంటూ అహమ్మద్ ఖాన్ డిటెక్టివ్ యువరాజ్, సూరీలను ఆహ్వానించాడు.

డిటెక్టివ్ లిద్దరూ లోపలకు ప్రవేశించారు. వెంటనే సియాంగ్, ఆగాఖాన్ లు తమ పిస్తోళ్ళను గురిపెట్టి తయారుగా వున్నారు. టిక్కా ఖాన్ యురేనియాన్ని కలపడానికి సిద్ధంగా నిలబడి ఉన్నాడు. అక్కడి పరిస్థితులు చూచిన డిటెక్టివ్ లిద్దరూ గడగడ లాడిపోయారు.

''ఏమిటీ పాశవిక చర్య??'' అడిగాడు యువరాజ్.

''కాదు. పాశవికం కాదు. నేర్పు, నైపుణ్యం, అణుబాంబులు తయారు చేయడం పెద్దపెద్దదేశాలకే సాధ్యపడడంలేదు. ప్రయివేటుగా కేవలం ఒక వ్యక్తి తన ఆధ్వర్యంలో అణ్వస్త్రాలు ఉత్పత్తి చేయడం ప్రపంచ చరిత్రలో అపూర్వం. ఆ అణ్వస్త్రాలను ప్రభుత్వానికి అప్పగించడం ఆశ్చర్యకరమైన విషయం. ఈ విషయం తెల్సుకుని అపహరించడంలో తప్పులేదు. కొన్ని అవాంతరాల మూలంగా మీ వరకు వెంటనే తెల్సింది. పోలీసులు చక్రబంధం వేశారు. చిక్కుపడడం ఖాయం. ఆ చిక్కుల్లో పడకుండా బుద్ధిబలాన్ని ఉపయోగించి తప్పించుకొనుటకు ప్రయత్నించడం వివేకుల లక్షణం!''

చెప్పాడు అహమ్మద్ ఖాన్ తలుపులు మూసి.

''నన్ను అడ్డంపెట్టి మీరు తప్పించుకోలేరు'' అన్నాడు యువరాజ్.

''తప్పించుకోలేకపోతే మీరు,మీ ప్రజలు అనుభవిస్తారు. యురేనియం గురించి మీకు బాగా తెల్సు,'' అన్నాడు అహమ్మద్ ఖాన్.

వాళ్ళను చూస్తుంటే అన్నంత పనీ చేస్తారని భయంగా

వుంది. టిక్కా ఖాన్ చేతులలో వున్న యురేనియాన్ని చూస్తూంటే హిరోషిమా, నాగసాకీలు గుర్తుకు వస్తున్నవి. హిరోషిమా, నాగసాకీలలో హతులైన అమాయకులు, పిల్లలు కళ్ళముందు మెదిలారు.

"ఎలా తప్పించుకుంటారు? నేనేం చేయాలి?" అడిగాడు యువరాజ్,

యువరాజ్ యెన్నో విపత్కర పరిస్థితులను ఎదుర్కొని వున్నాడు. కొన్ని లక్షల మంది ప్రాణాలు కాపాడ బడా లంటే ఆ సమయంలో వారు చెప్పినట్లు నడుచుకుని తీరాలి. తనకున్న బుద్ధిబలంతోను, వివేకంతోను అక్కడి ఆ పరిస్థితు లలో వారిని బంధించడం దుస్సాధ్యం.

"తప్పించు కోవడం సింపుల్! మీరు మీ కారులో ఎక్కాలి. మీతో బాటు మేమూ యెక్కుతాము. మనతో బాటు కారులో యురేనియం వుంటుంది. యురేనియం టిక్కా ఖాన్ చేతిలోనే ఉండి ఏ క్షణాన్నైనా కలపడానికి సిద్ధంగా వుంటుంది. మీ కారు నెంబరు ప్లేటుమీద అచ్చ తెలుగు అక్షరాలు, తెలుగు అంకెలుండడం మూలంగా ప్రఖ్యాత డిటెక్టివ్ యువరాజ్ కారని ప్రతి ఒక్కరికీ తెల్సు. పైగా మీరే డ్రైవ్ చేస్తూ వుంటారు. డిటెక్టివ్ వున్న కారుని యెవరూ తనిఖీ చేయరు."

"నేను కేవలం ప్రయివేట్ డిటెక్టివ్ ని! అంత మాత్రాన పోలీసులు నా కారుని ఆపి సోదా చేయ రనుకోవడం మీ భ్రమ! తప్పక పోలీసులు నా కారుని, కారులో వుండబోవు మిమ్మల్ని, నన్ను తనిఖీచేసి తీరుతారు," చెప్పాడు యువ రాజ్.

"అవును. అలా చేయకుండా మీ పలుకుబడిని, మీ హోదాని ఉపయోగించాలి. అలా గాకుండా మీరు మౌనంగా ఉంటే పోలీసులు కారు వద్దకు చేరుకునే లోపు కారులో

ఉండే యురేనియం ప్రేలిపోతుంది. ఆ తరువాత చింతించ డానికీ వ్యవధి వుండదు,'' చెప్పాడు అహమ్మద్ ఖాన్.

యువరాజ్ అల్లల్లాడి పోయాడు. ఏం చేయాలో అంతు తెలియడం లేదు. శత్రువుల పథకం అభేద్యంగా వున్నది.

శత్రువులు ప్రస్తుతానికి తప్పించుకున్నా తంటాలు పడి బంధించడానికి అవకాశం వుంటుంది. కానిచో యురేనియం ప్రేలుడు మూలంగా కలిగిన నష్టాన్ని తనే కాదు. భగవంతుడూ పూరించలేడు. గనక శత్రువులను తనచేతుల మీదుగా సురక్షితంగా చేరవేయడానికే నిశ్చయించుకున్నాడు యువరాజ్.

"అలాగే! కేవలం మీ కోసం కొన్ని లక్షలమంది భారతీయులను బలి యివ్వలేను. మిమ్మల్ని పోలీసుల దృష్టిలో పడకుండా చేరవేయడానికి నా సర్వ శక్తులూ ధారపోస్తాను" దృఢ దీక్షతో చెప్పాడు యువరాజ్.

"వెరీ గుడ్! మీరు ఒప్పుకుంటారని మాకు తెల్సు. వేరే గత్యంతరం లేదుగా!"

నవ్వుతూ అహమ్మద్ ఖాన్, ఆగా ఖాన్‌కు, సియాంగ్ లకు ఏదో సైగ చేస్తూ తన జేబులో వున్న పిస్తోలును బయటకు తీశాడు. తీసిన పిస్తోలుని యువరాజ్ మెడమీద ఆన్చిపెట్టాడు.

ఆగాఖాన్, సియాంగులు తమ చేతులలో వున్న పిస్తోళ్ళను జేబులలో పెట్టుకుంటూ నూరిని సమీపించారు. యువరాజ్‌కు అయోమయంగా ఉంది.

యురేనియం ముద్దలను పట్టుకుని వున్న టిక్కా-ఖాన్ అలాగే వున్నాడు.

ఆగాఖాన్, నూరిని అమాంతంగా క్రిందకు పడతోశాడు. క్రిందపడ్డ నూరిని చేతులు, కాళ్ళని వెనుకకు విరిచారు.

"ఏం చేస్తారు?" గర్జించాడు యువరాజ్.

"చేస్తున్నాం, చూచి తెల్సుకోండి" అన్నాడు అహ

మ్మద్ ఖాన్ పిస్తోలు గొట్టాన్ని యువరాజ్ మెడమీద అదుముతూ.

"ఎందుకు?" ఉరిమాడు యువరాజ్.

"మా జాగ్రత్త కోసం!"

"అంటే??"

"మిస్టర్ యువరాజ్! మీరు బహుముఖ ప్రజ్ఞావంతులు. ఎత్తుకు పై యెత్తులు వేయడంలో అందె వేసినవారు. అటు వంటి మీ ముందు తగు జాగ్రత్తలో ఉండాలన్నది మా సిద్ధాంతం. మీ కారులో కూర్చున్న మమ్మల్ని ఏం చేస్తారో మాకేకాదు–మీకే తెలియ దనుకుంటాను. గనక సూరిని ఇక్కడే యీ యింట్లోనే విచిత్ర పరిస్థితులలో వదిలి పెడుతున్నాం. మీరు మమ్మల్ని వీలైనంత తొందరలో దిగబెట్టి, పోలీసులు ఈ యింటికి చేరుకోక మునుపే ఇక్కడకు చేరు కుంటే మీ సూరి మీకు దక్కుతాడు," అహమ్మద్ ఖాన్ చెప్పాడు.

ఇంతలో సూరిని విరిచి కట్టిపడేశారు.

"సార్! నాకోసం మీరు దిగులుపడకండి. నాప్రాణాలు పోయినా ఫరవాలేదు. ముందు ఈ నగరాన్ని, నగరంలో వున్న ఎందరో అమాయకుల్ని కాపాడండి" అన్నాడు సూరి ఆవేశంతో.

బంధించిన సూరిని అల్లాగే ఎత్తుకుని తలుపులకు ఆరడుగుల దూరంలో పడేశారు. యువరాజ్ వాళ్ళు ఇంకా ఏంచేస్తారో వింతగా చూస్తున్నాడు భీతితో.

సియాంగ్ తన జేబులోనుండి ఒక కొవ్వొత్తిని తీశాడు. సిగర్ లైటర్‌తో కొవ్వొత్తిని వెలిగించాడు. సూరికి తలుపు లకు మధ్య వుండే కొవ్వొత్తిని పడుకోబెట్టాడు.

యువరాజ్‌కు అంతా అయోమయంగా వుంది. సియాంగ్ వెలిగించిన కొవ్వొత్తిని నేలమీద నిలబెట్టకుండా, ఎందుకు

పడుకో బెట్టాడో అర్థంకావడంలేదు. ఆశ్చర్యంగా తిలకిస్తున్నాడు. వేడికి పైనం కరిగి నేలమీదకు ప్రాకుతూంది. వత్తి వెల్గుతూంది.

ఆగాఖాన్ ఒక గదిలోనుండి ఒక పెద్ద డబ్బాను మోసుకు వచ్చాడు. అది కిరోసిన్ డబ్బా. మూతలేదు. బాగా తెరచి వుంది. అందులో నిండుగా పెట్రోలుంది. యువరాజ్ గుండెలు గడగడలాడిపోయాయి. ఏమిటీ పైశాచికం! సూరిని సజీవంగా తగులబెట్టుతారా? తనలోని ఆవేశాన్ని, వుద్రేకాన్ని రౌద్రాన్ని ఆపుకోలేకపోయాడు యువరాజ్.

"నో, నో" అని అరుస్తూ ఆగాఖాన్‌ని అటకాయించబోయాడు యువరాజ్.

అహమ్మద్ ఖాన్ యువరాజుని ఇరికించి పట్టుకు నేశాడు. యువరాజ్ తల్లి డిల్లిపోయాడు.

ఆగాఖాన్ పెట్రోలున్న డబ్బాను తలుపుల వద్దకుతీసుకు వెళ్ళి దింపాడు. తలుపులకున్న గడియను తీశాడు. డబ్బాను బాగా ఏటవాలుగా వాల్చి తలుపులకు ఆన్చిపెట్టాడు.

ఇపుడు తలుపులు నెట్టితే చాలు పెట్రోలున్న డబ్బా భళ్లున పడిపోతుంది. అలా పడగానే-క్రిందకు జారిన పెట్రోలు క్రొవ్వొత్తిమీదుగా వచ్చి సూరిని చుట్టుముట్టేస్తుంది. సూరి పెట్రోలు మంటలలో సజీవంగా భస్మమైపోతాడు.

యువరాజ్ కంపించిపోయాడు. శరీరమంతా చమటలతో తడిసిపోయింది.

"మిస్టర్స్!! ఇది అన్యాయం, దారుణం. నాసూరిని ఇటువంటి దుర్గతికి లోనుచేయకండి" యువరాజ్ గొంతు బొంగురుపోయింది. కాని యువరాజ్ మాటలు ఎవరూ పట్టించుకోలేదు.

అందరూ ఎకాయెకిన యువరాజ్ సిత్రన్ కారువద్దకు దొడ్డి తలుపుగుండా చేరుకున్నారు.

టిక్కాఖాన్ యురేనియం ముద్దలను తయారుగా పట్టుకుని వున్నాడు. మిగతా వారందరూ పిస్తోళ్లను రెడీగా పట్టుకుని వున్నారు.

యువరాజ్ కు మనసులో మనసులేదు. జీవచ్ఛవంలా గున్నాడు. ఖర్మచాలి ఎవరైనా తలుపులు నెట్టారంటే సూరి పెట్రోల్ మంటలలో తగులబడిపోతాడు. ఎవరూ రాక మునుపే శత్రువులను దింపి తను చేరుకోవాలి. సూరిని రక్షించుకోవాలి. ఆత్రుత, ఆవేశం యువరాజులో పరవళ్లు త్రొక్కాయి. కారు స్టార్టు చేశాడు. సిత్రన్ ముందుకురికింది.

సూరి పరిస్థితి తలచుకుంటూంటే గుండెలు జలదరించి పోతున్నై. సూరికి ఎటువంటి ప్రమాదమూ సంభవించకూడదని భగవంతుని ప్రార్థించుకుంటున్నాడు.

యువరాజ్ సిత్రన్ కారుని పోలీసులు ఆపమన్నట్టు చేతులూపారు. తను కారు నాపాలి. ఆపకుంటే అనుమానిస్తారు. ఆపితే పోలీసులు తనని, కారులోవున్న వ్యక్తుల్ని లైడిటెక్టర్ల ముందు ప్రశ్నిస్తాడు. లైడిటెక్టర్లు నిజం చెప్తున్నాడా, అబద్ధం చెప్తున్నాడా వెంటనే చెప్పేస్తాయి. ఏంచేయాలో అంతు పట్టలేదు. ధైర్యంచేసి కారునాపాడు యువరాజ్.

టిక్కాఖాన్ యురేనియం కలపడానికి ఆయత్తుడవుతున్నాడు. మూడు పిస్తోళ్ళ గొట్టాలు యువరాజ్ ని గురిచూస్తూ ఆ కారులో నిక్కపొడుచుకున్నై.

“నేను డిటెక్టివ్ యువరాజ్ ని. అత్యవసరంగా క్రయిమ్ బ్రాంచ్ ఇన్స్పెక్టర్ ధనార్జనరావుని కల్సుకోవాలి. ఎక్కడున్నాడు?” అంటూ యువరాజ్ గంభీరంగా ప్రశ్నించాడు.

వాళ్ళు బలవంతంగా సోదాచేయలేదు. పోలీసులు చెప్పారు. కారు కదిలింది.

"మిమ్మల్ని ఎక్కడ దింపాలి?" అడిగాడు యువరాజ్ అహమ్మద్ ఖాన్ని.

"బీచ్ రోడ్‌లో!" చెప్పాడు అహమ్మద్ ఖాన్.

కారు వేగాన్ని పుంజుకుంది. చాలామంది యువరాజ్ కారుని గుర్తించి దారిని వదులుతున్నారు. ఒకచోట ధనార్జనరావ్ యెదురయ్యాడు. యువరాజుకి కారుని ఆపక తప్ప లేదు.

దగ్గరైన ధనార్జనరావు యువరాజ్‌ని ఏదో అడగ బోయాడు.

"డియర్ ధనార్జనరావ్, నేను అర్జంటుగా ఐ. జీ.ని కల్సుకోవాలి. వివరాలు తరువాత చెప్తాను," అంటూ యువ రాజ్ కారుని కదిల్చాడు.

ధనార్జనరావ్ కారు నాపమని కేకలు పెట్తున్నప్పటికి యువరాజ్ విన్పించుకోలేదు.

ముందు శత్రువులను దింపి సూరిని కాపాడుకోవాలి. యువరాజుకి అదే ధ్యేయంగావుంది. అన్యాస్త్రాలకంటె తనకు సూరి ప్రాణాలు విలువైనవి. అందుకని పోలీసుల కళ్లుగప్పడం నేరమని తెల్సి చేస్తున్నాడు. యీరేనియం, శత్రువులు తన కారులోనే వున్నారు. తనే స్వయంగా వారిని చేరవేస్తు న్నాడు. అది మన్నించరాని నేరం!

అహమ్మద్ ఖాన్ కారు నాపమన్నాడు. సిత్రన్ ఆగింది.

"కంగ్రాచ్యులేషన్స్ మిస్టర్ యువరాజ్! మీ మేలు మేమెన్నటికీ మరచిపోలేము. ఒక డిటెక్టివ్ చేత తప్పించు కున్న ఘనత మాకు దక్కింది. మీరు వెళ్ళి సూరిని ఇక రక్షించుకోలేరు. కొందరి అసమర్థత మూలంగా మీబోటి డిటెక్టివ్‌లు పేరుపొందతారు. మేము అసమర్థులం కాము. సూరి ఆ ఇంట్లో పెట్రోలు మంటలలో ఆహుతి అయిపో

తాడు. మీరు బ్రతికివుంటే మాకెన్నటికైనా ప్రమాదమే! మీరు సజీవంగా వుండకూడదు."

అంటూ అహమ్మద్‌ఖాన్ కారులో కూర్చుని వుండి పిస్తోలు యువరాజుకి గురిపెట్టాడు. పేల్చడానికి ట్రిగ్గర్ నొక్కుతున్నాడు.

"బాస్! ఎవరో వస్తున్నారు," అన్నాడు ఖంగారుగా సియాంగ్. పేల్చడం ఆపాడు అహమ్మద్‌ఖాన్.

"ఆగాఖాన్! ఇక్కడ జనసంచారముంది. ఇదే అదను. నువ్వు సైనేడ్ విషాన్ని యువరాజుకి ఇంజెక్షన్ చెయ్" ఆజ్ఞ యిచ్చాడు అహమ్మద్‌ఖాన్.

యువరాజ్ గుండెలు ఝల్లుమన్నై. వాళ్ళెంతటి కిరాతకులో బోధపడిపోయింది. నూరిని, తనని ఇరికించి తప్పించుకున్న శత్రువుల దృష్టిలో తాము తృణప్రాయులు.

"ఇది చాలా అన్యాయం. మీరు చెప్పినట్టు చేశాను. నన్ను చంపడం మీ మానవత్వానికి విరుద్ధం" ప్రాధేయపడ్డాడు యువరాజ్.

"డిటెక్టివ్ పగబట్టిన త్రాచుతో సమానం. పరిస్థితుల ప్రాబల్యం మూలంగా మీరు లొంగారు. మిమ్మల్ని ప్రాణాలతో వదిలితే మాకు డేంజర్!" అన్నాడు అహమ్మద్‌ఖాన్.

ఇంతలో ఆగాఖాన్ సిరెంజిని తీసుకున్నాడు. యువరాజ్ భుజంమీదకు వంగాడు.

భుజంమీద చురామన్నది. సైనేడ్ అనబడు భయంకర విషం, తన రక్తంలోకి ప్రవేశించిందని తెల్సు. ఒళ్ళంతా ఓ మాదిరిగా జిల్‌మన్నది. ప్రాణాలు పోతున్నవని గ్రహించు కునే లోపు యువరాజ్ తల వాల్చేశాడు.

## 9

నూరికి వెలిగే మైనపు వత్తిని, తలుపులకు అన్చివున్న

పెట్రోలు డబ్బాను చూస్తూంటే పై ప్రాణాలు పైనే ఎగిరి పోతున్నై.

ఎవరైనా తలుపులు నెట్టారంటే డబ్బా గుమ్మరించు కుంటుంది. పెట్రోలు మైనపు వత్తిగుండా వచ్చి తనని చుట్టేసుంది. తను సజీవంగా దహనమై పోతాడు.

ఎలా తప్పించుకోవడం? యువరాజ్ వస్తాడా? శత్రువులు ఆయనను వదులుతారా? ఆయన వచ్చి తనని రక్షించ గలడా? ఆయన వచ్చేలోపు ఎవరైనా తలుపులు నెట్టితే తన గతేం కాను!

గుండెలు దడదడ లాడి పోతున్నై.

మైనపు వత్తిని నోటితో వూది సూరి ఆర్పగలడు. కానీ దుర్మార్గులు సూరి నోటిలో గుడ్డలు కుక్కి ఉన్నారు. నోటితో వెలిగే వత్తిని వూది ఆర్పలేడు.

ముక్కు గాలితో దీపాన్ని ఆర్పాలని ప్రయత్నించాడు సూరి. నోటితో వదలు గాలికంటే ముక్కుతో వదులు గాలికి వేగం తక్కువ. ఆ వత్తి ఆరదు. ఆరలేదు. మైనపు వత్తి అడ్డంగా పడి వెల్గడం మూలంగా కరిగిన మైనం నేలమీదకు ప్రాకిపోయి వత్తి పెద్దగా మండుతూంది.

ముక్కు నుండి గాలిని యెంత బలంతో విడిచినా ఆరదని తేలిపోయింది.

ఆ మండే వత్తిమీదకు దొర్లాలనిపించింది. సూరి దొర్లడానికి ప్రయత్నించాడు. సాధ్య పడలేదు. చేతులు కాళ్ళను అతి భయంకరంగా విరిచి కట్టివున్నారు. ఎంత బలం కూడ గట్టుకున్నా పొర్లలేక పోతున్నాడు.

సూరి భయంతో తహతహలాడి పోతున్నాడు. తను చావడం ఖాయం? బెంబేలు పడిపోయాడు సూరి.

సూరి అటు యిటు ఎటూ కదలలేక పోతున్నాడు. దూరానికి దొర్లిపోవాలని శతవిధాలా ప్రాకులాడు తున్నాడు.

శరీరమంతా చెమటతో తడిసి పోతూంది. ప్రాణ భయంతో తల్లడిల్లి పోతున్నాడు.

చావునుండి తను బయట పడాలంటే ఏదో అతీతశక్తే కాపాడాలి. దైవాన్ని ప్రొక్కుకున్నాడు.

సూరి తన ప్రయత్నాన్ని విరమించుకోలేదు. వీలైతే మండే మైనపు వత్తిమీదకు దొర్లి ఆర్పాలి. లేదా దూరానికి— అంటే—పెట్రోలు మంటలకు అందని దూరానికి దొర్లుకుంటూ వెళ్ళాలి.

అటు యిటు పొర్లడానికి ప్రయత్నిస్తున్నాడు. ఆ సమయంలో యెవరో వచ్చి తలుపులు తట్టడం విన్పించింది.

సూరి భయపడి పోయాడు. అరుద్దామంటే నోరులేదు. మూల్గితే తలుపులు తట్టే మనిషి ఆదుర్దాపడి తలుపులు నెట్టేస్తాడు. ఎలా? ఎలా? సూరిలో ధైర్యం క్షీణించి పోతూంది. ఆశ సన్నగిల్లి పోతూంది. తలుపుల వంక చావు చూపులతో చూస్తున్నాడు.

తలుపులు నెట్టుతున్నారు. పెట్రోలు డబ్బా వంగుతూంది. మైనపువత్తి వెలుతూంది. సూరి నిర్వీర్యుడైపోయాడు. ఏమీ చేయలేని నిస్సహాయ స్థితిలో వున్న సూరి అల్లకల్లోలంలో పడి కొట్టుకులాడిపోయాడు.

అరవలేదు. మూల్గితే ప్రమాదం! అలాగే ఉంటే ప్రమాదం! తప్పించుకునే దెలా? తను చనిపోతాడు. పెట్రోలు మంటలు తనని చుట్టుముట్టి భస్మం చేసేస్తాయి.

తలుపులు నెట్టుతున్నారు.

పెట్రోలున్న డబ్బా వంగిపోయింది,

పడిపోయింది.—?

మొజాయిక్ ఫ్లోర్ మీద పడిన పెట్రోలు ఉరకలు వేస్తూ తృటిలో కమ్ముకు పోయింది.

# 10

తెలివి వచ్చింది. తెలివి వచ్చినట్టు గ్రహించగానే దిగ్గున లేచాడు యువరాజ్.

ఏమిటి? తను చనిపోలేదా? బ్రతికే వున్నాడా? సైనేడ్ విషం తనని చంపలేదా?

అసంభవం... సైనేడ్ తనకు ఎక్కించి వుంటే మరు క్షణం మరణించి ఉండేవాడు. మరయితే తనకు ఇంజెక్షను ఇచ్చిన మందేమిటి?

వళ్ళంతా బధకంగానూ, నొప్పులుగానూ వుంది. యువ రాజ్ ఆలోచించాడు. తన శరీర పరిస్థితిని పట్టి తనకు మార్ఫియా ఇంజెక్షన్ యిచ్చివుండాలని వూహించాడు.

సైనేడ్ అంటూ మార్ఫియా ఇంజెక్షన్ ఎందుకు ఇచ్చారో బోధపడలేదు. పొరబాటు జరిగిందా? ఇంజెక్షన్ యిచ్చిన ఆగాఖాన్ సైనేడ్‌కు బదులు మార్ఫియా యిచ్చాడా?

యువరాజ్ తన కారులోనే సీటుమీద పడివున్నాడు. గబగబ దిగాడు. ఎదురుగా మహాసముద్రం దృశ్యమిస్తూంది. కనుచూపు మేర వరకు నీలిరంగుగల జలం అవుపడుతూంది. చుట్టు ప్రక్కల తిలకించాడు. అంతా అయోమయంగా వుంది.

శత్రువులు అక్కడనుండి ఎలా తప్పించుకున్నారో అవ గాహన కాలేదు. కానీ ఎలాగైతేనేం శత్రువులు తప్పించుకు వెళ్ళారు? తెల్సుకునేంత వరకు తను నిద్రించ కూడదు. పట్టు దల వహించాడు. ఇంతలో—

సూరి గుర్తుకు వచ్చాడు. గుండె లదిరాయి. సూరిని తను సజీవంగా చూడగలడా?ఆదుర్దా పడిపోయాడు యువరాజ్ ఆదరాబాదరా తన కారెక్కాడు. ముందుకురికించాడు.

లాలా బజార్ దగ్గరయే కొలదీ యువరాజ్ గుండె వేగం హెచ్చుతూంది. స్టీరింగ్ యువరాజ్ చేతిలో అల్లల్లాడి పోతూంది.

సూరికి ఎటువంటి ప్రమాదమూ సంభవించ కూడదని భగ

వంతుని ప్రార్థించు కుంటున్నాడు. కారాగింది. అక్కడ—

పోలీసులతో హడావుడిగా వుంది. ఫైర్ యింజన్లు గంటలు కొట్టుకుంటూ వచ్చి చేరుతున్నవి. సూరి ఉండిన యింట్లో నుండి మంటలు పొగలు మింటి కెగుస్తున్నవి.

యువరాజ్ స్థాణువై నిలబడి పోయాడు.

సూరి పెట్రోల్ మంటలలోపడి తగులబడి పోయి వుంటాడని తలుచుకోగానే యువరాజ్ కు కన్నీరు ఆగలేదు. తన ఊపిరితిత్తులతో సమానుడైన సూరి గతించాడా? బావురు మనేశాడు.

మంటలువచ్చు ఇంట్లోకి తెగించి దూరబోయాడు. ఇంతలో అప్పుడే అక్కడకు చేరుకున్న ధనార్జనరావు యువరాజ్ భుజం పట్టుకుని ఆపుతూ, "మీ రెందుకు వెళ్తున్నారు? ఏం జరిగింది?" అడిగాడు.

"సూరి ఆ మంటలలో చిక్కుకుని వున్నాడు. రక్షించాలి. నా సూరి మరణించ కూడదు" అంటూ ఆ యింట్లోకి దూరాడు.

పొగలు మంటలు క్రక్కు యింట్లోకి యువరాజ్ జొర బడడం చూస్తూన్న ధనార్జనరావు రాతి బొమ్మలా ఉండి పోయాడు. సూరి ఆ మంటలలో యెందు కుంటాడు? అర్థం కాలేదు.

యువరాజ్ అంతటి వాడు మంటలలోకి దూరగానే ధనార్జనరావ్ నిలబడలేక పోయాడు. ఫైర్ యింజన్లు నీళ్ళు చిమ్మడం, ధనార్జనరావు మంటలలోకి దూరడం ఏకకాలంలో సంభవించినై.

## 11

తలుపులు నెట్టడం సూరి గమనించగానే అలజడికిలోనై పోయాడు. పెట్రోలు డబ్బా పడిపోతుందని, పడగానే

కొవ్వొత్తిని తాకుతుంటూ తనని చుట్టుకుంటుందని తనుభస్మా డని తలుచుకోగానే తన బలాన్నంతా కూడగట్టుకున్నాడు.

కొన్ని విపత్కర పరిస్థితులలో వెన్నెముకకు ఎక్కడ లేని బలం సమకూరుతుంది. ఈ విషయం ఆ తరువాత తెలుస్తుంది.

సూరి ప్రాణభయంతో వొక్క వూపుతో దొర్లాడు, పొర్లాడు. ఆ విసురుకు సూరి శరీరం రోలర్‌లా దొర్లుకుంటూ ఆవైపు గోడకు కొట్టుకుంది. అంతే...

తలుపులు నెట్టబడి డబ్బా పడగానే గప్పున పెట్రోలు అంటుకుంది. తృటిలో గదంతా మంటలతో నిండిపోయింది.

తలుపులు నెట్టినతను మంటలకు చావరుపు అరుస్తూ అల్లంత దూరంలో పడిపోయాడు. క్షణంలో తలుపులు భస్మమై పోయినై.

గది నిండుకు పొగలు! ఆక్సిజన్ కొరత ఏర్పడిపోయింది. సూరికి వూపిరి ఆడడంలేదు. మంటల నాలుకలు సూరిని తాకుతున్నవి.

సూరికి తను బ్రతుకుతాడన్న నమ్మకం ఎప్పుడోపోయింది. నోటిలో గుడ్డలు కుక్కబడి వుండడం మూలంగా దవడలు నొప్పి పుడుతున్నై. చెమటలలో తడిసి ముద్దైపోయి వున్నాడు.

మంటలు అంతటితో ఆగక ఆ గదిలో వుండిన ఫర్నీచర్ నంతటినీ ఆవహించుకున్నై. గదంతా సెగలు... సెగలలో సూరి శరీరం వుడికిపోతూంది. సూరి శక్తి క్షీణించిపోతూంది.

ఆ సమయంలో___

సూరిని యెవరో అలాగ్గా ఎత్తుకుని భుజంమీద వేసుకుని మోసుకెళ్ళుతున్నారు. ఆ స్పర్శ తగలగానే సూరికి వెయ్యేనుగుల బలం పుంజుకుంది. తృప్తిగా గాలి పీల్చుకున్నాడు. ఆ స్పర్శ తనని యెన్నో ఆపదల నుండి కాపాడినదే గాక,

తన జీవితానికి, జీవిత గమనానికి వజ్రకవచం!

# 12

"మిస్టర్ యువరాజ్! మీరు చేసింది తప్పనిగానీ పొర పాటని గానీ చెప్పక నేరమంటున్నాను. శత్రువులు మీకు తెలియ జేయగానే పోలీసులకు చెప్పవల్సిన బాధ్యత గల వారు," అని రుసరుసలాడాడు ఐ. జి.

"అవును. అప్పటిలో మీరన్నట్టు బాధ్యతను నేను చేసి వున్నట్టయితే ఈ నగరం, నగరంలో వున్న మనం ఈ పాటికి వాయువురూపమై గగనంలో ఉండేవాళ్ళం. అన్నీ యోచించి అలా చేశాను," యువరాజ్ వివరంగా విన్నవించాడు.

"అయితే యిప్పుడు శత్రువులు ఎక్కడున్నారు? బాంబు లను ఎక్కడ దాచి వుంచారు? తెల్సుకునే దెలా? ఇతర దేశీయులు మన దేశంలో చేసిన ఈ సాహసానికి సిగ్గు చేటుగా ఉంది," అన్నాడు హోం మంత్రి.

"శత్రువులు యురేనియంతో పారిపోడానికి బీచ్ రోడ్ లో దిగడాన్ని గమనిస్తూంటే శత్రువులకు హిందూ మహాసము ద్రంలో రాకెట్-స్థావరమో, జలాంతర్గామో వుండాలని వూహిస్తున్నాను" చెప్పాడు యువరాజ్.

"ఆ విషయం తెల్సుకునే దెలా?" అడిగాడు కమీషనర్.

"మన వైమానికదళ సిబ్బందికి ఆజ్ఞలు జారీ చేయండి. అలాగే మన నౌకాదళ సిబ్బందిని మేల్కొలపండి. హిందూ మహాసముద్రంలో ప్రతినీటి బొట్టునూ వెదకమని చెప్పండి," అన్నాడు యువరాజ్.

"అలాగే... ఆర్డర్స్ జారీ చేస్తాను" అంటూ హోం మంత్రి ఫోన్ అందుకున్నాడు.

"మిస్టర్ యువరాజ్! శత్రువుల స్థావరం బాంబులతో సముద్రగర్భంలో జాడ తెలియకపోతే శిక్షార్హులు అవు

తారు," హెచ్చరించాడు ఐ. జి.

"అలాగే...ఆ బాంబులను, శత్రువులను కనుగొనడానికి నా సర్వశక్తులూ ప్రయత్నిస్తాను," అంటూ లేచాడు యువ రాజ్.

# 13

డిటెక్టివ్ యువరాజ్ భుజంగరావుకు ఫోన్ చేశాడు.

"భుజంగరావు గారూ! మీ భార్య దేవకి యింటికి వచ్చిందా?"

"లేదండి రాలేదు" ఆందోళనతో చెప్పాడు భుజంగ రావు.

యువరాజ్ ఆశ్చర్య చకితుడయ్యాడు. "రాలేదా!" అంటూ రిసీవర్ పెట్టేశాడు.

"సూరీ! దేవకి యింటికి వెళ్ళక ఏమయింది? ఎక్కడికి వెళ్ళివుంటుంది?" విసుపోయాడు యువరాజ్.

"సార్! ఆమె యింటికి వెళ్ళక మనలను అనుసరించి వచ్చిందేమో?" అన్నాడు సూరి.

"అలా అనుసరించి వచ్చివుంటే నాకు మార్ఫియా యివ్వగానే తెలివిలేని నా వద్దకు వచ్చి వుండాలిగా!"

"అందుకు ఆమెకు అవకాశం లభించి ఉండదు."

"అంటే?"

"శత్రువులను ఆమె వెన్నాడుతూ వెళ్ళిందేమో?"

యువరాజ్ అదిరిపడ్డాడు. మనసు పరిపరివిధాల పోయింది. సూరి సందేహంలో సత్యముంది.

"నిజమే సూరీ! నువ్వు వెంటనే బీచ్ రోడ్ కు వెళ్ళు. దర్యాప్తు ప్రారంభించు. నువ్వన్నట్టే దేవకి శత్రువుల వెన్నంటితే శత్రువుల ఆచూకీ లభించవచ్చు."

సూరి బయటకి వెళ్ళిపోయాడు.

తనని మోసంచేసి తప్పించుకున్న శత్రువులు సముద్రంలో వెళ్ళి వుంటే నౌక మీదనే వెళ్ళి వుండాలి. ఆలోచించ సాగాడు.

టెలిఫోన్ అదిరిపోతూ మ్రోగింది. రిసీవ్ చేసుకున్నాడు యువరాజ్. "హల్లో" అన్నాడు.

"ఏమండీ దేవకిని మాట్లాడుతూంట."

యువరాజ్ గుండెలు ధమధమ లాడాయి.

"ఏమిటి విశేషాలు?" ఆత్రంగా అడిగాడు.

"మీరు వెంటనే హోటల్ డీలక్స్, నెంబరు అరవై గదికి మారువేషంలో, అతిరహస్యంగా వచ్చి కల్సుకోండి. వివరాలు చెప్తాను," అంటూండగానే ఫోన్ క్లిక్ మన్నది.

యువరాజ్ ఆశ్చర్యానికి అంతు లేకుండా పోయింది.

మేకప్ రూములో నుండి క్షణంలో బయటపడ్డాడు. డిక్టో ఫోన్ ఆన్ చేశాడు.

"సూరీ! దేవకి డీలక్స్ హోటల్, నెంబరు అరవైకి రమ్మని ఫోన్ చేసింది. ఏవో విషయాలు చెప్తానన్నది. వెళ్తున్నాను. నువ్వు రాగానే నేర్పుగా అక్కడ కొచ్చి నన్ను కల్సుకో. నేను లేకుంటే, అక్కడి పరిస్థితులబట్టి తెలియ జేయడానికి ప్రయత్నిస్తాను. బి కేర్ ఫుల్!" అని రికార్డ్ చేశాడు. బయలుదేరాడు. గుండెలు అతివేగంగా కొట్టుకుంటున్నవి.

## 14

డిటెక్టివ్ యువరాజ్ హోటల్ డీలక్స్‌కు అతి సులభంగానే చేరుకున్నాడు.

శత్రువులు తనని ఒక కంట కనిపెడ్తూన్నారేమో లోలోన జంకుగానే వుంది. అతి జాగ్రత్తగా మసలు కుంటున్నాడు. తనలోని ప్రతి కదలికనూ సహజత్వం వుట్టిపడేలా నడుస్తూ, సందేహం కల్గని రీతిగా అడుగులు వేస్తున్నాడు.

అరవై నెంబరు గది ముందుకు చేరుకున్నాడు. అటు ఇటు చూశాడు. ఎవరూ లేరని నమ్మకం కుదిరింది. మెల్లగా తలుపులు తట్టాడు.

యువరాజ్ గుండెలు వేగంగా కొట్టుకుంటున్నై. తనకి ఫోన్ చేసింది దేవకేనా? దేవకి ఫోన్ చేయడం శత్రువులు పసిగట్టి వుంటే తనకి ప్రమాదం! తను అప్రమత్తుడై వుండాలి.

జేబులోని పిస్తోలును తడుముకుంటూ మళ్ళీ తలుపులు తట్టాడు.

లోపల తలుపులు తీయు సవ్వడి వినబడింది. తలుపులు తెరుచుకున్నవి. యువరాజ్ ఆత్రుతగా చూసాడు.

ఎదురుగా దేవకి నిలబడి వుంది. తనని బంధించడానికి శత్రువులు దేవకిని అడ్డంగా పెట్టుకుని ఏదైనా పన్నాగం పన్ని వున్నారేమో! ఆమె ముఖకవళికలను బట్టి గ్రహించడానికి సునిశితంగా చూశాడు.

"ఎవరు?" కరుగ్గా ప్రశ్నించింది దేవకి.

"నేనే!" చెప్పి నవ్వాడు యువరాజ్.

యువరాజ్ మారువేషంలో వుండడం మూలంగా దేవకి గుర్తించలేక పోయింది. అతి మెల్ల గొంతుకతో 'యువరాజ్' అన్నాడు.

దేవకి తప్పుకుంది. యువరాజ్ లోపలకు అడుగు పెట్టాడు. తలుపులు మూసేసింది.

"మీరా! గుర్తించలేక పోయాను. రండి," అంటూ దేవకి బాత్ రూం వైపు దారి తీసింది. ఆమె బాత్ రూమ్ వైపు వెళ్ళడం యువరాజ్ కు అయోమయం అయిపోయింది. దేవకి బాత్ రూము తలుపులు తెరిచి లోపలకు అడుగు పెట్టింది. యువరాజ్ తటపటాయించాడు.

"రండి!" నవ్వుతూ అన్నది దేవకి. ఆ నవ్వులో వెకిలి చేష్టలకు తావు లేదు. యువరాజ్ గ్రహించి బాత్ రూం

లోకి జడుస్తూనే అడుగు పెట్టాడు. దేవకి తలుపులు మూసేసింది.

"యువరాజ్ గారూ, మీరు గదిలోకి రావడం ఎవరైనా చూశారా?" ఖంగారుగా అడిగింది దేవకి.

"చూచి ఉండరనే నా నమ్మకం!"

"నమ్మకం వుంటే ఫరవాలేదు. శత్రువులు అతి భయంకరులుగా ఉన్నారు. అందుకని మనం మాట్లాడుకోడానికి బాత్ రూముని ఎన్నుకొన్నాను. ఇపుడు బయట ఎవరైనా వచ్చినా నేను వెళ్తాను. అనుమానం కల్గదు," చెప్పింది దేవకి.

ఆమె సమయస్ఫూర్తిని మెచ్చుకోకుండా వుండలేక పోయాడు. "ఏం జరిగింది? చెప్పబోయేదేమిటో చెప్పండి," అన్నాడు యువరాజ్.

"మీరు మావారి వద్దకు నన్ను ఇంటికి వెళ్ళమని మీ కారెక్కి బయలుదేరారు. నేను మా ఇంటికెళ్ళక ఒక టాక్సీలో మీ కారుని అనుసరించాను. లాలా బజార్‌లో దిగి నేను మీరున్న ఇంట్లోకి వస్తే నాకో, మీకో ప్రమాదం సంభవిస్తుందని అలాగే వుండిపోయాను. కాసేపటికి కొందరు వ్యక్తులతో మీరు రావడం చూశాను. మీ కారుని మళ్ళీ అనుసరించాను. బీచ్ రోడ్‌లో ఆగింది.

శత్రువులందరూ దిగి ఆదరాబాదరా సముద్రం వైపు వెళ్ళడం గమనించాను. మీరు ప్రాణాలతో వున్నారో, తెలివితప్పి వున్నారో నేనపుడు ఆలోచించలేదు. శత్రువులు ఎటు వెళ్ళుతారో చూడాలని తాపత్రయ పడిపోయాను. ఆ లక్ష్యంతోనే వారిని వెంబడించాను. వాళ్ళు మొత్తం నల్గురు వ్యక్తులున్నారు. నలుగురిలో ముగ్గురు పడవను ఎక్కారు. పడవ సముద్రంలోకి ఉరికి ప్రయాణం కొనసాగించింది. ఒకతను తిరిగి వచ్చాడు. ఈ హోటల్ చేరు

కున్నాడు,'' చెమటలు తుడుచుకుంది దేవకి.

''ఎవరతను? ఎక్కడున్నాడు?'' అడిగాడు యువరాజ్.

''ఈ హోటలులోనే ఉంటున్నాడు. ఇక్కడికి ఈ రోజు కొందరు నిపుణులు వచ్చారు. ఏ విషయంలో నిపుణులో నాకు తెలియదు. ఆ నిపుణులకు వినోదం, విలాసం, అందించడానికి ఇద్దరు స్త్రీలు కావల్సి వచ్చింది. అందుకు నేనెన్నో తంటాలుపడి నా శరీర అవయవాలను, వాక్చాతుర్యాన్ని ఉపయోగించి ఎన్నుకోబడ్డాను. ఈ రాత్రికి అందరూ బయలుదేరుతున్నారు. ఎక్కడకు వెళ్ళుతారో నాకు తెలియదు. నా వూహా... తప్పక బాంబులున్న చోటుకేనని అనుకుంటున్నాను. అందుకే మిమ్మలను పిలిచాను,'' చెప్పింది దేవకి.

''ఇక్కడకు వచ్చిన నిపుణులువవరెవరో మీకు తెల్సా?'' అడిగాడు యువరాజ్.

''తెల్సు. రాత్రి వారి ముందు కేబరే, స్ట్రిప్ సీజ్ డాన్సులు ఆడి మెప్పించాను. నా శరీరపు ఒంపులతో వెఱ్ఱి ఎత్తించాను,'' ఆమె జంకూ గొంకూ లేకుండా, సిగ్గూ ఎగ్గూ లేకుండా చెప్పింది. దేవకి పూర్తిగా మనోవికారాలకు లోనైవుంది. తన భర్త తయారుచేసిన బాంబులను చేజిక్కించుకోడానికి దేవకి దేనికైనా సిద్ధంగా వుంది. ప్రతి పనిలోనూ వుత్సాహం చూపుతూ ఆత్రుత కనబరుస్తూంది.

ఇంతలో బయట ఎవరో తలుపులు తట్టిన చప్పుడైంది.

''ఎవరో వచ్చారు'' ఖంగారుగా అన్నది దేవకి.

''ఖంగారు పడకండి. శత్రువుల మనిషైనా, ఎవరైనా వచ్చివుంటే ఈ బాత్ రూములోకి జాగ్రత్తగా తీసుకు రండి,'' చెప్పాడు యువరాజ్.

ఆమె కేదో అర్థమైనట్టయింది. వచ్చిన వ్యక్తి శత్రువుల వాడైతే యువరాజ్ ఏదో చేస్తాడని వూహించింది. దేవకి గబగబ తన ఒంటి మీదున్న బట్టలను నూలుపోగు లేకుండా

వూడ బెరుక్కుంది. ఆ బాత్ రూములో యువరాజ్ వున్నాడన్న విషయం తెల్సినా గుర్తించే స్థితిలో లేదామె!

ఆమె శరీరం ఏదో కాంతితో మెరిసి పోతూంది. ఆమె శరీర అవయవాలు నిండుగా వుండి వుద్రేకం కల్గిస్తున్నవి.

ఆమె యువరాజ్ ముందు సిగ్గుపడలేదు. నగ్నంగా వున్న దేవకి గబగబా టబ్ వరకెళ్ళింది. టబ్‌లో వున్న నీటిలో ఒక్క బుటక వేసి మునిగింది. లేచి నిలబడింది.

కొక్కానికి వ్రేలాడుతున్న టర్కీ టవల్ని అందుకుంది. తన పిరుదుల చుట్టూ చాలీ చాలక చుట్టుకుంది. కాస్త గుడ్డను తన రొమ్ములను కప్పిపుచ్చడాని కన్నట్టు అడ్డం పెట్టుకుంది.

యువరాజ్ విచిత్రంగా నిలబడి తిలకిస్తున్నాడు.

దేవకి తడి శరీరంతో, "ఏమండి, మీరు ఆ మూల దాక్కోండి. వచ్చినవాడు శత్రువులోని మనిషైతే తప్పక పిలుచుకు వస్తాను. వాడు బాత్ రూంలోకి అడుగు పెట్టగానే, ఆ తరువాత బాధ్యత మీది," చెప్పింది అతిమెల్లగా.

యువరాజ్ మూల నక్కాడు. దేవకి కొద్దిగా తలుపులను తెరిచింది. "యస్ కమిన్!" అన్నది.

బయట తలుపులు తెరచి ఎవరో లోపల ప్రవేశించినట్టు అడుగుల చప్పుడు యువరాజ్‌కు వినబడింది.

వచ్చినతను దేవకి శరీరాన్ని చూసి చిత్తై పోయాడు. నోరు తెరిచి, కళ్లు పెద్దవి చేసి నిలబడగానే అతనిలో వేడి పెరిగింది. నరాలు జివ్వుమన్నవి.

అది గ్రహించిన దేవకి తను నగ్నంగా వున్నానని తొందరపడి బాత్ రూములో నుండి వచ్చినట్టు దొంగసిగ్గును ప్రదర్శిస్తూ - ఆ సిగ్గులో యింకా రెచ్చగొట్టు తనాన్ని చూపింది.

"ఐయామ్ వెరివెరి సారీ!" అన్నది దేవకి అలా నిలబడే, టవల్ని జారుస్తూ అవయవాలను కనబడునట్టు చేస్తూ.

వచ్చినతనిలో నిగ్రహం పోయింది. అమాంతం దేవకిని చుట్టేయాలనుకున్నాడు. అది పసిగట్టిన దేవకి అతని దగ్గరగా వెళ్ళింది. అతని కళ్ళల్లోకి కళ్ళు పెట్టి చూసింది. అంతే—

అతను ఆగలేక పోయాడు. దేవకిని చుట్టేశాయి అతని చేతులు. దేవకి టర్కీ టవల్ని వదిలేసింది. నగ్నంగా అతని బాహువుల్లో ఇమిడి పోయింది. అతను ఆమె శరీర స్పర్శకు పూర్తిగా బానిసైపోయాడు.

"ఇక్కడొద్దు. బాత్ రూములోకి వెళ్ళుదాం. ఎవరైనా మీ వాళ్ళల్లోనే రావచ్చు," తియ్యగా చిలక పలుకులు పలికింది.

అతను మంత్రముగ్ధుడిలా తలూపాడు. దేవకి అతని నడుం చుట్టూ చేయి వేసి సోయగాలతో బాత్ రూము వైపు నడిపించింది.

ఇద్దరూ బాత్ రూములోకి అడుగు పెట్టారు. దేవకి అతనిని కసిగా అన్నట్టు వాటేసుకుంది. అతను అదుముకున్నాడు. దేవకి అతని వీపుని యువరాజ్ వున్న వైపుకి మళ్ళించింది. యువరాజ్ క్షణమూ ఆలస్యము చేయలేదు. ఏం చేయాలో అదే చేసేశాడు. అతను దేవకి బాహువుల్లోనే తల వాల్చేశాడు. అతని భారీ శరీరాన్ని దేవకి మోయలేక పోయింది. యువరాజ్ సహాయ మందించాడు. "దేవకీ! ముందు బట్టలు వేసుకో." అంటూ ఆ వ్యక్తిని పడుకో బెట్టాడు యువరాజ్. దేవకి చకచక వళ్ళు తుడుచుకుని, బట్టలు వేసుకుంది.

క్రింది పడ్డతని జేబులను చకచక వెతికాడు యువరాజ్, కొన్ని కాగితాలు దొరికినవి. గబగబ చూశాడు. అతని పేరు సాదత్ అని తెల్సుకున్నాడు.

వెంటనే ఓ నిశ్చయానికి వచ్చాడు యువరాజ్. బుజే లోంచి రెడ్ పెన్సిల్ తీసి బాత్ రూం తలుపుమీద ఇంటు

మార్కు పెట్టాడు. ఇంటు మార్కుమీద ప్లస్ గుర్తు పెట్టాడు. పక్కగా యారో మార్కు గీశాడు. యారో కెదురుగా ఆంగ్లంలో Sea అని వ్రాశాడు. ఆ గుర్తు చాలు. సూరి గ్రహించగలడని యువరాజ్ కి ధైర్యం కలిగింది.

# 15

రాత్రి పదిగంటలకు టిక్కాఖాన్ గదికొచ్చి పిలిచాడు. యువరాజ్ బయలుదేరాడు. అందరూ హాలులో కలుస్తున్నారు.

మొత్తం ఆర్గురు అయ్యారు. టిక్కాఖాన్, నిపుణులతో కల్సి నల్గురు. యువరాజ్, దేవకీలు యిద్దరు. మరో యువతి ఏమయింది? బహుశ రద్దుచేసి వుండొచ్చని యువరాజ్ తలచాడు.

ఆరుగురు ఆవరణలోకి అడుగుపెట్టారు. ఒక టాక్సీ ఆగి వుంది. అందరూ ఎక్కారు. బయలుదేరింది టాక్సీ. అంతవరకు తనని ఎవరూ గుర్తించనందుకు సంతోషించాడు యువరాజ్.

బీచ్ రోడ్ లో అందరూ దిగారు. టాక్సీ వెళ్ళిపోయింది. ఆ ప్రదేశమంతా నిర్మానుష్యంగావుంది. సముద్రపు ఘోష స్పష్టంగా వినబడుతూంది. గాఢాంధకారమయంగా వుంది. ఏమీ కనిపించడంలేదు.

దిగిన వారంతా యిసుకలోపడి సముద్రంవైపు నడవడం ప్రారంభించారు. ఒక పడవవద్ద ఆ చీకటిలో యిద్దరు వ్యక్తులు నిలబడివున్నారు. వాళ్ళు ఈ ఆరుగుర్ని ఆహ్వానించారు. అందరూ కల్సి పడవను నీటిలోకి నెట్టారు.

అందరూ పడవలోకి ఎక్కారు. పడవ ప్రయాణం కొనసాగించింది.

ఆ పడవకు అడుగు భాగంలో శక్తివంతమైన ఇంజన్ వుందని యువరాజుకు వెంటనే తెల్సిపోయింది. యంత్రశక్తి మూలంగా ఆ పడవ అలలకు ఎదురుగా వేగాన్ని పుంజుకుంది.

దేవకి యువరాజ్ ప్రక్కనే కూర్చునివుంది. ఆమె జీవచ్ఛవంలా గుంది. అవును. నడిరేయి. చిట్టచీకటి. గంభీరమైన సముద్రంమీద ప్రయాణం. పైగా శత్రువులమధ్య. ఆమెకు అగ్నిజ్వాలల మధ్య వున్నట్టుంది.

పడవ సముద్రంలోకి చొచ్చుకుపోయే కొలది అందరూ భీతావహులై పోతున్నారు.

ఎంతటి ధైర్యవంతుడైనా ఆ పరిస్థితిలో భయపడక తప్పదు. చీకటిలో సముద్ర ప్రయాణం వింతగా వున్నా భయంకరంగా వుంది. పైన నక్షత్రాలు మినుకు మినుకు మంటున్నవి. అందరూ అరచేతులలో ప్రాణాలు పట్టుకుని ప్రయాణిస్తున్నారు. ఎంతసేపు, ఎంతదూరం వెళ్ళాలో...??

పడవను నడపు ఇద్దరూ చకచక ఏదేదో చేస్తున్నారు. పడవ మధ్య భాగంలో పెద్ద యిరుసును నిలబెట్టి బిగిస్తున్నారు. యువరాజ్ వింతగా వాళ్ళను, వాళ్లు చేసేపనిని చూస్తున్నాడు.

ఇరుసుని నిలబెట్టి బిగించడం పూర్తయింది. ఆ ఇరుసుకు పై భాగంలో పొడుగుపాటి రెక్కలను అమర్చారు. గట్టిపరచారు. ఇపుడు ఆ రెక్కలు హెలికాప్టర్ కుండు ప్రొఫెల్లరలాగున్నవి. ఇంజనుని ఆపి ఏదో చేశారు.

ప్రొఫెల్లర్స్ తిరగడం ప్రారంభించాయి. స్పీడందుకుంది. హోరు ఎక్కువయింది.

ఆ పడవ హెలికాప్టర్ లా పైకి లేచినట్టు లేచింది. అందరూ ఆశ్చర్యచకితులైపోయారు. నీటినుండి పైకి లేచిన పడవ పదడుగుల ఎత్తుకు వచ్చింది. ఆ ఎత్తుకంటె పైకి లేవలేదు. సముద్ర జలాలకు పదడుగుల ఎత్తులోవుండి ప్రయాణం ప్రారంభించింది.

యువరాజు ఆశ్చర్యానికి అంతులేకుండా పోయింది.

ఆ ప్రయాణం విచిత్రంగా వుంది. సముద్రంమీద జలా

అడు పదడుగుల గగనంలో వుండి ప్రయాణించడం విచిత్రమే మరి. ఆ పడవ పనితనానికి మెచ్చుకోకుండా వుండలేక పోయాడు. చూపుకు పడవలావున్నా హెలికాప్టర్‌లా పయనిస్తూంది. దాని తయారీ అత్యద్భుతం. చెట్లో, కొండలో, గుట్టలో అడ్డంవస్తాయన్న సంశయమే లేదు. దూరానికి పడవ పయనించినట్టే కనబడుతుంది.

సముద్రపు నీటికి పదడుగుల దూరంలో వుండి, వుపరితలం మీద శరవేగంతో దూసుకు వెళ్లుతూంది. అందరూ మౌనంగా వున్నారు.

తూర్పుదిక్కున అరుణ రేఖలు కన్పడేంతవరకు పడవ ప్రయాణిస్తూనే వుంది. ఎటుచూచినా సముద్రమే గోచరిస్తూంది. నీలాకాశం, సముద్రంమీది కెరటాలు. పరిస్థితులు భయానకంగా వున్నై.

పడవ సీప్లేన్‌లా జలాలను చీల్చుకుంటూ నీటిమీద ఆగింది.

పడవ నడిపినవారు ఏదో సాధనాన్ని నొక్కడం యువరాజ్ చూశాడు. ఆ సాధనం కిక్ కిక్ మన్నది.

దేనికోసమో ఎదురు చూస్తున్నారు. అపుడు—

సముద్ర గర్భంలోనుండి ఒక పెద్ద స్తంభం లాటిది పైకి పుట్టుకొచ్చింది. ఆ స్తంభాన్ని చూచిన దేవకి హడలిపోయి కెవ్వుమని కేక వేసేసింది. యువరాజ్ ఆమెను అభయంతో హత్తుకున్నాడు. అందరూ సముద్రంలోనుండి పుట్టుకొచ్చిన స్తంభాన్ని చూచి భయపడకుండా వుండలేకపోయారు.

ఆ స్తంభానికి పక్కగా వెళ్ళి పడవ ఆగింది. స్తంభం నుండి తలుపులాటిది తెరుచుకుంటూ పడవమీద వాలింది.

టిక్కాఖాన్, "కమాన్," అంటూ పిలిచి పడవమీద వాలిన చెక్కమీద నడుస్తూ స్తంభంలోపలికి జారబడి పోయాడు.

అందరూ అనుసరించారు. అందరూ స్తంభంలోపలికి చేరుకునేశారు. ఇపుడు తలుపులు మూసుకున్నవి. సముద్రం లోపలకు స్తంభం మళ్ళీ మునిగిపోయింది.

అక్కడ ఆగిన పడవ తిరుగ ప్రయాణం ప్రారంభించింది.

# 16

సాగర గర్భంలోకి మునిగిన స్తంభం జలాంతర్గామిని చేరుకుంది. అందరూ జలాంతర్గామిలోకి అడుగుపెట్టారు.

అహమ్మద్ ఖాన్, ఆగాఖాన్, సియాంగ్ యింకా ఇతర సిబ్బంది వున్నారు లోపల. అందరూ వారిని సాదరంగా ఆహ్వానించారు. దేవకిని ఆవురావురుమని చూశారు అక్కడున్న వారంతా.

ఆ జలాంతర్గామిలో రాకెట్లను ప్రయోగించబడుగొట్టాలు ఇంకా యితర యంత్ర పరికరాలు చూస్తూంటే యువరాజుకు ముచ్చెమటలు పట్టినై.

ఆ జలాంతర్గామి దాదాపు వంద అడుగుల లోతునవుంది. అక్కడక్కడ అద్దాలున్నవి. అద్దాలగుండా సాగర గర్భ జలం గోచరిస్తూంది.

అక్కడున్న రాకెట్లను చూస్తూంటే చైనాలో తయారైనవని స్పష్టంగా తెలుస్తున్నవి. ఇపుడు చైనా రాకెట్ల స్థావరాలను చాలా నిర్మించి వున్నదని యువరాజుకు తెల్సు. చైనా పాకిస్తాన్ కల్సి సాగర గర్భంలో రాకెట్ స్థావరం నిర్మించారని వూహించాడు.

అపహరించిన బాంబులు ఆ వైపుగా పెట్టబడివున్నై ఆ బాంబులను చూస్తూంటే యువరాజ్‌కు వణుకు పుట్టిపోతూంది. ఆ బాంబుల శక్తి యువరాజ్‌కు బాగా తెల్సు.

ఆ బాంబులను నిపుణుల సహాయంతో రాకెట్లలోఅమర్చుతారు. అయితే రాకెట్లను ఏదేశం మీదకు ప్రయోగిస్తారు?

అక్కడి పరిస్థితులు గ్రహిస్తుంటే తను ప్రాణాలతో బ్రతికి బయటపడగలనన్న నమ్మకం యువరాజుకు పోతూంది.

జలాంతర్గామిలోకి చేరుకున్న నిపుణులకు ఏవో పానీయాలు అందివ్వబడ్డాయి. అందరూ సేవించారు. ఖాళీగ్లాసులను క్రింద పెట్టారు. ఆశ్చర్యం.

ఆ గ్లాసులకు ఎవరో వచ్చి వ్రేలి ముద్రలను తెల్సుకోడానికి ఏదో పౌడరు చల్లాడు. లోపలకు తీసుకెళ్ళాడు. యువరాజ్ గడగడా వణికిపోయాడు.

నిపుణుల వేలిముద్రలు అంతకుముందే జలాంతర్గామిలోకి చేరివున్నవి. ఆ వేలిముద్రలతో, ఇప్పుడు తీసిన వేలిముద్రలను పోల్చి చూస్తారు. తప్పక సాదత్ వేలిముద్రలు కావని గ్రహించి తనని అనుమానిస్తారు.

అహమ్మద్ ఖాన్ గబగబవచ్చి యువరాజ్ ముందు నిలబడ్డాడు. "ఎవరు నువ్వు?" అని కోపంగా గర్జించాడు.

యువరాజ్ కు ముచ్చెమటలు పోశాయి. నిబ్బరించుకున్నాడు. "సాదత్ ని" తొణకకుండా చెప్పాడు.

"కాదు, సాదత్ వేలిముద్రలకు, నీ వేలిముద్రలకు చాలా తేడావుంది. నువ్వు సాదత్ వి కాదు!" అరిచాడు అహమ్మద్ ఖాన్.

"నేను సాదత్ నే!" బుకాయించాడు యువరాజ్. తనిక తప్పించుకోలేడు. వాళ్ళను నమ్మించలేడు. అక్కడున్న వారంతా యువరాజ్ ని విచిత్రంగా చూస్తున్నారు.

"మిస్టర్! బుకాయించి లాభంలేదు. మేము మోసపోకూడదనే మా ఏర్పాట్లను కొనసాగించాం," అంటూ అహమ్మద్ ఖాన్ యువరాజ్ ముఖంమీద ఏదో ద్రవంచల్లాడు. ఆశ్చర్యం! యువరాజ్ ముఖంమీదనుండి రంగు ధారగా కారుతూంది. అయిదారుగురు కల్సి యిరికించి పట్టేశారు. ఒకడు యువరాజ్ ముఖంమీదున్న రంగుని తుడిచాడు.

"మెగాడ్ యువరాజా!!! మీరు చావలేదా...!" ఆశ్చర్యాన్ని అణచుకోలేక అహమ్మద్ ఖాన్, "ఆగాఖాన్!" అని అరిచాడు బిగ్గరగా.

ఆగాఖాన్ బిత్తర చూపులతో అయోమయంగా నిల్చబడ్డాడు. "ఏమిటిది?" ఉరిమాడు అహమ్మద్ ఖాన్ యువరాజ్ ని చూపుతూ. ఆ చూపులో సైనేడ్ మూలంగా యువరాజ్ ఎలా బ్రతికాడన్న ప్రశ్న వుంది.

"ముందుగా మనం యువరాజ్ కు మార్ఫియా యివ్వాలనే అనుకున్నాం. ఆ తరువాత సైనేడ్ యివ్వాలని నిర్ణయించాం. నేను పొరబాటున సైనేడ్ కు బదులు మార్ఫియా యిచ్చినందుకు చింతిస్తున్నాను బాస్. క్షమించండి" ప్రాధేయపడ్డాడు ఆగాఖాన్.

"ఆగాఖాన్! నీ సర్వీసులో యిదే ప్రథమ పొరబాటు. అయినా ఫరవాలేదు. ఈ యువరాజ్ ఈ సముద్రంనుండి బ్రతికి బయట పడలేడు" అహమ్మద్ ఖాన్ గర్జించాడు. ఇరువురు వ్యక్తులు వచ్చి యువరాజ్ ను కదలకుండా పట్టుకున్నారు.

# 17

సూరి డీలక్స్ హోటల్ చేరుకున్నాడు. పరిస్థితి గుర్తించాడు. ఇన్ స్పెక్టర్ కు ఫోన్ చేశాడు.

ఆదరాబాదరా ఇన్ స్పెక్టర్ ధనార్జనరావు హోటల్ డీలక్స్ చేరుకుని సూరిని కల్సుకున్నాడు. సూరి, ధనార్జనరావు కల్సి సాదత్ ని బంధ విముక్తుణ్ణి చేసి, అరెస్ట్ చేశారు.

"ఎవరు నువ్వు?" ప్రశ్నించారు సాదత్ ని.

"పాకిస్తాన్ కు చెందినవాణ్ణి. నన్ను ఇండియా చేరుకొమ్మని ఆర్డర్ వచ్చింది. నేను ఒక సైంటిస్టుని. ఇక్కడకు చేరుకున్నాను. నన్ను టిక్కాఖాన్ అనునతడు కల్సుకున్నాడు.

ఈ రాత్రికి వెళ్ళాలని చెప్పాడు. ఎక్కడికైనది నాకు తెలి యదు,'' చెప్పాడు సాదత్.

ఇంకా ఎన్నో విధాల ప్రశ్నించి చూశారు. క్రొత్త విష యాలు సాదత్ చెప్పలేకపోయాడు.

''ఇపుడు కర్తవ్యం ఏమిటి?'' అడిగాడు ధనార్జనరావ్.

''ఐ. జి. ని, హోం మంత్రిని కల్సుకోవాలి.''

''ఎందుకు?''

''చెప్తాను. రండి,'' అంటూ సూరి బయలుదేరాడు. సాదత్‌ని పోలీసులకు అప్పగించి, ధనార్జనరావూ బయలు దేరాడు.

హోం మంత్రిని, ఐ. జి. ని, కల్సుకున్నారు.

''సార్! యువరాజ్ గారు శత్రువులలో కల్సిపోయి సముద్రంలోకి వెళ్ళి వున్నారు. సముద్రంలో ఎక్కడో శత్రువులు స్థావరం ఏర్పరుచుకుని వున్నారు. యువరాజ్‌కు ప్రమాదం. పైగా భుజంగరావు తయారుచేసిన బాంబుల మూలంగా మనకు ఏ క్షణాన్నైనా ప్రమాదం సంభవించ వచ్చు'' అన్నాడు సూరి.

''ఇపుడేం చేయమంటావు?''

''మీరు నౌకాదళానికి, వైమానికదళానికి ఆదేశాలు యివ్వాలి. సముద్రాన్ని గాలించాలి'' చెప్పాడు సూరి.

''కేవలం ఒక ప్రయివేట్ డిటెక్టివ్ ఆలోచన ప్రకారం ఈ నగరాన్ని అల్లకల్లోల పరచి వున్నాం. యురేనియం మూలంగా నగరానికి ముప్పు అని భీతిగొలిపాం. ఇపుడు దేశా నికి ముప్పు అని, యువరాజ్‌కు అపాయమని సముద్రాన్ని గాలించడం సిగ్గుచేటు,'' విసుక్కున్నాడు ఐ. జి.

''అలా అనకండి. కొన్ని పరిస్థితుల దృష్ట్యా నేను దూఢిగా చెప్పగల్గుతున్నాను. యువరాజ్ సముద్రంలోకి వెళ్ళి వున్నారు గనక శత్రువుల స్థావరం సాగర గర్భంలో

ఉండి తీరుతుంది.”

“లేకుంటే?”

ధనార్జనరావు కలగజేసుకుని బంధితుడైన సాదత్ గురించి చెప్పాడు. అందరికీ నమ్మకం కలిగింది. వెంటనే అడ్మిరల్ ఛటర్జీకి, ఏర్ మార్షల్ అర్జున్‌కు వార్తలు పరుగులు తీశాయి.

సూరి, ధనార్జనరావులు ఏరోడ్రోముకు బయలుదేరారు.

“మనం తెల్సుకో గలమా?” అడిగాడు ధనార్జనరావ్.

“తెల్సుకోవాలి. తెల్సుకోకుంటే యువరాజ్‌కు, దేశానికి ప్రమాదం!” ఆందోళన పడుతూ అన్నాడు సూరి.

ఇద్దరూ హుటాహుటిగా సైనిక విమానాశ్రయం చేరుకున్నారు.

సూరి, ధనార్జనరావులు ఒక సీకింగ్ హెలికాప్టర్‌లో కూర్చుని సముద్రం గాలించ సాగారు. ఆ హెలికాప్టరు జలాంతర్గాములను విధ్వంసం చేయగలది. జలాంతర్గామి సముద్ర గర్భంలో ఎక్కడున్నా యిట్టే పసిగట్టగల యంత్ర పరికరాలు అందులో ఉన్నవి. హెలికాప్టర్ హోరు పెట్టుకుంటూ సముద్రం మీద తిరుగుతూంది.

మరికొన్ని నౌకలు కూడా రంగంలోకి ఉరికి వున్నై. ఫ్రిగేట్ నౌకలు, క్రూజర్, ఏర్‌క్రాఫ్ట్ కారియర్ నౌకలు కూడా హిందూ మహాసముద్రంలో స్వైర విహారం చేస్తున్నవి.

సముద్ర గగన తలమంతా విమాన మోతలతో నౌకల సైరన్‌లతో హడావిడిగా వుంది.

సూరి, ధనార్జనరావులు అతి జాగ్రత్తగా చూస్తున్నారు. బ్రహ్మాండమైన సముద్రం మీద హెలికాప్టర్ పరుగులు తీస్తూంది.

# 18

“మిస్టర్ యువరాజ్! మీరు బ్రతికి బయట పడలేరు. మీ కళ్ళెదుటే భారతదేశాన్ని మసి చేసేస్తాం” అని

సగర్వంగా అంటూ అహమ్మద్ ఖాన్ రేడియో రిసీవర్ని ఆన్ చేశాడు.

"ఆ మనిని మీరు ఆక్రమించు కుంటే మీకు గిట్టడానికి గడ్డీ వుండదు," అసహ్యించు కుంటూ యువరాజ్ అన్నాడు.

యువరాజ్ కు ముచ్చెమటలు పట్టినై. దేవకి ఏం చేస్తూంది? ఆమె అక్కడ ఏమీ చేయలేదు. తనకు లభిస్తే ఆమె సహాయమే లభించాలి. ఆమె సహాయం చేయగలదా? అందుకు శత్రువులు అవకాశం యివ్వగలరా?

అహమ్మద్ ఖాన్ రేడియో రిసీవర్లలో వార్తకోసం ఎదురు చూస్తున్నాడు.

ఇక యువరాజ్ ని ప్రాణాలతో విడువకూడదు. హత మార్చాలి. అందుకు ఆగాఖాన్ పూనుకున్నాడు. పిస్టల్ బయటికి తీశాడు.

బ్రద్దలైన అగ్నిపర్వతంలో పడ్డట్టుగా వుంది. శరీరమంతా ఝలికిపోతూంది. పిస్తోలు పేల్చబోతున్నాడు. తన జీవితం ఆ సాగర గర్భంలో అంత మొందుతుందని కుమిలిపోయాడు.

యువరాజ్ గట్టిగా కళ్ళుమూసుకున్నాడు.

ఆ సమయంలో రేడియో రిసీవర్ వార్తలను ప్రసారం చేయడం ప్రారంభించింది. ఆ వార్తలు పాకిస్తాన్ సేనలు, బంగ్లాదేశ్ లో విచక్షణా రహితంగా అమాయక ప్రజలమీద పిల్లలమీద, కాలేజి విద్యార్థినీ విద్యార్థులమీద సాగించు మారణహోమాన్ని గురించినవి.

అందరి చెవులూ నిక్కపొడుచుకున్నై. ఆగాఖాన్ పిస్తోలును పేల్చలేకపోయాడు. వార్తలను వినడంలో దృష్టిని లగ్నపరచాడు. సియాంగ్ కూడా అదేపని చేశాడు.

పాకిస్తాన్ సేనలు పాశవికంగా బంగ్లాదేశ్ ప్రజల మీద శతఘ్నులను, మోర్టారులను, రాకెట్లను' బాంబులను ప్రయోగించడం రేడియో అనౌన్సర్ చెప్తూంటే అందరూ

ఊపిరి బిగబట్టి వింటున్నారు.

లక్షల కొలది బంగ్లాదేశ్ అమాయక ప్రజలు నిహతులై నారు.

ప్రపంచచరిత్ర ఎరుగని పైశాచికాన్ని నియంత యాహ్యా ఖాన్ సృష్టించాడు. నిరాధీయులైన బంగ్లాదేశ్ ప్రజలు రొమ్ములు విరిచి నిలబడి పోరాటం ప్రారంభించారు. యాహ్యా ఖాన్ సర్వాధికారాన్ని తుడిచి పెట్టడానికి స్వాతంత్ర్య యోధులు షేక్ ముజిబుర్ రెహమాన్ నాయకత్వంలో వెల్లువలా ప్రజా సమూహం వురవళ్ళు త్రొక్కుకుంటూ వెళ్తోంది.

యాహ్యాఖాన్ తన శరీర అవయవాలను తనే నరుక్కుంటున్నాడు.

దేశ చరిత్రలో ఏ నాయకుడూ తమ దేశ ప్రజలమీద మరణాయుధాలను ప్రయోగించినది లేదు...

ఆ జలాంతర్గామిలో యాహ్యాఖాన్ అనుచరులు, ముజిబుర్ రెహమాన్ అనుచరులూ వున్నారు.

బంగ్లాదేశ్‌లో పాక్ సైనికుల దారుణకాండను వింటున్న ముజిబుర్ రెహమాన్ అనుచరులు ఆవేశాన్ని పట్టలేక పోయారు. యాహ్యాఖాన్ని దూషించడం ప్రారంభించారు.

ఆ దూషణలను యాహ్యాఖాన్ అనుచరులు విని వుండలేక పోయారు. వాగ్వివాదం, అల్లరి చెలరేగింది. యాహ్యాఖాన్‌కీ, ముజిబూర్‌కు జేజేలంటూ కుమ్ములాటకు దిగిపోయారు.

కోలాహలం, గందరగోళం అయిపోయింది. జలాంతర్గామి దద్దరిల్లి పోతూంది. యువరాజ్ హడలిపోయి అయోమయుడై పోయాడు. వాళ్ళల్లో వారికి కీచులాట ప్రారంభమైంది.

దేవకిని చెయ్యి పట్టుకుని యువరాజ్ అటు వెళ్ళపోవాడు. ఆగ్రహావేశాలకు గురైన దేశభక్తులు పిస్తోళ్ళతో పేల్చుకోవడం ప్రారంభించారు. ఎవరు ఎవర్ని చంపుతున్నారో అర్థంకావడం లేదు.

పాక్ సైన్యం చేయు కిరాతకంకంటె మరో ఘాతుకం ప్రపంచంలో వుండదు. బంగ్లాప్రజల అవస్థలు చెప్పనలివి కానివి. అందుకు రౌద్రులైన బంగ్లాదేశ్ వారు తిరగబడ్డారు. కాల్పులు ప్రారంభమైనవి.

అందులోవున్న బాంబులు ప్రేలుతాయేమో యువరాజ్ గడగడ వణికిపోతున్నాడు. చాలామంది మరణిస్తున్నారు. చావుకేకలు అరుపులు గందరగోళంగావుంది.

ఆ సమయంలో జలాంతర్గామి నీటిపైకి తేలడం ప్రారంభించింది.

యువరాజ్, దేవకిలు తమ ప్రాణాలను కాపాడుకోడానికి సతమతమవుతున్నారు.

జలాంతర్గామిలోని సిబ్బందిలో చాలామంది మరణించారు. ఎక్కడ చూచినా రక్తం గడ్డకట్టి పడివుంది. శవాలున్నవి. జలాంతర్గామిలో భీతావహం తాండవమాడింది. దేవకి ఆ శవాలను, రక్తాన్ని చూచి హడలిపోయింది.

“హాండ్సప్!” అని వినబడింది. యువరాజ్ గిరుక్కున తిరిగిచూచాడు. అహమ్మద్ ఖాన్ పిస్తోలుతో నిలబడివున్నాడు.

“ఏమిటీ దారుణం?” ఆవేశం, ఆవేదన మిళితమైన స్వరంతో అడిగాడు యువరాజ్.

జలాంతర్గామి సముద్ర జలాల మీదకు తేలబోతూంది.

“దారుణం కాదు, ధర్మమూ కాదు. రాజనీతి!” చెప్పాడు అహమ్మద్ ఖాన్.

“నీ రాజనీతి పాడుగానూ, ప్రజలను హతమార్చి మట్టినా పరిపాలించబోతారు! పది నిముషాలముందు వరకూ సోదరులుగా వుండిన మీరు ఈ జలాంతర్గామిలో వున్న బంగ్లాదేశ్ వీరులను పొట్టన పెట్టుకున్నారు. దుర్మార్గుడా...మీబోటి కిరాతకులు, పచ్చి నెత్తురు త్రాగు కసాయివాళ్ళు బ్రతుకు ఈ భూమ్మీద బ్రతకడం కంటె చావడంమేలు. చంపు,”

అని వుద్రేకంతో వూగిపోయాడు యువరాజ్. తన ప్రక్క నుండిన దేవకి ఎప్పుడు కనుమరుగైనదో ఆయనకు తెలియదు.

ఇపుడు జలాంతర్గామి పూర్తిగా నీటిమీదకు వచ్చేసింది. పైకి తేలిన జలాంతర్గామిని పసిగట్టిన కొన్ని విమానాలు, హెలికాప్టరు గగన తలంలో చుట్టుముట్టినై. జలాంతర్గామి చుట్టూ మైలుదూరంలో సముద్రజలాలమీద బాంబులను వేయడం ప్రారంభించినై. బాంబులు పడ్డప్పుడు నీరు వువ్వెత్తున లేస్తున్నది.

అహమ్మద్ ఖాన్ బాంబుల ప్రేలుళ్ళను చూస్తూ భీతి చెందిపోయాడు. అలా చూస్తూన్నాడు. ఆ అదనులో యువ రాజ్ నీటిలోకి దుమికేశాడు. అహమ్మద్ ఖాన్ తృళ్ళిపడి యువరాజ్ దూకినవైపు పిస్తోలు గురిపెట్టి థాం, థాం అని పేలుస్తున్నాడు.

నీట మునిగిన యువరాజ్ పైకి తేలకుండా వూపిరి బిగపట్టి శక్తి కొలదీ చేపలా ముందుకెళ్లుతున్నాడు. పైకి తేలితే అహమ్మద్ ఖాన్ పిస్తోలు పేలుస్తాడని తెల్సు. ఈదుతున్నాడు. భయంగా వుంది. ఏ సముద్ర జంతువైనా తనని పొట్టన పెట్టుకుంటుందేమో! భయంగా వుంది. చాలా దూరం వెళ్ళి పైకి లేచాడు.

ఆశ్చర్యం! హెలికాప్టర్లలో నుండి, విమానాల నుండి పారాట్రూప్ దళాలు సముద్ర జలాలలోకి దిగుతున్నవి. సైనికు లందరూ నేర్పుగా పారాచూట్లను నీటిలో వదిలేసి జలాంతర్గామి వైపు ఈదుతున్నారు. అంతలో ఆ ప్రదేశానికి భారత నౌకాదళానికి చెందిన నౌకలూ చేరుకున్నవి.

యువరాజ్ ఈదుతూ చేతులూపాడు. ఆయనకు తిన్నగా ఒక హెలికాప్టర్ ఆకాశంలో ఆగింది. అందులో నుండి నిచ్చెన దించబడింది.

ఆ హెలికాప్టర్‌లో సూరి, ధనార్జనరావు లున్నారు.

## 19

జలాంతర్గామిలో దేవకి యురేనియాన్ని చేతికందుకుంది. రాకెట్ ప్రయోగ స్థలంలో కాళికాదేవిలా నిలబడింది. అహమ్మద్ ఖాన్ రాకెట్లను ప్రయోగించడానికి ఆయత్తుడై వచ్చాడు.

"అడుగు ముందుకు వేశావా... ఈ యురేనియం కలుపుతాను. భస్మమై పోతాము." అని హుంకరించింది. ఆమె కోపాన్ని చూచిన అహమ్మద్ ఖాన్ అడుగు ముందుకు వేయలేకపోయాడు. ఆమె అన్నంత పనీ చేసేటట్టుంది. నివ్వెరపోయాడు.

"కలుపు. కలిపావంటే నీ భర్త తయారుచేసిన బాంబులన్నీ పేలిపోతాయి" అంటూ ముందుకు వచ్చాడు.

దేవకి వళ్ళు జలదరించి పోయింది. భయపడ్డట్టు నటించింది. అహమ్మద్ దగ్గరయ్యాడు.

యురేనియం ఒక ముద్దను ఆతని ముఖం మీదకు విసిరింది. మాంచి దెబ్బ తగిలింది. ఇంకో ముద్దనూ విసిరింది. అహమ్మద్ ఖాన్ తల పగిలింది. క్రిందపడ్డాడు బాధను తట్టుకోలేక.

అంత బాధ పడుతూనే అహమ్మద్ ఖాన్ యురేనియం ముద్దలను అందుకుని, కలపబోతున్నాడు.

అతని ఘాతుకానికి దేవకి నిలువెల్లా వణికి పోయింది. విరుచుకు అతనిమీద పడిపోయింది. అహమ్మద్ ఖాన్ యురేనియాన్ని కలపకుండా చేయడానికి రక్కింది. తన్నింది. కొరికింది.

ఆ సమయంలో భారత సేన చుట్టు ముట్టేసింది.

## 20

"బాంబులన్నిటినీ సురక్షితంగా మన సైన్యం వశపరచుకుంది. జలాంతర్గామిని, రాకెట్లను కూడా స్వాధీన పరచుకుంది," చెప్పాడు ధనార్జనరావు.

దేవకి, భుజంగరావు పాదాలమీద పడిపోయి విషాదంగా

కోదిస్తూ, "నన్ను క్షమించండి. నే నిక నీతిబాహ్యమైన పనిని ఎన్నటికీ చేయను" ప్రాధేయపూర్వకంగా అడుగుతూంది.

"దేవకీ! ఏడ్వకు. తప్పు తెల్సుకున్నవారు జ్ఞానులవుతారట. పిచ్చిదానా. నీ స్వభావం నాకు బాగా తెల్సు. మనిషికి తన మనసుని అదుపాజ్ఞలో వుంచడం సులభతరమైన పనికాదు," అంటూ ధైర్యమిచ్చాడు భుజంగరావు.

భుజంగరావు విశాల హృదయానికి అక్కడున్న యువరాజ్, సూరి, ఐ. జి, కమీషనర్ ఆఫ్ పోలీస్, హోంమంత్రి తదితర వున్నతాధికారులు గర్వపడ్డారు.

"మిస్టర్ భుజంగరావ్! అణ్వస్త్రాలు అశాంతికి మూలమని మానవకులం తెలుస్తూంది. మీరెందుకు తయారుచేశారు?" అడిగాడు హోంమంత్రి.

"చాలా దేశాలు అణ్వస్త్రాలను తయారు చేసుకుని వున్నై. మనకు తప్పని సరివుండాలి. లేనిచో బీదదేశమని, సాంకేతిక రంగంలో వెనుకబడ్డ దేశమని ఎంచబడుతుంది. నా మాతృదేశం అలా వుండకూడదని నిర్మించాను," చెప్పాడు భుజంగరావు.

"మీ దేశభక్తి అపారమైనది. మిమ్మల గురించి కేంద్రప్రభుత్వానికి తెలియచేశాను," అన్నాడు రాష్ట్ర హోం మంత్రి.

"శత్రువులను మట్టుపెట్టిన యువరాజుకు నాజోహార్లు" అన్నాడు ఐ. జి.

"నాకుకాదు దేవకికి జోహార్లు అర్పించాలి. ఆమె సమయస్ఫూర్తి, ధైర్యం, సాహసం లేకుండా వుండి వున్నట్లయితే నేను, శత్రువులు, బాంబులు మీకు అంది వుండే వాళ్ళము కాదు"

అంటూ జరిగిన విషయాలు చెప్పాడు యువరాజ్.

—: అయిపోయింది :—

# ప్రత్యర్థి కావాలి!

మల్లాది వెంకటకృష్ణమూర్తి

చిన్నప్పటినుంచీ పోలీస్ వుద్యోగం అంటే నాకెంతో మోజు. పెద్దయి ఉద్యోగం చేసేటప్పుడు ఏలాగయినా పోలీస్ ఇన్‌స్పెక్టర్ ఉద్యోగమే సంపాదించాలనే కోరిక నాకు చిన్ననాటినుంచీ వుంది.

వయసుతోపాటుగా ఆ కోరిక కూడా పెరిగింది నాలో.

అలా పెరగడానికి కారణం బహుశ నాకు ఆ వృత్తి ఎంతో ఆకర్షణీయంగా, గ్లామరస్‌గా కనబడటమే. అలా కనపడటానికి కారణం నేను చూసిన ఇంగ్లీష్ సినిమాలు, చదివిన డిటెక్టివ్ నవలలు అనేకం.

ఇంగ్లీష్ సినిమాలలో హంతకులని చివరకి తుపాకులతో,

వేగంగా కారు నడుపుతూ వెంటపడి పట్టుకునే పోలీస్ ఆఫీ సర్లు నాకు ఆదర్శప్రాయంగా వుండేవాళ్ళు.

కౌబాయ్ సినిమాలయితే ఇంకా వుత్సాహంగా చూసే వాణ్ణి. 'షెరీఫ్' అంటారు దాంట్లో పోలీస్ ఉద్యోగివంటి వ్యక్తిని.

గుర్రాలమీద షెరీఫ్ సాహసాలు 'సెలూన్'లో అతను మెరుపులా పిస్తోలు పేల్చడం వగైరాలు నాకు, ఎంతో సాహసంగా కనిపించేవి ఎర్లీటీన్స్‌లో. ఇక డిటెక్టివ్ నవ లలు అంటే అమిత ఆసక్తి.

అందుకే గ్రాడ్యుఏషన్ పూర్తవగానే నేను ఉద్యోగాల వేట ప్రారంభించేటప్పుడు మొట్టమొదటిసారిగా క్లరికల్ జాబుకి కాకుండా, పోలీస్ సబ్ ఇన్‌స్పెక్టర్ ఉద్యోగానికి దరఖాస్తు పెట్టాను.

ఇంట్లో చాలామంది ఇష్టానికి వ్యతిరేకంగా ఆ ఉద్యో గంలో చేరాను, ఓ చిన్న సైజు రికమండేషన్‌తో.

నాన్నకి అసలు ఇష్టంలేదు. రోడ్డుమీద చేతులతో సౌంజ్ఞలు చేస్తూ నిలబడాలి అని తిట్టేవారు ట్రాఫిక్ పోలీస్ ఇన్‌స్పెక్టర్ని దృష్టిలో వుంచుకుని.

దొంగలచేత అనవసరంగా తన్నులుతినాలి అనేది అమ్మ. నన్ను పూర్తిగా సపోర్ట్ చేసింది నా చెల్లెలు మాత్రమే. 'ఎంచక్కా సినిమాల్లో, నవలల్లోలాగా నువ్వుకూడా హీరో లాగా బ్రతకచ్చు అన్నాయ్,' అన్నది.

తమ్ముడు సైకిల్ డబుల్స్ కేసుల్లో డబ్బు సంపాదించ వచ్చనే దురభిప్రాయంతో సపోర్ట్ చేసాడు.

చివరికి నా ఇరవై నాలుగోఏట సబ్-ఇన్‌స్పెక్టర్ అనిపించు కున్నాను, నా కోరిక నెరవేరిందనే తృప్తితో.

కొత్తల్లో హుషారుగావున్నా, రానురాను నా వృత్తి మీద వుత్సాహం తగ్గిపోయింది నాలో. సినిమాల్లో, నవలల్లో

ప్రేక్షకులకు, చదువరులకు దొరికే థ్రిల్ నా నిజజీవితంలో, వృత్తిలో అరుదుగా లభించేది.

నన్నెలాంటి సాహసం చెయ్యనియ్యకుండా ఆపేందుకు చట్టంతోపాటు నాపైన ఇన్‌స్పెక్టర్ అనబడే మరోపదార్థం కూడా వుండేది. ఏమైనా కేసుల్లో నా ఆలోచనలు వెల్లడిస్తే అనేవాడు వెంటనే—

"ఇది సినిమా కాదు, నవలా కాదు. కేసోయ్–కేస్. ఎ కోల్డ్ బ్లడెడ్ మర్డర్. నన్ను చూడనీ."

అంతేకాదు. నే నూహించిన ప్రపంచానికి, నా వృత్తికి చాలాచాలా దూరం అని గ్రహించడానికి ఎక్కువకాలం పట్టలేదు నాకు. ఇక్కడ 'న్యాయం' తక్కువ, న్యాయం కోసం పాటుపడే పదార్థాలు వున్నా.

కోర్టు. ఆ కోర్టులో సాక్ష్యం. ఆ సాక్ష్యాన్ని పడగొట్టే లాయర్లు. నేరస్థుల పరపతి. నేరస్థుల డబ్బు–నేరస్థుల అధికారం. ఇలా చాలాచాలా అడ్డం వస్తాయి న్యాయం జరగకుండా వుండేందుకు.

మర్డర్ కేసులు తక్కువ. స్టీల్ సామాన్ల దొంగతనాలు, సైకిల్ దొంగతనాలు, బట్టల దొంగతనాలు, జేబు దొంగతనాలు అన్నీ ఇలాంటి చచ్చు నేరాలే నేను చూసేది.

ఇదంతా ఓ రెడీమేడ్ ప్రపంచం. దొంగతనం జరిగిందని రిపోర్ట్ అందగానే, మా దగ్గరవుండే ఆల్బంలో నేరస్థుల ఫోటోలు చూపిస్తే దొంగని చూసినవాళ్ళు గుర్తుపట్టడం, వాడి ఆచూకీ మాదగ్గర రికార్డుల్లో వుంటుంది గనక వెంటనే పట్టుకోవడం ఓ పద్ధతి.

లేదా, ఆ దొంగతనం జరిగిన పద్ధతి ప్రకారం, ప్రదేశాన్నిబట్టి దొంగ ఎవరో మా రికార్డుల ద్వారా నిర్ణయించి, ఓ లిస్ట్‌లోని ఆ దొంగని పట్టుకుని, తన్ని, దొంగతనం చేయబడ్డ వస్తువులు స్వాధీనం చేసుకోవడం మరో పద్ధతి. ఒకో

సారి పప్పులో కాలేస్తూంటాం కూడా.

ఇలా అనేక పద్ధతులు. మాకు పరిమితమయిన అనేక విషయాలు. ప్రతిభ, స్వయంకృషి తక్కువ. ఉన్నా పైకి కనపడనివ్వకూడదు.

పిస్తోళ్ళు, మారువేషాలు, ఖరీదైన హోటళ్ళు, వెంటాడటాలు, గుర్రాలు, కార్లు అన్నీ కేవలం ఫిక్షన్‌లోమాత్రమే.

నా ఉద్యోగంలో వుండి నేను మా కుటుంబానికి చేసిన మేలు ఒకటే. తమ్ముడుగానీ, వాడి స్నేహితులుగాని డబుల్స్ వెళుతున్నప్పుడు పట్టుబడ్డా, సైకిల్‌కి లైటు లేకుండా పట్టుబడ్డా నా దగ్గరకువస్తే వాళ్ళకి సహాయం చేయడం.

సంవత్సరాలు దొర్లించాను రొటీన్‌తో. ఏదో ట్రయినింగ్ ఇచ్చారు డిటెక్టివ్ ట్రయినింగ్ స్కూల్లో. ఆ ట్రెయినింగ్ పీరియడ్ మాత్రం కొద్దిగా వుత్సాహంగా అనిపించింది.

హైదరాబాద్‌లో పోలీస్ మ్యూజియమ్ చూసే అవకాశం లభించింది. ఆ మ్యూజియంలో అనేక రకాల ఆయుధాలు, కొన్ని టెక్నికల్ మేటర్స్‌కి సంబంధించిన విషయాలు తెలుసుకునే అవకాశం లభించింది. అంతకంటే నా వృత్తిలో చెప్పుకోదగ్గ విషయాలేమీ లేవు.

ట్రెయినింగ్ అయ్యాక కొంతకాలానికి ఇన్‌స్పెక్టర్ పదవికి ప్రమోట్ చేస్తారు నన్ను. చాలా సంతోషపడ్డాను. నా ప్రతిభ చూపించే అవకాశం కలగచ్చని, నా కోరికలు తీర్చుకోవచ్చనే ఆశ కలిగింది.

ఓ గ్రామానికి బదిలీ చేశారు నన్ను.

రావులపాలెం చిన్న గ్రామమే. అయిదువేల మందిని మించిన జనాభాలేని ఆ గ్రామంకి నన్ను బదిలీ చేసినప్పుడు కించిత్ విచారం కలిగింది.

అంత చిన్న గ్రామంలో ఏం చెయ్యగలను నేను? సైకిల్ కేసుల్లాంటివి తప్ప ఇంకేమీ దొరకవు. గోళ్ళు గిల్లుకుంటూ

అపరాధ పరిశోధక పత్రికలు, నవలలు చదువుకుంటూ, యూనిఫాం నలగకుండా కూర్చోవడం తప్ప ఏం చెయ్యగలను?

హైద్రాబాద్ లాంటి నగరంలో, కనీసం విశాఖలాంటి పట్నం అయినా బాగుండేదికదా?

అయిష్టంగానే బయలుదేరాను రావులపాలేనికి, ముప్పై అయిదేళ్ళ నేను, కొద్దిపాటి సామానుతో.

భారతదేశంలోని ప్రతీ అయిదు గ్రామాలలో ఒక గ్రామానికి ఎలక్ట్రిసిటీ సౌలభ్యం వుందని చదివాను ఎక్కడో. రావులపాలేన్ని మినహాయిస్తే మరే నాలుగు గ్రామాలలో బహుశ ఎక్కడో విద్యుత్ సౌలభ్యం వుండివుండగు అనుకున్నాను.

పూర్తిగా నేననుకున్నంత కుగ్రామంకాదు రావులపాలెం. పెంకుటిళ్ళు, రెండు మూడు మేడలు, ఓ పర్మనెంట్ సినిమాటాకీస్, మంచి ఫర్నిచర్ తోవున్న కాఫీ హోటల్ లాంటి కనీసపు అవసరాలు తీర్చేవన్నీ వున్నాయి. కొంచానికి కొంచెం నయమనుకుని తృప్తిపడ్డాను.

నన్ను రిసీవ్ చేసుకోడానికి హెడ్ కాన్‌స్టేబుల్, రైటర్ వచ్చారు. నా గురించిన వివరాలు ముందే సేకరించారు, బ్రహ్మచారిననీ, ఒంటరిగా వస్తున్నాననీ.

నన్ను సంప్రదించకుండానే, నాతో నిమిత్తం లేకుండానే హెడ్ కాన్‌స్టేబుల్ దత్తు నాకోసం అన్ని ఏర్పాట్లు చేసివుంచాడు.

ఓ చిన్న పెంకుటిల్లు సిద్ధంచేసి పెట్టాడు నాకోసం. రోజూ ఉదయం, సాయంత్రం ఇల్లు శుభ్రంచేయడానికో పనిమనిషిని, ఇంకా కరణంఇంటినుంచి రెండుపూటలా భోజనాన్ని, కాఫీ హోటల్ నుంచి టిఫిన్, కాఫీలు వగైరాలు నాకు సక్రమంగా

సమయానికి అందేలా చేసాడు.

తృప్తిపడ్డాను దత్తు ఏర్పాట్లకి. నా తృప్తిని దాచుకోకుండా ప్రదర్శించాను కూడా, భుజంతట్టి. చాలామంది నన్ను —కొత్త పోలీస్ ఉద్యోగిని—చూడటానికి వచ్చారు.

పోలీస్ స్టేషన్ నుంచి ఇంటికి అయిదు నిమిషాల కాలినడక. కేవలం తాలూకా హెడ్ క్వార్టర్స్ కావటంవల్ల మట్టిరోడ్డే. తారురోడ్ పడలేదు ఇంకా.

మొట్టమొదటిరోజు పోలీస్ స్టేషన్ లో, నా సీట్ లో కూర్చున్నాక అడిగాను దత్తుని—

"ఇదివరకటి ఇన్ స్పెక్టర్ ఎక్కడికి బదిలీ అయాడు?"

"పైకిసార్."

"ఎక్కడికి?" అడిగాను ఆశ్చర్యంగా.

"పైకిసార్. స్వర్గమో, నరకమో తెలియదుగాని పైకి."

## 2

నేను ఉద్యోగంలో చేరినప్పటినుంచీ థ్రిల్ కోసం, ఏక్షన్ కోసం, అన్యాయాన్ని ఎదిరించడంకోసం, నాకు సరయిన వుజ్జీ కోసం ఎదురుచూస్తున్నాను.

దొరికాడు.

చివరకి, ఎట్ లాస్ట్ దొరికాడు నాకు సమవుజ్జీ.

కాని రావులపాలెంలో దొరుకుతాడని నేను కలలోకూడా వూహించలేదు.

వాడిపేరు గంగులు!

గంగులు దుర్మార్గుడు. హంతకుడు. రాక్షసుడు.

క్రూరత్వానికి మారుపేరు గంగులు.

ఆ గ్రామానికి బదిలీ అయిన నాలుగోరోజు కలిసాడు గంగులు నన్ను, భోజనానికి ఇంటికి తిరిగి వెళుతూంటే.

పోలీస్ ఠానాకి కావాలంటే పంపుతారు భోజనం. కాని

లంచ్ టైంలో నయినా అక్కడనుంచి బయటపడాలనీ, కాలి నడక మంచిదనీ ఇంటిదగ్గరే ఏర్పాటు చేసుకున్నాను భోజనం.

వెళ్తుంటే ఎదురొచ్చాడు గంగులు. దారికి అడ్డంగా నిలబడి నవ్వుతూ అడిగాడు యూనిఫాంలోని నన్ను చూసి-

"నువ్వేటగదా కొత్తగా వచ్చిన ఇన్‌స్పెక్టర్?"

గంగులిని గూర్చి ముందరే వినివుండటంవల్ల, అతని ఫోటోని ఆల్బంలో చూసివుండటంవల్ల, నేను భయపడలేదు. అబ్బురపడలేదు ఎంతమాత్రం.

తల పంకించాను గంగులుని చూసి. భీకరంగా వున్నాడు. నిలువెత్తు విగ్రహం. కండలు తిరిగిన శరీరం అతను చిన్నప్పటినుంచీ చేసిన కసరత్తుకు ప్రతీకగావుంది. నల్లటి మొహం నిండా అందవికారంగా కనిపించే మొటిమలు.

ఏ పదిహేను, ఇరవై రోజుల క్రితమో పగిలిన అతని కింద పెదవిమీద గాయం కొంచెం కొంచెం మానుతోంది.

"నువ్వేనా గంగులు?" అడిగాను గంగులు అన్న పదం వత్తి పలుకుతూ.

"అవును. ఇస్పేతాస్ లెక్క ఇత్తె ఎగరేస్తాను, నిన్ను కోపంవస్తే. చాలా మందిని చూసాను నీలాంతాల్లని. జాగ్రత్తగా వుండు. తెల్సా?"

గంగులు కంఠంలో మృదుత్వం లేదు. కరకుతనం వుంది బాగా.

గంగులుకు 'ట'అక్షరం పలకడానికి నోరు తిరగదని నాకు దత్తు చెప్పిన సంగతి గుర్తుకు వచ్చింది. 'ట' అక్షరం బదులు 'త' పలుకుతాడు గంగులు, చిన్న పిల్లవాడిలాగా.

"నీలాంటి వాళ్ళని నా సర్వీస్‌లో ఇంత మందిని చూసాను" అన్నాను నా కుడి చేత్తో గంగులు తలమీది జుట్టు పట్టుకుని వదిలి. ధైర్యమే చేశాను.

బిగ్గరగా నవ్వాడు గంగులు. కొంచెంసేపు అలా నవ్వి గబుక్కున నవ్వు ఆపి గబగబా రెండు చేతుల్తో తన చొక్కాకి వున్న బటన్స్ విప్పి, చొక్కా వెనుక వున్న బనియన్ లేని గుండెని చూపించాడు నాకు.

"పోయినసారి పోలీస్ ఇన్స్పెక్టర్ తో జరిగిన కొట్లాటలో తగిలిన దెబ్బ ఇది" కొద్దిగా గర్వంగా చూపించాడు తన గుండెలమీద మానుతున్న గాయాన్ని.

ఛాతీమీద కుడివైపు కొంచెం క్రిందగా మానుతున్న గాయం, రెండంగుళాల పొడవున పడ్డ కుట్లువంక పరిశీలనగా చూసాను నేను.

మళ్ళీ చొక్కాకి గుండీలు పెట్టుకుని అడిగాడు గంగులు నా వంక గర్వంగా చూస్తూ—

"నీ కేమయినా ఇలాంటిది ఎప్పుడయినా జరిగిందా? చూపించు."

"నాది మొండి ప్రాణం తెలుసా?"

హెచ్చరికగా కనుబొమలు ఎగరేసాడు గంగులు.

"చూడు గంగులూ. నా సంగతి తొందర పనిమీద వెళ్తున్నప్పుడు ఇలా నడి బజారులో చెప్పటం నాకు బాగుండదు. తీరికగా పోలీస్ స్టేషనులో చూపిస్తాను. నిన్ను పట్టుకున్నప్పుడు నీ అనుమానాలన్నీ తీర్చుకుందువు గాని."

గంగులు ముందుకు, మీదమీదకి రాబోయాడు.

"ఖబడ్దార్."

గొంతు చించుకుని గట్టిగా, అధికార పూర్వకంగా అరిచాను నేను.

ట్రిక్ ఆఫ్ ది ట్రేడ్.

నా అరుపు విని కొద్దిగా వులిక్కిపడినట్లుగా కనపడ్డాడు గంగులు. తమాయించుకుని రెండడుగులు వెనక్కి వేసి తగ్గాడు.

నేను గంగులుని పట్టించుకోనట్లుగా, గబగబా అంగలు వేశాను ఇంటి వైపు. ఆ విధంగా ముఖాముఖి కలుసుకున్నాం నేనూ, నా ప్రత్యర్థి మొదటి సారిగా. మా మొదటి కలయిక కలో, నేను ఘటికుణ్ణనీ అందరిలాంటి వాడిని కాననీ గంగులు అనుకునేలా ప్రవర్తించాను వీలయినంత వరకూ.

ఆ రోజునుంచి గంగులు నాకు సమస్య అయ్యాడు. ఆలోచించ తగ్గ, పరిష్కారం వెంటనే ఆలోచించ తగ్గ సమస్యగా మారాడు గంగులు నాకూ, నా వృత్తికి.

# 3

"ఎలా జరిగింది?" అడిగాను కుర్చీలో వెనక్కి వాలి తీరికగా.

"నిజంగా చాలా ఘోరం సార్. పొడిచేసాడు"అన్నాడు దత్తు చాలా జాలిగా.

"ఎవరు? ఎప్పుడు?? ఎట్లా???" అడిగాడు.

"రెండు నెలల క్రితం,నడి రోడ్డుమీద, మిట్టమధ్యాహ్నం ఒంటరిగా భోజనానికి ఇంటికి పోతుంటే ఇద్దరితో వచ్చాడు సార్ కత్తితో. ఆయనతో వాగ్వివాదం అయింది కొంతసేపు. బాగా తాగివున్నాడు గంగులు. పొడిచాడు ఛాతీలో. ఆయన ఎదురుతిరిగారు. గంగులుకి కూడా బలంగా కత్తి పోటు తగిలినా ప్రమాదకరం కాలేదు. ఆయన అక్కడి కక్కడే స్పృహతప్పారు. పెద్దాసుపత్రికి, పట్నానికి తీసుకు వెళ్తూంటే దారిలో మరణించారు పాపం. చాలా మంచివారు ఆయన."

దత్తు కంఠం బాధతో వణికింది.

"ఎందుకు పొడిచాడు?"

"ఇన్స్పెక్టర్ రెయిడ్ లో నాటుసారా పట్టుకుని, పూర్తిగా స్వాధీనం చేసుకుని కేస్ బుక్ చేసారు. ఆ కోపంతో

ఖూనీ చేసాడు. గంగులుకు ఎదురుతిరిగే వాళ్ళే ఎవరూ లేరు చుట్టు ప్రక్కల. అదీ వాడి ధైర్యం."

"మరి గంగులుకు శిక్ష పడలేదా?"

"లేదు. పుణ్యమూర్తి వున్నంతకాలం గంగులుకు ఏ ఆపదా రాదు.'"

"పుణ్యమూర్తెవడు?"

"ఈ వూళ్ళో యిద్దరు దుర్మార్గులున్నారు సార్. ఒకడు గంగులు. రెండు ఆ గంగులుని ఆడించే మేకతోలు కప్పుకున్న పులిలాగా, పెద్ద మనిషిలాగా అగుపించే పుణ్యమూర్తి."

"ఏం చేస్తాడు?" అడిగాను.

"ఆ పుణ్యమూర్తికి" అని గొంతు తగ్గించి, "నాటుసారా వ్యాపారం, ఓ బ్రోతల్ హౌస్ వున్నాయి సార్ వూరి బయట" అని చెప్పాడు. ఓసారి వూపిరి పీల్చుకుని మళ్ళీ చెప్పసాగాడు దత్తు:

"ఆ రెంటికీ రక్షణగా గంగులుని డబ్బుతో కొనుక్కున్నాడు. పుణ్యమూర్తి చెప్పే ప్రతీ మాట వేదవాక్కు గంగులుకు. అతనెంత చెప్తే అంతే. మంచా, చెడా అని ఆలోచించకుండా చేసేస్తాడు, ఓ రెండు మూడు నాటు సారా సీసాలు తాగి."

వింటూండి పోయాను.

"ఇన్‌స్పెక్టర్ ఓ రెయిడ్‌లో నాటుసారా బట్టీలని పట్టుకుని పుణ్యమూర్తిని కోర్టుకు ఎక్కిద్దామని ప్రయత్నించాడు. ఒకరిద్దరు అప్రూవర్స్‌గా మారారు కూడా, వాళ్ళవైపు వాళ్ళు. ఈలోపలే చంపబడ్డాడు దారుణంగా."

"ఆ కేస్ ఏమయింది?"

"ఇన్‌స్పెక్టర్ హత్య కేసు, సారా కేసు మాఫ్ చేయించాడు పుణ్యమూర్తి తన పలుకుబడినంతా ఉపయోగించి."

"అయితే పుణ్యమూర్తే నిజంగా" అన్నాను ఈస డింపుగా.

"అప్పటినుంచి వాళ్ళ ప్రాబల్యం, ముఖ్యంగా గంగు లంటే భయం అందరికీ ఎక్కువయి పోయాయి. మకుటంలేని రాజుల్లాగ వెలిగిపోతున్నారు ఇద్దరూ."

"వీళ్ళందరి అంతు చూస్తేనేగాని నాకు తృప్తి వుండదు. కర్తవ్య నిర్వహణలో ఓ ప్రభుత్వోద్యోగిని, అంగులో రక్షణోద్యోగిని నడి రోడ్డుమీద పొడిచి చంపినా చేతులు కట్టుకుని కూర్చున్న ఈ న్యాయ స్థానం, ప్రభుత్వం...ప్చ్. చంపబడ్డ అతని ఆ ఆత్మకి శాంతి తప్పక కలిగిస్తాను" అన్నాను దృఢంగా నేను.

"సార్. చూసీ చూడనట్టుగా కళ్ళు మూసుకుని వూరుకోక పోతే ఇక్కడ మనకేం అయినా ఆదుకునే దిక్కు లేదు" అన్నాడు దత్తు భయంగా.

"అన్యాయాన్ని అరికట్టడమే మన ధర్మం — ఏ విధంగా నైనా సరే. బై ఎనీమీన్స్" అన్నాను నేను స్థిరంగా.

దత్తు మాట్లాడలేదు.

"దొంగ సారా, ఆ బ్రోతల్ హౌస్ ఎవరు ఉపయో గిస్తారు?" అడిగాను నేను కాస్సేపాగి.

"ఇక్కడ దగ్గరే వున్న కొండ ప్రాంతంలో రాళ్ళు కొట్టే కూలి జనం తాగుతారు రోజూ సాయంత్రం చేరి. వాళ్ళలో కొందరు గంగులుకి సహాయపడ్డారు కూడా అవసరం వస్తే ఏ విషయంలోనైనా, ఓ చెయ్యి వెయ్యడానికి."

"ఎంత మంది వుంటారు?"

"అయిదు వందల లోపు. నాలుగు వందల పైన, ఆడా మొగా కలిసి."

"ఆ రాళ్ళను ఏం చేస్తారు?"

"పుణ్యమూర్తి లారీల లెక్కన అమ్ముతాడు పట్నంలో

ఇళ్లు కట్టుకునే వాళ్ళకి."

"రాయల్టీ కడుతున్నాడా ఆ కొండకి?"

"నాకు సరిగా తెలియదు సార్ ఆ సంగతి."

"హోటల్ హౌసెస్?"

"రెండు రకాలున్నాయి సార్ దాంట్లో."

"ఏమిటో అవి?"

"ఒకటి లోక్లాస్ వాళ్ళకోసం. ఆ కూలీలు, మరి కొందరి కోసం ఓ పాతికమందిదాకా కొండజాతి వాళ్ళని బలవంతంగా వుంచుతున్నాడు."

"రెండో రకం!"

"పూర్తిగా హైక్లాస్ వాళ్ళు. పట్నంనుంచి తెప్పిస్తాడు. వాళ్ళు ఓ పాతికమంది తక్కువలేకుండా వుంటారు. ఇంగ్లీషు మాట్లాడుతారు. గౌన్లు స్కర్టులు వేసుకుంటారు. మామూలు నాసిరకం వాళ్ళని చేరనివ్వరు దగ్గర."

"మరి వాళ్లు ఎవరికోసం ఈ రావులపాలెంలో?"

"పట్నంనుంచి వస్తూంటారు ఖరీదయిన వీళ్ళకోసం పెద్ద వాళ్లు. ముఖ్యంగా శని, ఆదివారాలలో బాగా జోరుగా వుంటుంది అక్కడ. వందదాకా వసూలు చేస్తారుట రాత్రికి."

"ఎలాంటివాళ్లు అక్కడికి వచ్చేది?"

"పెద్దపెద్ద వ్యాపారస్థులు, నెలకి వెయ్యిపైన సంపాదించే ఉద్యోగులు, ఒక్కొక్కసారి మంత్రులలాంటివాళ్ళు కూడా వస్తారని చెప్పుకోగా విన్నాను."

"రావులపాలెం వీకెండ్ స్పాట్ అన్నమాట పెద్ద వాళ్ళకి" అన్నాను నవ్వుతూ.

"అవునుసార్. అలాంటివాళ్ళ అండదండలు వున్నాయి పుణ్యమూర్తికి. జిల్లా జడ్జి, కలెక్టర్ పుణ్యమూర్తి జేబులో మనుష్యులయితే ఇంక వాడికి కొరతేముంది?"

అయిదు నిముషాలసేపు ఆలోచించిన తర్వాత అన్నాను.

"పుణ్యమూర్తిని చూడాలి నేనోసారి."

"దేనికి సార్?"

"ఎవరిసత్తా ఎంతో తేల్చుకుందామని. మనిషినిచూసి మాట్లాడితే ఎలాంటివాడో, ఎంతదాకా భయపడకుండా ఎలాంటి పనయినా చేయగలడో తెలుస్తుంది."

"అలాగే సార్. నేను వెళ్ళి చెప్పనా మీరు వస్తున్నట్లుగా?" అడిగాడు.

తలూపాను. కొద్దిగా సైకలాజికల్ గా భయపడతాడు కబురు పంపి వస్తున్నానంటే. సైకలాజికల్ గా నేరస్థులలో భయం, నేనంటే భయం కలిగేలా చెయ్యాలనుకున్నాను.

"ఓసారి నా సర్వీస్‌లో ఏమయిందో తెలుసా?" అడిగాను దత్తుని.

"ఏమిటిసార్?" అడిగాడు.

నేను చెయ్యాలనుకున్న సాహసాలు అంతదాకా చెయ్యలేకపోయినా అబద్ధాలతో తృప్తిపడే అవకాశం, ఆ అబద్ధాలు అవసరం అయిన అవకాశం వస్తే వదలదలచుకోలేదు నేను.

"ఓసారి బేంక్‌లో లక్షరూపాయల దొంగతనం జరిగింది. స్టేట్ బ్యాంక్‌లో ననుకుంటాను. వైర్‌లెస్‌లో చెప్పారు నాకు. నేను అప్పుడు పోలీస్ మొబైల్ వేన్ యూనిట్లో వున్నాను. ఆ దొంగ పారిపోతున్న కారు నంబరు చెప్పారు నాకు. వెళ్ళే మార్గం కూడా చెప్పారు. వెంటనే బయలుదేరాను మరో ఇద్దరు కానిస్టేబుల్స్‌తో. దొరికింది ఆ కారు వెంటనే.

ఆ కారు వెంటపడ్డాను.

దొంగ దగ్గర తుపాకులున్నాయి. మా కారుమీదకి పేల్చాడు నాలుదయిదుసార్లు. కారు అద్దాలు పగిలిపోయాయి. డ్రయివర్‌కి దెబ్బ తగిలింది. అయినా నేను వదలలేదు.

డ్రయివ్ చేసి వాళ్ళ కారు టైర్‌ని షూట్ చేసి పట్టుకు న్నాను'' ఒకణ్ణి గాయపరచి, అరగంట హోరాహోరీ పోరాడి.

నేను చెప్పేదంతా నాకే అసహజంగా వినపడింది. కాని దత్తు నమ్మాడు నేను చెప్పినదంతా. అబద్ధం చెప్పాలన్న అవసరం నాకు వుందని తెలీదు దత్తుకి.

''మరోసారి ఇలాగే స్మగుల్ చేస్తున్న వాళ్ళని ఓ రోజంతా అనుసరించాను. వాళ్ళ స్థావరం కనిపెట్టాను ఏమాత్రం అనుమానం కలగకుండా అరగంటలో చుట్టు ముట్టాం. అందరి దగ్గిరా పిస్తోళ్ళున్నాయి. నేను అనుసరించిన వాళ్ళదగ్గరకూడా. ఆ సంగతి తెలుస్తే నన్ను కాల్చి చంపే వాళ్ళే. అప్పుడే నాకు ఓ ఇంక్రిమెంట్ ఇచ్చారు ఎక్కు వగా. పది లక్షల విలువచేసే బంగారం, బట్టలు స్వాధీనం చేసుకున్నాం.''

''మీకు మొదటినుంచీ ప్రమాదంతో కూడిన పనులు చెయ్యటం అలవాటేనన్నమాట సార్?'' అడిగాడు సంభ్ర మంతో కూడిన ఆనందంతో.

అవునన్నట్లుగా ఠీవీగా తల వూపాను.

''అయితే వీళ్ళు మీకో లెఖ్ఖలోకి రారు.''

అవునన్నట్లుగా తల వూపాను మళ్ళీ.

కొంచెంసేపాగి అన్నాడు దత్తు నెమ్మదిగా. ''అయినా సరే సార్. వాళ్ళ విషయంలో మాత్రం మీరు జాగ్రత్తగా వుండాలి.''

## 4

ఆ సాయంత్రమే పుణ్యమూర్తిని కలుసుకున్నాను, గంగులుని కలుసుకోబోయే రెండు రోజులముందు.

పుణ్యమూర్తిని కలుసుకోబోయేముందు ఇన్‌స్పెక్టర్

హత్య కేసు ఫైల్, మిగతా ఫైల్స్ స్టడీ చేసాను, రావుల పాలెంలోని నేరాల గురించి తెలుసుకోవాలనే జిజ్ఞాసతో.

ఎక్కువగా దౌర్జన్యాలు, దెబ్బలాటలు పోట్లాటలు జరిగాయి. చిల్లర దొంగతనాలకన్నా. అన్నిటిలో అంతో ఇంతో గంగులు చెయ్యికూడా వుంది. అంతి చిన్న గ్రామానికి అన్ని నేరాలు ఎక్కువే.

పుణ్యమూర్తి నన్ను సాదరంగా ఆహ్వానించాడు.

"క్రొత్తగా ట్రాన్స్‌ఫర్ అయి వచ్చారన్న మాట. సంతోషం" అన్నాడు పుణ్యమూర్తి నన్ను పరీక్షగా చూసి.

"నాకు మీ అండదండలు లభిస్తాయనుకుంటాను. మిమ్మల్నోసారి చూసి పోదామని వచ్చాను వూరి పెద్దలని" అన్నాను నవ్వి.

"ఏ విషయంలో?" అడిగాడు.

"ఏ విషయంలో నయినా."

"తప్పకుండా."

"ఇంతకు ముందువున్న ఇన్‌స్పెక్టర్‌కు కూడా లభించాయనుకుంటాను మీ సహాయం?"

"అవును."

"పాపం. చివరకి ఏమయ్యాడో తెలుసుగా" వ్యంగ్యంగా అన్నాను పుణ్యమూర్తి కళ్ళలోకి చూస్తూ.

పుణ్యమూర్తి మౌనంగా వుండిపోయాడు.

"మీకు అన్ని సంగతులూ తెలుస్తూంటాయి, కొంచెం పరపతి వుంది కాబట్టి. ఈ వూళ్ళో ఎవరివల్ల అవినీతి, అంటే దెబ్బలాటలు, దొంగ సారా వ్యాపారం,వ్యభిచారం అభివృద్ధి అయాయో చెప్పగలరా?" అడిగాను పుణ్యమూర్తిని అమాయకంగా.

"ఒక విషయం గుర్తుంచుకోండి. ఎవరివల్ల అనేది అప్ర

సుతం. చూసీ చూడనట్లు వూరుకుంటే మీ జేబు నిండవచ్చు."

"ఏమిటి మీరనేది?" అడిగాను.

జేబులోంచి సిగరెట్ పాకెట్ తీసి ఓ సిగరెట్ ఆఫర్ చేసాడు నాకు.

"క్షమించండి నేను డ్యూటీలో వుండగా సిగరెట్ త్రాగకూడదు" అన్నాను సిగరెట్ నిరాకరిస్తూ.

"ఫర్వాలేదు. అలవాటుంటే తోడుగా ముట్టించండి ఒకటి" అన్నాడు.

అతను అందించిన సిగరెట్ జేబులో వేసుకుని అన్నాను "థాంక్స్."

"తాగరా?" అడిగాడు.

"వూహు. హైద్రాబాద్‌లో ట్రెయినింగ్ స్కూల్ వుంది మాకు. అక్కడ శిక్షణ పొందాను నేను. అక్కడ నేర్చుకున్నాను డ్యూటీలో వున్నప్పుడు క్రమశిక్షణకి సంబంధించిన కొన్ని నియమాలు తప్పనిసరిగా పాటించడం. ఉదాహరణకి నేను కూర్చున్నప్పుడు తప్ప మిగతా సమయాలలో నా హేట్ తీయకపోవడం మీరు గమనించవచ్చు ఎప్పుడయినా."

"డ్యూటీ అయాక కాలుస్తారా సిగరెట్?"

"అవును. మిమ్మల్ని నిరుత్సాహ పర్చడం ఇష్టంలేక తీసుకున్నాను సిగరెట్."

కొన్ని క్షణాలు మౌనంగా సిగరెట్ పొగ పీల్చి వదిలి, తర్వాత అన్నాడు పుణ్యమూర్తి.

"ఇలా అయితే ముందు ముందు బాగా ఇబ్బంది పడతారు ఇక్కడ."

"ఏం?"

"మీ వృత్తిలో కొన్ని స్కిప్ చెయ్యాలి."

"లేకపోతే?"

"ఇబ్బంది పడతారు."

"అవును. నన్ను డబ్బుతో కొనలేని పెద్ద మనుషులు యిబ్బంది పడతారు."

మొహం తేలేశాడు కొద్దిగా పుణ్యమూర్తి నా సమాధానం విని.

"ఏం తీసుకుంటారు?" అడిగాడు.

"మీ ఇష్టం."

"షర్బత్?"

తలూపాను.

షర్బత్ తీసుకు రమ్మని పని కుర్రాడితో చెప్పి పంపాడు లోపలికి.

షర్బత్ వచ్చాక త్రాగుతూ అన్నాను.

"ఇది వరకటి ఇన్‌స్పెక్టర్ వేరు. నేను వేరు. ప్రభుత్వం గమనిస్తూనే వుంది గ్రామంలోని అరాచకం. అందుకని ఈ సారి గట్టివాడిని వేయాలనుకుంది. పదిమంది పైనే హంతకులని వురికంబానికి పంపాను. ఎంత మంది దొంగలని పట్టుకున్నానో లెక్కే లేదు నా సర్వీస్‌లో. న్యాయం కోసం ఎలాంటి పనయినా విచక్షణాజ్ఞానం లేకుండా పోలీస్ అధికారిగా చెయ్యగలిగే కరకుతనం నా వృత్తి నాకు నేర్పింది. నేనెలాంటి వాడినో క్రమంగా అర్థమవుతుంది మీ అందరికీ."

మౌనంగా వుండి పోయాడు పుణ్యమూర్తి.

"స్టెప్ బై స్టెప్ ఒకొక్క చట్ట వ్యతిరేకమైన పనినీ ఆపుచేయిస్తాను. నెలరోజుల్లో గ్రామం ఎలా మారుతుందో మీరే చూస్తారుగా."

హేట్ పెట్టుకుని లేచి నిలబడ్డాను.

"అవసరం వస్తే మళ్ళీ కలుస్తాను."

బయటికి నడిచాను బూట్లు టకటక లాడించుకుంటూ.

కొద్దిగా దెబ్బ తిన్నట్లుగా చూశాడు వెళ్తున్న నన్ను పుణ్యమూర్తి.

చిన్నగా నవ్వుకున్నాను. పుణ్యమూర్తి నే ననుకున్నంత ధైర్యవంతుడు, తెలివి గలవాడు కాదు. కొద్దిగా భీరువు. అది చాలు నాకు. అసలు నేనంటే భయం ఏర్పడాలి ఆ సర్కిల్స్‌లో.

## 5

ముఖాముఖి గంగులుని కలుసుకునే అవకాశం వారం రోజుల్లోనే వచ్చింది నాకు. మామూలుగా కాకుండా వృత్తి రీత్యా కలుసుకునే అవకాశం అది.

అలాంటి సన్నివేశం కోసమే ఎదురు చూస్తున్నాను. వస్తుందని తెలిసీ, నేను చట్ట రీత్యా గంగులుని సమీపించడానికి కారణం దొంగ సారాయి.

దత్తుని ఎప్పటికప్పుడు నాకు దొంగ సారాయి రవాణా మీద సమాచారం అందించమని కోరటంవల్ల, ఆ రోజు సాయంత్రం దొంగ రవాణా కళ్ళారా చూసివచ్చి చెప్పాడు నాకు హెడ్ కానిస్టేబుల్ దత్తు.

ఆ అవకాశం పోనివ్వ దలచుకోలేదు. యూనిఫాం తొడుక్కుని, సర్వీస్ రివాల్వర్ లోడ్ చేసుకుని బయలుదేరాను ఆ గ్రామం బయటవున్న సారా దుకాణానికి.

నేను వెళ్ళేటప్పటికి అంతా తప్పతాగి దొర్లుతున్నారు. రోడ్ సైడ్ వేశ్యలు కొంతమంది సారాయి అందిస్తూ,కవ్విస్తున్నారు. గంగులు నిషాలోవున్నా తెలివిగానే వున్నాడు. నన్ను చూసి ముఖం చిట్లించి లేచి నిలబడి అన్నాడు.

"ఏమిటిలా వచ్చారు!"

"రాకూడదా?" అడిగాను.

"నేను అనలేదు అలా అని."

"జరుగుతున్న కథ స్వయంగా చూద్దామని వచ్చాను" చెప్పాను గట్టిగా.

"చూసారుగా. ఇక పొండి" అన్నాడు నిర్లక్ష్యంగా.

"ఇక మానవా ఈ వ్యాపారం?" అడిగాను.

"మనం దీని కోసమే పుత్తాం ఇది మనకోసమే పుత్తింది. ఎలా మానటం?" అన్నాడు నవ్వి.

"నేను పుట్టిందికూడా మీకోసమే. ఇది చట్ట సమ్మతం కాదు" అన్నాను.

"పోనీ మీరుకూడా ఓ చుక్క రుచి చూసెళ్తారేంటి?" గడుసుగా నవ్వి అన్నాడు గంగులు.

గంగులు ప్రక్కన నిలబడి మా సంభాషణ ఆసక్తిగా వింటున్న మరొకతను కన్ను కొట్టి అన్నాడు, "చుక్క రుచి చూసాక కావాలంటే ఓ చక్కని చుక్కని కూడా పీరుకోండి."

"షటప్" అరిచాను నేను గట్టిగా.

నా అరుపు విని అంతా గట్టిగా నవ్వారు హేళనగా. ఆలోచించాను ఏం చెయ్యాలా అని. నేను, దత్తు, మరో ఇద్దరు కానిస్టేబుల్స్ మాత్రమే వున్నాం. మా బలగం చాలా తక్కువ వాళ్ళతో పోల్చి చూస్తే. అధికారంగా ఎదురు తిరిగితే వాళ్ళు తిరగబడచ్చు. మేం చాలం వాళ్ళని ఎదుర్కోవాలంటే.

ఏం చెయ్యలేక వెళ్ళిపోతే అలుసిచ్చి నట్లవుతుంది. నా పిస్తోలు కూడా ఉపయోగించలేను ఒక్క ఆత్మ రక్షణకి తప్ప. అప్పటికి తటస్థంగా వుండటమే మంచిదనే అభిప్రాయానికి వచ్చాను.

"ఎన్ని వేల రూపాయల వ్యాపారం జరుగుతుంది నెలకి?" అడిగాను ఓ ఖాళీ స్టూల్ మీద కూర్చుంటూ.

"వేలెక్కడ. వందలే" అన్నాడు గంగులు.

"ఆ సాని కొంపలో ఎంతమంది దాకా వుంటారు?" అడిగాను.

"మీకు పనికివచ్చే వాళ్ళెవరూ లేరు లెండి. అంతా పోరంబోకు సరుకు."

కొంచెంసేపు కూర్చుని లేచి వచ్చేసాను.

"మంచి పనిచేసారు. వాళ్ళు పచ్చి రక్తం తాగేవాళ్ళు. వాళ్ళతో పేచీ పడి లాభంలేదు" అన్నాడు దత్తు.

నేను ఆలోచిస్తూండి పోయాను ఏం చేయాలా అని. ప్రభుత్వం నాకు పూర్తిగా బలగం, తతంగం ఇవ్వలేదు వాళ్ళని రూపు మాపడానికి. వున్న ఈ కాస్తంతలో నేను సాధించ గలిగేదేమీ లేదు.

పరిస్థితి వివరిస్తూ నాపై అధికారికి ఓ రిపోర్ట్ పంపాను. ఇక్కడ చట్టం అదుపులోకి రావాలంటే వెంటనే కనీసం మరో పాతికమంది కానిస్టేబుల్స్ అయినా తాత్కాలికంగా నాకు సహాయం కావాలని వ్రాసాను, ఆ రోజే సంతకం పెట్టి పోస్ట్ చేశాను నా రిపోర్టు.

వారం రోజుల దాకా సమాధానం కోసం ఎదురు చూసి, రాకపోతే మళ్ళీ రిమైండర్ వ్రాసాను. పదిహేను రోజుల దాకా నేను ఏమీ చెయ్యలేక పోయాను, గోళ్లు గిల్లుకుంటూ స్టేషన్‌లో కూర్చోవడం తప్ప.

పదిహేను రోజుల్లో కొద్దిగా గంగులు తగ్గాడనే అన్నారు అంతా. గ్రామంలోకి ఇదివరకంతటి తరచుగా రావడంలేదు. అది గ్రామస్థులు నా మీద గౌరవం కొద్దీ ముఖస్తుతికి చెప్పిన మాటలో, లేక నిజమో గ్రహించలేకపోయాను.

## 6

దత్తు హడావిడిగా పరుగెత్తుకొచ్చాడు.

"సార్. సార్. గంగులు, మరో ఇద్దరు తాగివచ్చి కోమటి

దుకాణం దగ్గర గలాభా చేస్తున్నారు."

నేను వెంటనే లేచి నిలబడ్డాను, హేట్ పెట్టుకుని.

"పద" అన్నాను.

ఇద్దరం అయిదు నిముషాల్లో కోమటిదుకాణం చేరుకున్నాం. దారిలో చెప్పాడు దత్తు, కోమటి దగ్గర ఒక కిలో జీడిపప్పు కొని, డబ్బు ఇవ్వలేదుట. కోమటికి భయం వేసి డబ్బు అడగ లేదుట, దుర్మార్గుడితో కొట్లాట ఎందుకని.

కాని అక్కడున్న పత్రకారు మాత్రం పూరుకోలేక పోయారు ఆ అన్యాయం చూస్తూ. డబ్బు ఇచ్చి మరీ కదల మని అడ్డుపడ్డారు. చేతిలోని బాణాకర్రతో ఇద్దరిని చావ బాదాడు. భయపడలేదు పత్రాల్లు. తాగి వుండటంవల్ల గంగు లుని తేలికగా పట్టుకో గలిగారు; కూడా వచ్చిన ఇద్దరూ మాత్రం పారిపోయారు చిక్కకుండా.

నేను మనసులోనే మెచ్చుకున్నాను ఆ పత్రాళ్ళ ధైర్యా నికి. నిజానికి ఈ కాలంలో పత్రాళ్ళే ధైర్యంగా ఏదయినా నిక్కచ్చిగా చేయ గలిగేది.

కోమటికొట్టు ప్రక్కనున్న గుంజకి కట్టేసారు గంగులుని. కొంచెం కొంచెం నిషా తగ్గుతున్నట్లుగా కనిపించింది, గింజు కుంటూ తనని కట్టేసిన ఆ పత్రాళ్ళని, పారిపోయిన ఇద్దరినీ బూతులు తిడుతున్నాడు గట్టిగా.

దత్తుకి మనసులో భయంగా వున్నా, కూడా తెచ్చిన బేడీలు వేసాడు గంగులుకి. కోమటి కొట్టులో ఓ కాగితం అడిగి తీసుకుని పత్రాళ్ళచేత జరిగిందంతా రిపోర్ట్ వ్రాయించి, కోమటిచేత సంతకం చేయించాను, కేసు పకడ్బందీగా వుండేందుకు సాక్షి సంతకాలు అయ్యాక బయలుదేరాం.

గంగులుని స్టేషన్ కు తీసుకువెళ్ళి లాకప్ లో వుంచాను. తీరికగా గంగులున్న సెల్ ముందుకు వెళ్ళాను ఆ రోజు సాయంత్రం.

"ఇనస్పెక్టర్. నీ చావు మూడింది" అన్నాడు నా వంక క్రోధంగా చూస్తూ.

చిన్నగా నవ్వాను.

"నన్ను బొక్కలోకి తోసినాడి రక్తం కళ్ళ జూస్తేగాని నిద్రపోయే అలవాటులేదు నాకు" పళ్లు పటపట కొరుకుతూ అన్నాడు.

"నీమీద చాలా నేరాలున్నాయి. కోమటిని కొట్టిన నేరం. దొంగ సారా తాగిన నేరం. కోమటి కొట్టులోని సామానంతా చెల్లా చెదురుచేసిన నేరం. ఇంకా చాలా నేరాలు. శిక్ష చాలా పడుతుంది."

"నన్ను విడిచి పెత్తిన మర్రోజు ఎక్కడున్నా నీ చావు తప్పదు నా చేతిలో."

బోనులోనిసింహం గుర్తుకొచ్చింది నాకు గంగులు సెల్ లో చేసే గొడవ చూస్తే.

అప్పటికే నేను ఏం చెయ్యాలో ఆలోచించు కున్నాను. ఆ పల్లెటూర్లో జైలు అంత క్షేమకరమైన చోటు కాదు. గంగులు జైల్లో వున్నాడన్న సంగతి తెలుస్తే అంతా ఒక్క సారిగా వచ్చి పడి దొమ్మి చేయచ్చు వాడిని విడిపించ డానికి.

అందుకే వెంటనే గంగులుని జిల్లా కేంద్రానికి తరలించ దలచుకున్నాను. దత్తు సహాయంతో, అయిదు నిముషాల్లో స్టేషన్ చేరుకున్నాను, గంగులుతో. మేం స్టేషన్ చేరిన నాలుగయిదు నిముషాలకి వచ్చింది రైలు.

రెండుగంటల తర్వాత జిల్లా కేంద్రం చేరుకున్నాము. జిల్లా పోలీస్ అధికారిని కలిసాను వెంటనే. అతని అనుమతి మీద గంగులు ఖైదుచేయ బడ్డాడు.

గంటదాకా జిల్లా పోలీస్ అధికారికీ, నాకూ మధ్య చర్చ జరిగింది గంగులు విషయం మీద. నేను గ్రామ పరిస్థితి

పూర్తిగా వివరించాను.

"పోలీస్ బలగం వెంటనే అదనంగా తరలించడం సాధ్యం కాదు" చెప్పాడు ఆ అధికారి నేను చెప్పింది సాంతం విని.

"అలా అయితే గ్రామంలో లా అండ్ ఆర్డర్ అదుపులో పెట్టడం కూడా సాధ్యంకాదు" అన్నాను నేను కొంచెం ఆశాభంగం చెంది. ఆయన నా మాట మన్నిస్తాడనే ధైర్యం వుంది అప్పటిదాకా.

"వీలైనంత త్వరలో మీ కోరిక నెరవేర్చే ఏర్పాటు చేస్తాను" అన్నాడు చివరకి.

## 7

ఆ రాత్రికి తిరిగి వచ్చేసాను రావులపాలేనికి దత్తుతో కూడా. రైల్వేస్టేషన్ నుంచి ఇంటికి తిరిగి వెళ్తూంటే ఎదురు పడ్డ గ్రామస్థులు కొందరు నాకు నమస్కారం పెట్టారు.

కొందరు నన్ను ఆపి హెచ్చరించారు జాగ్రత్తగా వుండ మని. గంగులుని అరెస్ట్ చేయడంవల్ల నాకు శత్రువులు, ప్రమాదాలు ఎక్కువయ్యాయని హితబోధ చేసారు.కొందరు మెచ్చుకున్నారు నా సాహసానికి.కొందరు మెత్తగా కోప్ప డ్డారు.

అందరికీ చిరునవ్వే సమాధానంగా ఇచ్చి ఇంటికి చేరు కున్నాను. ఓ సర్ ఆర్థర్ పుస్తకం అందుకున్నాను.

భోజనం వేళకి వచ్చింది. భోజనం ముగించి, పడుకొందా మనుకుంటూంటే తలుపు చప్పుడు వినిపించింది.

నేను నిజంగా కథలోని హీరోలా ఫీలయ్యాను నా సర్వీస్ రివాల్వర్ అందుకుంటూంటే. ఎడం చేతిలో రివాల్వర్ అందుకుని, నెమ్మదిగా అడుగులో అడుగు వేసుకుంటూ నడి చాను తలుపు దగ్గరకి.

నిశ్శబ్దంగా తలుపు తెరిచాను చటుక్కున. బయట గుంపు వుంటే వెంటనే తలుపులు మూసేసే వాడినే.

పుణ్యమూర్తి.

పుణ్యమూర్తి నిలబడి వున్నాడు ఎదురుగా, గుమ్మం అవతల.

నన్ను చూసి చిన్నగా తల పంకిస్తూ నవ్వాడు. ఆ నవ్వు మామూలుగా లేదు. భావగర్భితంగా వుంది. హెచ్చరికగా వుందనిపించింది.

"మా ఇల్లు ఇక్కడుందని మీకు ఎప్పుడూ చెప్పలేదు" అన్నాను అడ్డు తప్పుకుని, రెండోతలుపుకూడా తెరుస్తూ.

లోపలకి వచ్చాడు పుణ్యమూర్తి నా ఆహ్వానంకోసం ఎదురు చూడకుండానే.

"నాకు తెలుసు మీరు ఇలా వెతుక్కుంటూ ఓ రోజు రావాల్సి వస్తుందని."

నా జాగ్రత్తని సూచించే ఆ రివాల్వర్ పుణ్యమూర్తికళ్ళ బడనివ్వకుండా నా జేబులో దాచుకున్నాను, ఏ మాత్రం అనుమానం కలగకుండా.

"ఆరోజు ఈరోజు అయింది."

పుణ్యమూర్తి ఎదురుగావున్న ఓ కుర్చీలో కూర్చున్నాడు. నేను రెండు తలుపులు వేసి లోపల గడియపెట్టాను. మంచం మీద కూర్చున్నాను.

"ఇక ప్రారంభించండి" అన్నాను.

"గంగులు గురించి మాట్లాడటానికి వచ్చాను" అన్నాడు అతిశయం వుట్టిపడేలా.

"వచ్చారు కనుక మాట్లాడండి."

"తెలివి తక్కువపని చేసావు" కోపం, ఆవేశం కనపడింది పుణ్యమూర్తి మాటల్లో.

"నాకు మర్యాద నా ప్రాణంకన్నా ముఖ్యం. ఏక

వచనం వుపయోగించి ఇష్టంవచ్చినట్టు మాట్లాడే పక్షంలో దయచేయచ్చు. ఒక్క మాటగూడా వినను" నిర్లక్ష్యంగా అన్నాను.

రెండు గుటకలువేసి అన్నాడు పుణ్యమూర్తి కొన్ని క్షణాల తర్వాత.

"తెలివి తక్కువ పనిచేసారు."

"అలవాటయిపోయింది మీలాగే."

"గంగులుని ఇక్కడే లాకప్‌లో వుంచితే ఓ నాలు గయిదు వందలు సంపాదించుకునేవారు మీరు. ఆ అవకాశం లేకుండా చేసుకున్నారు."

"ఎలాగో నాకు తెలిసినా మీరు చెప్పండి అయినా."

"గంగులు త్రాగితే మనిషికాడు. గొడవ చేయడం సహజం. అసలు త్రాగితే నువ్వయినా...మీరయినా, నేనయినా, ఎవరయినా సరే మనిషికాం. ఏదో నిషాలో తెలియక చేసిన అంత చిన్న నేరానికి ఇలా చేయడం మంచిది కాదు. పొరబాటు."

కొన్ని క్షణాల తర్వాత అడిగాను.

"గంగులు మీకు చుట్టమా?"

"కాదు."

"మరి ఎందుకు ఈ తాపత్రయం?"

"గంగులు నాకు ముఖ్యుడు గనక."

"ఏ విషయంలో?"

"చాలా విషయాల్లో."

"పుణ్యమూర్తికదా మీ పేరు?"

"అవును" అన్నాడు అప్పుడే నాపేరు మర్చిపోయావా అన్న భావం వచ్చేలా.

"పుణ్యమూర్తిగారు ఓ సిగరెట్ ఆఫర్ చెయ్యండి."

పుణ్యమూర్తి జేబులోంచి సిగరెట్ పెట్టెతీసి, తెరచి

నావైపు జరిపాడు చేతిని. అతని చేతిలోని సిగరెట్ పెట్టె లోని సిగరెట్ అందుకుని అన్నాను నవ్వుతూ.

"ఆఫర్ చేస్తేగాని నేను సిగరెట్ తీసుకోను. థాంక్స్ ఆఫర్ చేసినందుకు."

తనే స్వయంగా సిగరెట్ అంటించాడు. అగ్గిపుల్ల గీసాడు. అది ఆరిపొయ్యేదాకా నేను సిగరెట్ నోట్లో పెట్టుకోలేదు. ఆరిపోయి, ఆ పుల్ల పుణ్యమూర్తి పారేసాక నోట్లో పెట్టుకున్నాను సిగరెట్‌ని. ఇంకో పుల్లగీసి అంటిం చాడు.

"థాంక్స్ ఎగెయిన్. నేను డ్యూటీలో లేనప్పుడు సిగ రెట్స్ తాగుతూంటాను."

"డ్యూటీలో లేనప్పుడు ఏమయినా చేయచ్చు. గంగులుని విడిపించే పక్షంలో అయిదువందలు ఇస్తాను. ఎప్వాన్సుగా రెండువందలు పట్టుకొచ్చాను."

"ఇవ్వండి."

జేబులోంచి రెండువందలు తీసి అందించాడు నాకు. వాటిని నా జేబులోకి తోసాను.

చిన్నగా నవ్వాడు పుణ్యమూర్తి. ఇప్పుడు ఆ నవ్వులో విజయం తాలూకు చిహ్నం, సాధించాననే తృప్తి కనపడు తున్నాయి.

"మీరు జిల్లా సూపరింటెండెంట్ దాకా వెళ్ళకుండా వుంటే బాగుండేది" అన్నాడు.

నేను మౌనంగా చిరునవ్వు నవ్వాను.

"మనమధ్య సఖ్యత వుండాలి. లేకపోతే ఇద్దరికీ నష్టం. మన శతకాల్లో, పంచతంత్రం కథల్లో కూడా పెద్దలు సఖ్యత మించినది మరొకటి లేదని చెప్పారు."

తలాడించాను అవునన్నట్లుగా.

"గంగులుని ఎప్పుడు విడిపిస్తారు?"

"కష్టం పడుతుంది. ప్రయత్నం చేస్తాను."

"మీకింకా పెళ్ళి కాలేదుగా?" అదోమాదిరిగా నవ్వుతూ అడిగాడు.

"కాలేదు. ఏం చేస్తారా?" అడిగాను.

"జీవితాంతం వుండే పెళ్ళాం అయితే ఏమోకాని మీరు రావులపాలెంలో వుండేంత కాలం మిమ్మల్ని అన్ని విషయాల్లో కనిపెట్టుకుని వుండే ఓ మాంచి అమ్మాయిని కుదిర్చి పెడ్తాను, మనం, మనం ఒకటయితే."

"ఎంతివ్వాలి?"

"ఛ. ఛ. పుచ్చుకోవడమే మీవంతు. ఇచ్చుకోవడం నా వంతు."

"వద్దులెండి" అన్నాను.

"అలా అంటే కాదు" అని లేచాడు వచ్చినపని అయిపోయినట్లుగా.

నేను లేచి నిలబడ్డాను.

"ఉంటా మరి" అన్నాడు.

"సిగరెట్ పెట్టె వదలి వెళ్తున్నారే?" అడిగాను.

"ఫర్వాలేదు. కాల్చండి."

"అక్కర్లేదు. తీసుకువెళ్ళండి" అన్నాను చిన్నగా నవ్వి.

పుణ్యమూర్తి ఆప్యాయంగా నా భుజంతట్టి అన్నాడు సంతోషంగా.

"అభివృద్ధిలోకి వస్తావోయ్ కుర్రాడివే అయినా."

పుణ్యమూర్తి వెళ్ళిపోగానే తలుపు గడియవేసుకున్నాను లోపల మళ్ళీ.

మంచంమీద పడుకుని కళ్లు మూసుకున్నాను. నా తెలివికి నాకే ఆనందంగావుంది. కావాలని కోతివితో తల గోక్కున్నట్లుగా వుండేపని చేశాను గంగులుని బంధించి,

భారం దేముడిమీద వేసి.

ఆ దేముడే నాకు ఇప్పుడు అపాయం రాకుండా కాపాడాడు పుణ్యమూర్తిని పంపి.

తాత్కాలికంగా పుణ్యమూర్తిగాని, అతని మనుషులు గానీ ఏం చెయ్యరు నన్ను. డబ్బుతో నన్ను కొనుక్కోగలిగాననే భావనతో తమ మనిషిగా ఎంచుతారు నన్ను. గంగులుని జైల్లో వేసాననే కోపంతో నన్నేం చేయరు వెంటనే.

తాత్కాలికమే ఈ రక్షణ నాకు.

నేను పుణ్యమూర్తి దగ్గర డబ్బుతీసుకుని, నమ్మించి, మోసంచేసానని తెలిసిన మరుక్షణం నుంచి పుణ్యమూర్తి నిద్రపోడు నా అంతు చూసేదాకా. పుణ్యమూర్తికి నా పాచిక అర్థమయ్యేలోపల నాకు సహాయం వస్తుందనే ఆశ మిణుకుమిణుకు మంటోంది నాలో.

అప్పటిదాకా పుణ్యమూర్తి మనుషులని ఎదుర్కోగల మనుష్యులు నావైపు కూడా వుంటారు ఒకవేళ సహాయం రాకపోతే?

సహాయం వచ్చేలోపలే పుణ్యమూర్తి నిజం గ్రహిస్తే?

నా ఒళ్లు ఝల్లుమంది. అప్పుడు అర్థమయింది నాకు, నేను ఇన్నాళ్ళనించి కోరుకునే థ్రిల్ అంటే ఏమిటో. సరిగ్గా అదే నేను థ్రిల్ అనుకున్న సన్నివేశం.

నిజంగా ఓ మంచి డిటెక్టివ్ నవలలాగా వుంది నా నిజ జీవితం.

చిన్నగా నవ్వుకున్నాను. ప్రస్తుతానికి పుణ్యమూర్తిని బుట్టలో పెట్టాను.

చాలు.

రివాల్వర్ జేబులోంచి తీసి, దిండుక్రింద పెట్టి, పడుకున్నాను లైటార్పి, మధ్యలో వదిలిన పుస్తకం చదవ

బుద్ధి గాక.

ఒకవేళ పుణ్యమూర్తి నామీద కత్తికడితే ఏంచెయ్యాలా ఎలా ఎదుర్కోవాలా అనే ఆలోచనతోనే చాలా రాత్రి గడిచిపోయింది.

# 8

రావులపాలెంలో చాలామందికి ఆశ్చర్యం వేసింది. రెండు రోజులు అయినా నామీద ఏ అత్యాచారం జరగకపోవటం. నేను కనపడినా, గంగులు స్నేహితులు మర్యాదగా ప్రక్కకి తప్పుకోవటం ఇంకా ఆశ్చర్యాన్ని కలిగించింది వాళ్ళకి.

ఒకరిద్దరు నన్ను అడిగారు కూడా ఆ సంగతి.

“ఏమో? నాకేం తెలుసు? వెళ్ళి పుణ్యమూర్తినే అడగండి” అన్నాను బదులుగా.

పుణ్యమూర్తి నాకు ఇచ్చిన లంచం, రెండువందలరూపాయలు నేను వుపయోగించదలుచుకోలేదు. పుణ్యమూర్తి పేరు మీద ‘మునిసెఫ్’కి పంపాను దాన్ని, చిన్నపిల్లలకి ఉపయోగపడాలనే వుద్దేశంతో, మనిఆర్డరు ద్వారా.

మనిఆర్డర్ ఫ్రం అడ్రసు పుణ్యమూర్తి ఇంటి అడ్రసు ఇచ్చాను.

రెండోరోజు రాత్రి వచ్చి అడిగాడు పుణ్యమూర్తి నన్ను.

“ఏమయింది గంగులు సంగతి?”

“తొందర పడకండి. విడుదలవుతాడు తప్పకుండా.”

“నువ్వు ఇక్కడే కూర్చుంటే ఎలా విడుదలవుతాడు? పట్నం వెళ్ళు” అన్నాడు. చిరాకు, నామీద అధికారం వ్యక్తపరుస్తూ.

“అలాగే” అన్నాను పొడిగా.

“రేపీపాటికి విడుదలవ్వాలి. లేకపోతే నేనే ఏదో నా తంటాలు పడతాను.”

"అలాగే" అన్నాను అదే స్వరంతో.

పుణ్యమూర్తి వెళ్ళిపోయాడు విసురుగా.

చదరంగంలో ఓడిపోతూంటే ఏ పావు కదపాలో తెలియని ఆటగాడిలా వుంది నా మనసు.

అదృష్టం నా పక్షం వుంది. రెండు రోజుల తర్వాత గంగులు కేసు విచారణకి వస్తుందని నాకు తెలియచేసాడు దత్తు మర్నాడు ఆఫీసులో. నేను అక్కడికి వెళ్ళాలి.

ముందురోజు రాత్రి సాక్షులనంతా కలుసుకుని మర్నాడు పట్నానికి సాక్ష్యానికి రావలసిందిగా కోరాను. వాళ్ళకి కూడా అప్పటికే సమన్స్ అందాయి.

రావులపాలెంలో అందరికీ నామీద పూర్తి నమ్మకం ఏర్పడిపోయింది. పుణ్యమూర్తి ఎందుకో నాకు భయపడి నష్టం చెయ్యటం లేదనే నమ్మకం వాళ్ళలో ఏర్పడిపోయింది.

అందుకే నామీద నమ్మకంవేసి రావడానికి ఒప్పుకున్నారు సాక్షులంతా కోర్టుకి. పుణ్యమూర్తి నిప్పుతొక్కిన కోతిలా వచ్చాడు మర్నాడు ఉదయం నేను పోలీస్టేషన్‌కి బయలుదేరుతూంటే.

"ఏమిటిది? సాక్షులంతా వెళ్తున్నారుట. ఎప్పుడు విడుదల అయేది గంగులు?" అరిచాడు గట్టిగా.

"నిదానం ప్రధానం. ప్రభుత్వంతో వ్యవహారం. శిక్ష పడకుండా చూస్తాను. పడ్డా చిన్న శిక్షతో పోతుంది. సాక్షులందరికీ ఏం చెప్పాలో నేను ముందరే చెప్పాను" అన్నాను నమ్మకంగా.

నా మాటల్లోని దృఢత్వం కదిలించింది పుణ్యమూర్తిని. గొణుక్కుంటూ వెళ్ళిపోయాడు.

అంతా కలిసి జిల్లాకోర్టుకి వెళ్ళాం. గంగులు గురించి జడ్జికి తెలిసింది ప్రాసిక్యూషన్ ద్వారా ముందరే. కొత్త

జడ్జి అతను.

సాక్షులు జరిగింది జరిగినట్లు చెప్పారు. గంగులు గురించి, అతని చరిత్ర గురించి, పూర్తిగా వివరించాను నేను, కొంచెం అప్రస్తుతమయినా.

మూడు నెలల కఠినశిక్ష పడింది గంగులుకి. తృప్తిగా నిట్టూర్చాను.

పుణ్యమూర్తి తెలివయినవాడు. కోర్టుకి తన మనిషిని పంపాడు రహస్యంగా జరిగేది తెలుసుకోవాలని గూఢచారి లాగ. పుణ్యమూర్తి మనుషులంతా నాకు గుర్తే. అతన్ని రావులపాలెం చేరకుండా చూడమని చెప్పాను, కొంత కాలందాకా.

నా సలహామీద అతన్ని అరెస్ట్ చేసాడు అక్కడి ఇన్స్పెక్టర్ త్రాగుడు నేరంమీద. పట్నం వస్తే త్రాగకుండా తిరిగి వెళ్ళరు పుణ్యమూర్తి మనుషులు ఎవరూ.

జిల్లా పోలీస్ అధికారికి వివరంగా నాకూ పుణ్యమూర్తికి జరిగినదంతా చెప్పాను.

వీలైనంత త్వరలో ఏదో ఒకటి తేల్చి చెప్తానని చెప్పాడు. తిరిగి రాబోయేముందు మందలించాడు నన్ను.

"డ్యూటీలోవున్నా, లేకపోయినా నేను లంచంతీసుకోకూడదు. లంచం తీసుకోవడం కేవలం స్వీయ రక్షణకే అయినా చట్టాన్ని చేతుల్లోకి తీసుకుని, ఇష్టంవచ్చినట్లు ప్రవర్తించకూడదు అపరాధులతో. మరోసారి ఇలా జరిగితే బావుండదు. రుజువు దొరికితే నిన్ను అరెస్ట్ చేసేవాణ్ణి."

సెల్యూట్ కొట్టి బయటపడ్డాను. పుణ్యమూర్తికి ఏం చెప్పాలా అనే ఆలోచనే నన్ను బాధించడం మొదలు పెట్టింది. పుణ్యమూర్తికి నిజం తెలిసిన మరుక్షణం నుంచి నేను జాగ్రత్తగా వుండాలి.

నేను అనుకున్నట్లుగా ఆరాత్రి పుణ్యమూర్తి నా ఇంటికి

రాలేదు, ఏమయిందని అడగడానికి. అతని మనిషికూడా చేరివుండడు. గంగులు విడిపించబడితే పుణ్యమూర్తిని తప్పక కలిసేవాడే.

తన దగ్గరకి గంగులు రాకపోవడంవల్ల గంగులు విడిపించ బడలేదనే కోపంతో నా దగ్గరకు రాలేదని అనుకున్నాను నేను. ఆ రోజు రాత్రి తలుపులన్నీ జాగ్రత్తగా వేసుకుని పడుకున్నాను.

శిక్ష పడ్డాక గంగులు నన్ను బండబూతులు తిడుతూ, తిరిగివచ్చాక నా అంతు చూస్తానని బెదిరించడం గుర్తుంది నాకు. అంతకుముందువున్న పోలీస్ ఇన్‌స్పెక్టర్‌ని ఘోరంగా నడిరోడ్డుమీదే పొడిచి చంపడం గుర్తుంది నాకు.

ఇక ముందు జాగ్రత్తగా వుండాలి అనుకున్నాను మనసులోనే. అనవసరంగా దత్తుని, మిగతావాళ్ళనీ వాళ్ళ దుర్మార్గానికి బలిచేస్తున్నానేమో ననిపించింది నాకు అంతరాంతరాల్లో.

ఛ. ఏమిటిది? థ్రిల్ కాదు నా బొంద. కంఠందాకా వూబిలో చిక్కుకున్నాను. ఇక బయటపడలేను అనిపించింది.

తుఫాను రాబోయేముందు ప్రశాంతత అలుముకుంది పుణ్యమూర్తి మధ్య, నామధ్య. మర్నాడుకూడా పుణ్యమూర్తి రాలేదు నన్ను ఏమయిందని అడగడానికి. నేను వెళ్ళలేదు పుణ్యమూర్తి ఇంటికి ఏం జరిగింది చెప్పడానికి.

ఓ కానిస్టేబుల్ చెప్పాడు నాకు స్టేషన్‌లో మధ్యాహ్నం పుణ్యమూర్తి కార్లో పట్నం బయలుదేరి వెళ్ళాడని. సాయంత్రానికి తిరిగి రావచ్చు అనుకున్నాను.

దత్తుకి చెప్పలేదు పుణ్యమూర్తి మధ్య, నామధ్య నడిచిన కథ. చెప్తే ఇంకా వణకిపోతాడు. ఇప్పటికే జరిగినదానికి తిట్టుకుంటున్నాడు మనసారా.

నేనుమాత్రం గంభీరంగానే వుంటున్నాను అందరి

ముందూ. ఏ క్షణంలో నయినా ఏమయినా జరగచ్చు అని తెలుసు నాకు. ఏం జరుగుతుందో, ఎప్పుడు జరుగుతుందో మాత్రం తెలియదు.

## 9

వారం రోజులు గడిచాయి.

భారంగా, భయంగా, నెమ్మదిగా, నిరీక్షణగా— థ్రిల్లింగ్ గా గడిచాయి వారంరోజులు. ఈ వారంలో నేను రెండుసార్లు ట్రంక్ కాల్ చేసి చెప్పాను జిల్లా పోలీస్ అధికారికి పోలీస్ బలగం ఎక్కువ చెయ్యమని.

రెండోసారి కోపంగా చెప్పాడు తన విధులు, బాధ్యతలు తనకి తెలుసని, మళ్ళీ ట్రంక్ కాల్ చేసి భారత ప్రభుత్వం ఖర్చు పెంచవద్దని.

దత్తు చెప్పాడు ఎనిమిదో రోజు.

"సార్-గంగులు వచ్చేసాడు."

ఉలికిపాటు కప్పిపుచ్చుకోడానికి వ్యర్థప్రయత్నం చేస్తూ అడిగాను.

"జైల్లోంచి పారిపోయి వచ్చాడా?"

"అంతే అయ్యుంటుంది."

మౌనంగా ఆలోచిస్తూండిపోయాను!

"మనం జాగ్రత్తగా వుండాలి" అన్నాడు దత్తు.

తల పంకించాను నేను.

పుణ్యమూర్తి వచ్చాడు సరాసరి పోలీస్ స్టేషన్లోకి, దత్తు నాకు ఆ వార్త అందించిన గంట తర్వాత.

"దర్శనాలే లేవు?" అడిగాను లేని నవ్వు తెచ్చిపెట్టుకుంటూ.

"నీకు చిన్న పిల్లలంటే ప్రేమా?"

వెటకారంగా అడిగాడు.

"దైవ స్వరూపులు. అలాంటివాళ్లు వికలాంగులయితే మీరు సహాయంచేస్తే ఆ పుణ్యం మీకేగా?" అన్నాను.

"అందుకని నా రెండువందల రూపాయలు నా తరఫున నువ్వు మునిసెఫ్‌కి పంపుతావా? నా డబ్బు ఎలా ఖర్చు చేసుకోవాలో నాకు నేర్పేంత ధైర్యమా నీకు?"

"సంబోధన మార్చండి" అన్నాను గట్టిగా. "ఇక్కడ గట్టిగా అరవకూడదు."

పళ్లు పటపట కొరికాడు. ఇన్నాళ్లు అణచి వుంచుకున్న కోపం అంతా ఆ చూపులో వ్యక్తం అయింది.

"కూర్చోండి. ఏదైనా రిపోర్ట్ చేయడానికి వచ్చారా? ఎవరయినా లంచం తీసుకున్నారా? చెప్పండి. నిముషంలో అరెస్ట్ చేస్తాను" నవ్వాను. "వంద తీసుకున్నారా? రెండొందలా?"

"నీకో సంగతి చెప్పిపోదామని వచ్చాను."

"నాకు ముందే తెలిసింది. గంగులు పారిపోయివచ్చాడు."

"అదికాదు చెప్పడానికి వచ్చింది_ఈ పదిరోజులూ నిన్ను ఏం చేయకుండా ఎందుకు గాజులు తొడుక్కుని కూర్చున్నానో చెప్దామని_"

"వినడానికి నాకు తీరిక,ఓపిక వున్నాయి. కూర్చోండి."

"గంగులు జైల్లో వుండగా నిన్ను ఏంచేసినా గంగులు కేసు విషయంలో మేం నిన్ను ఏదో చేసామని అనుకోవచ్చు అంతా."

"ఓహో."

"గంగులు తిరిగి వచ్చాడు. ఇక్కడికివచ్చి పట్టుకునే దమ్ము లెవరికీ లేవు."

"రాకుండా మీరు చక్రం అడ్డేసి వుంటారు. రెండు వేలా మూడు వేలా?"

"విడిపించడానికి_అదే పారిపోయే అవకాశం కల్పించ

డానికే రెండయింది.''

''ఓహో. తాత్కాలికంగా ఓ పోలీస్ అధికారికి భార్యని సప్లై చేసివుండివుంటారు.''

''అంతేకాదు. నిన్ను పనిష్మెంట్ ఏరియాకి ట్రాన్స్ఫర్ చేస్తున్నారు.''

''థాంక్ యూ.''

''తిరిగి ప్రాణంతో వెళ్ళవు నువ్వు. వెళ్ళినా నువ్వు రావులపాలెం వచ్చినప్పుడు వున్న అన్ని అంగాలతో వెళ్ళవు తిరిగి.''

''చూద్దాం ఎవరు గెలుస్తారో.''

''గంగులు అసలే కోతి. నిప్పు తొక్కించావు. ముల్లు గుచ్చావు.''

''ఈ రాత్రికి కల్లుకూడా తాగుతాడేమో?'' రివాల్వర్ బెల్టు సవరించుకుంటూ అన్నాను. ''ఓ సిగరెట్ ఆఫర్ చేస్తారా?''

''నన్ను నమ్మించి, మోసంచేసిన వాడు, నీముందు వాడు ఏమయ్యాడో మర్చిపోయావు. ఉంటా.''

వెనక్కి తిరిగిన పుణ్యమూర్తిని గట్టిగా పట్టుకున్నాను లేచి.

''వదులు'' గింజుకున్నాడు.

''వదలను. దత్తు. అరెస్ట్ దిస్ బ్రూట్'' అన్నాను దత్తుతో.

అంతవరకు ఆశ్చర్యంగా భయంగా మామధ్య సంభాషణ వింటూన్న దత్తు నెత్తిమీద పిడుగు పడ్డట్టుగా అదరిపడ్డాడు.

''సార్?'' అన్నాడు.

''లాకప్‌లో వుంచు వీణ్ణి. బేడీలు తీసుకురా.''

''వదులు'' క్రోధంగా గింజుకుంటున్న పుణ్యమూర్తిని, బలంగా రెండుచేతులతో బిగించి పట్టి అరిచాను గట్టిగా.

"దత్తూ బేడీలు అందుకో."

"సార్..." భయంగా అన్నాడు.

"డు ఏ జ్ ఐ సే."

"సార్. ఈయన తర్వాత......"

"యూ హెర్డ్ మి. హేవింట్ యూ?" అరిచాను గట్టిగా. "ఇట్సీస్ ఆర్డర్. అరెస్ట్ హిమ్."

"యస్ సర్."

క్షణాల్లో లాకప్ లో వున్నాడు పుణ్యమూర్తి.

"నిన్ను ఏం చేస్తానో చూసుకో" బండబూతులు తిట్టడం ప్రారంభించాడు పుణ్యమూర్తి.

"దత్తు కాగితం అందుకో" అన్నాను నేను పుణ్యమూర్తి తిట్లు పట్టించుకోకుండా.

కాగితంతో వచ్చాడు దత్తు.

"పుణ్యమూర్తి మాటలన్నీ విన్నావుకదా?" అడిగాను.

తల వూపాడు.

"పుణ్యమూర్తి నన్ను - అంటే ఓ ప్రభుత్వాధికారిని, బెదిరించాడు చంపుతానని. చంపటం కన్నా చంపుతానని బెదిరించడం పెద్ద నేరం. రాయి అదంతా. సాక్షి సంతకం పెట్టు. కేస్ పుటప్ చేద్దాం."

దత్తు వ్రాసాడు అంతా ఓపికగా నేను చెప్పినట్లుగా. ఆ కాగితం నా డెస్క్ సొరుగులోపడేసి,లాక్ చేసి అన్నాను.

"ఇవాళతో అటో, ఇటో తేలిపోవాలి. నేను చచ్చినా ఫరవాలేదు. గ్రామానికి పట్టిన శనిమాత్రం విరగడవాలి."

"ఏం చేద్దాం ఇప్పుడు?" అడిగాడు దత్తు.

"పుణ్యమూర్తిని అరెస్ట్ చేసిన సంగతి రహస్యంగా వుంచు. చేతనయితే పట్నం వెళ్ళాడని పుకారుపుట్టించు."

"రేపటికయినా, లేదా ఎల్లుండయినా తెలుస్తుందిగా వాళ్ళకి నిజం."

"ఈ లోపల మనకి సహాయం వస్తుంది."

"నాకు నమ్మకం లేదు."

"ఎందుకు లేదు?"

"ఎలా వస్తుంది ఇన్నాళ్ళు రాని సహాయం."

"ఓ గ్రామాధికారి అరెస్ట్ అయి, హత్యలు జరిగితే రాదా?"

"హత్యలా?"

"అవును."

"ఎలా?"

"జైల్లోంచి పారిపోయిన గంగులుని పట్టుకోదలుసుకున్నాను మళ్ళీ."

# 10

గ్రామం అంతా చాలా ప్రశాంతంగా వుంది. తుఫాను రాబోయేముందు, శత్రువు దాడిచేయబోయేముందు వుండే ప్రశాంతత.

గ్రామస్తులు మాత్రం భయపడుతున్నారు, గంగులు జైల్లోంచి పారిపోయి వచ్చాడన్న వార్త అందరినీ క్రుంగ తీసిందనే చెప్పచ్చు.

ముఖ్యంగా గంగులు కేసు విషయంలో సాక్ష్యం వచ్చిన వాళ్ళందరూ భయంతో వణకిపోతున్నారు.

గంగులు ఒంటరిగా దొరికితే ఏమయినా చేసేయాలనే యావవున్న వాళ్ళందరూ కలసి, కోర్టులో గంగులుకు ఎదురుగా సాక్ష్యం చెప్పినవాళ్ళందరికీ కాపలాగా వున్నారు.

సాయంత్రం, సూర్యుడు అస్తమించే సమయంలో ఓ రైతు పరిగెత్తుకొచ్చి చెప్పాడు, ఖంగారుగా నాకు.

"సార్. గంగులు కోనేటిలో నీళ్లు తెచ్చుకోడానికి

వెళ్ళిన ఆడవాళ్ళ దగ్గరచేరి నానారభసా చేస్తున్నాడు."

"అలాగా" లేచాను వేగంగా.

"సాక్షీకం చెప్పిన ఓ పత్రాడి చెల్లెలు కూడా వుంది అక్కడే. దానికోసమే వచ్చినట్టున్నాడు."

"తాగాడా?"

"కొంచెం తాగినట్లున్నాడు."

"దత్తు. నీ తుపాకి తీసుకో జాగ్రత్తగా స్టేషన్ కి కాపలా కాయి. అవసరం అయితే రైఫిల్ ఉపయోగించు."

"అలాగే సార్. మీరు ఒంటరిగా వెళ్తున్నారా?" అడిగాడు కొంచెం బాధగా.

"అవును. నాకేం భయంలేదు. ఆఖరి పేజీలలోని సన్నివేశం దగ్గరపడింది. ఇంక సస్పెన్స్ వుండదులే" అన్నాను నవ్వి.

"జాగ్రత్త సార్" హెచ్చరించాడు.

"అవసరం వస్తే కాలి మీదో, భుజం మీదో కాల్చు. చచ్చినా ఫర్వాలేదు. యూజ్ ది రైఫిల్ ఇఫ్ నెససరీ దటీజ్ ఏన్ ఆర్డర్. అండర్ స్టాండ్?"

"యస్ సర్."

"గుడ్."

సరిగ్గా మూడు నిముషాలలో చేరుకున్నాను కోనేటి వైపు పరుగెత్తుతూ వెళ్ళి. పారిపోయి వస్తున్న ఇద్దరమ్మాయిలు చెప్పారు నాకు త్వరగా వెళ్ళమని.

కోనేటికి కొంచెం దూరంలో ఆగాను. దాదాపు పదిమంది అమ్మాయిల దాకా ఓ వారగా నిలబడి వున్నారు బిత్తర చూపులు చూస్తూ.

అందరికీ ఇవతలగా ఓ పద్దెనిమిదేళ్ళ పిల్ల నించుని వుంది. పక్కనే గంగులు. ఆపిల్ల నెత్తిమీద మట్టికడవ తనచేతిలోని కర్రతో పగలకొట్టినట్లున్నాడు గంగులు.

ఆ అమ్మాయి నీళ్ళతో తడిసిపోయి వుంది. ప్రక్కన

పగలిన కడవ పెంకులు. గంగులుతో బాటు మరో నలుగు రున్నారు.

నన్ను చూశాడు గంగులు. భూమి దద్దరిల్లేలా నవ్వాడు.

"ఇన్‌స్పెక్టర్ నువ్వా?" మళ్ళీ నవ్వాడు గట్టిగా.

"ఏమిటి అల్లరి చేస్తున్నావ్?" అడిగాను గట్టిగా, మిలటరీ ఆఫీసర్ అరిచే విధంగా.

"అరవకు. నీ చావు మూడింది" అన్నాడు గంగులు.

"అమ్మాయిలు. మీరెళ్ళొచ్చు" అన్నా వాళ్ళ నుద్దేశించి.

కదిలారు వాళ్ళు, కొంచెం భయంగా. మిగతా నలుగురు వాళ్ళవైపు కదిలారు వెంటనే.

"ఆగండి" గర్జించాను.

తడిసిన ఆ యువతి వంటిమీద చెయ్యి వెయ్యబోయాడు గంగులు.

"ఖబడ్దార్."

క్షణంలో నా కుడిచేతిలో నా ఆయువు పట్టయిన రివాల్వర్ మెరుస్తోంది.

"నీ పని పడ్తాను ఆగు," అన్నాడు గంగులు కొద్దిగాజంకి.

మెరుపులా నా వైపు దూకాడు. నా కళ్ళు గ్రహించాయి గంగులు కదులుతూండగానే. కాలు పని చేసింది సరయిన సమయంలో.

గంగులు వెల్లకిలా పడ్డాడు నేను తన్నిన తన్నుకి. క్రింద పడ్డ గంగులుని గడ్డం క్రింద మళ్ళీ తన్నాను బూటు కాలితో.

మిగతా నలుగురూ నా వైపు దూకబోయారు.

వెనక్కి అయిదారు గజాలు పరిగెత్తి ఆగి అన్నాను గట్టిగా.

"ఎవరి ఆయువు గట్టిదో వాళ్ళురండి భయం లేకపోతే."

నలుగురూ మూకుమ్మడిగా పరిగెత్తారు నా వైపు.

"ఢాం."

ఒకడు అరుస్తూ నేలకూలాడు.

ఆగిపోయారు మిగతా ముగ్గురూ యంత్రాల్లా.

కిందపడ్డ వాడి పొట్టలోంచి రక్తం కారుతోంది. బాధతో అరుస్తున్నాడు చేతులు అడ్డం పెట్టుకుని.

"రండి. ధైర్యం వుంటే రండి" ఎక్కడలేని ధైర్యం ప్రవేశించింది నాలో.

గంగులు లేచి నిలబడ్డాడు.

"గంగులూ. ఈ రోజుతో నీ పని ఆఖరు. పుణ్యమూర్తి నిన్ను కాపాడలేడు ఈసారి. మర్యాదగా చేతులు ఎత్తి నా వెంటరా పోలీస్ స్టేషన్‌కి. మీరు కూడా."

తెల్లబోయి చూస్తున్నారు. గంగులు నోట్లోంచి నెత్తురు కారుతోంది. ముఖంనిండా కోపం. చూపులనిండా అగ్ని.

"లొంగి పొండి. లేదా వాడిలా దీంతో చచ్చిపోండి. ఏదో ఒకటి త్వరగా తేల్చుకోండి."

ఇంతలో వెనకనుంచి చాలామంది పరుగెత్తుకొస్తున్న చప్పుడు. వెనక్కి తిరిగి చూశాను ఓరగా.

బ్రతికిపోయాను. గంగులు మనుష్యులు కారు. గ్రామంలో యువకులు ఏభైమంది దాకా చేతిలో కర్రలతో వస్తున్నారు.

వాళ్ళని చూస్తూనే నలుగురూ వెనక్కి తిరిగి పరిగెత్తసాగారు పొలాలకి అడ్డంపడి.

అంత ధైర్యంగా రాగలిగినందుకు వాళ్ళని అభినందించాను. అందరం కలిసి వెనక్కి మళ్ళాము, గాయపడ్డతనితో.

దత్తు జరిగింది విని చిన్నగా నిట్టూర్చి అన్నాడు.

"రాత్రి తప్పకుండా వస్తాడు గంగులు తన ముఠా అంతటితో. బహుశా పుణ్యమూర్తి ఆజ్ఞకోసం ఎదురు చూస్తూండాలి. లేకపోతే ఈ పాటికి వచ్చేసేవాడే. వూరుకోడు ఇలా."

# 11

పోలీస్ స్టేషన్‌లో కూర్చుని గంగులు విషయం ఏం చెయ్యాలా, గంగులు మీద ఏం చర్య తీసుకోవాలా అని ఆలోచిస్తున్నాను.

"సార్. బయట గంగులు మనిషి వచ్చి నిలబడ్డాడు" చెప్పాడు దత్తు నాకు.

కిటికీలోంచి చూసాను. దూరంగా, లైటు సంభం వెలుగు పడని చోటగా, ఓ మూల నుంచునున్నాడొకడు. చేతిలో పెద్ద కర్రవుంది. స్టేషన్ వైపే చూస్తున్నాడు, గుర్రుగా.

తల వంచుకుని నా పని నేను చేసుకోసాగాను. మరో అయిదు నిముషాల తర్వాత చెప్పాడు దత్తు భయంగా.

"చూడండి సార్. అబ్బ. ఎంత మందో!?"

తల ఎత్తి చూశాను కిటికీలోంచి బయటికి. నిజమే. చాలా మంది నిలబడి వున్నారు బయట. దాదాపు ఏభైమంది దాకా వున్నారు. అందరి చేతుల్లో కత్తులు, బరిసెలు, బాణా కర్రలు బాణాలు వున్నాయి. నిశ్శబ్దంగా నిలబడి చూస్తున్నారు ఎవరి ఆజ్ఞకోసమో ఎదురు చూస్తున్నట్టుగా.

"అందరూ దాడి చెయ్యటానికి వచ్చినట్టున్నారు పోలీస్ స్టేషన్ మీదకి," దత్తు కంఠంలో భయం పసిగట్టాను.

"మరి నిశ్శబ్దంగా వుండి పోయారే?"

"గంగులుగాడింకా వచ్చినట్టులేదు."

"దత్తు. మనం జాగ్రత్త పడటం మంచిది. కిటికీ తలుపులు మూయించు. తుపాకులతో సిద్ధంగా వుండండి. పట్నానికి లైటనింగ్ కాల్ బుక్ చెయ్యి."

"అలాగే సార్."

దత్తుకంఠం అధైర్యంగా పలికింది. 'ఇక ఈరోజుతో నా జీవితం ఆఖరు' అన్న అధైర్యం కనిపించింది దత్తులో.

"దత్తు! ప్రతి మనిషీ పుడతాడు, చస్తాడు. ఆ రెండూ మనచేతిలో లేనప్పుడు మనచేతిలోకి ఎంత ప్రయత్నించినా

రావని తెలిసినప్పుడు భయపడటం దేనికి? చచ్చినా హీరోలాగా, వీరోచితంగా చద్దాం. బ్రతికితే అధర్మాన్ని చంపుదాం."

ఏడుపులాంటి నవ్వు నవ్వాడు దత్తు.

నా ఆర్డర్స్ అందుకుని అంతా నిముషంలో మెయిన్ డోర్ తప్ప మిగతావన్నీ మూసేసారు. రైఫిల్స్‌నిండా గుళ్లు నింపి తయారుగా నిలబడ్డారు నేనాదేశించిన స్థానాల్లో.

ట్రంక్ కాల్ వచ్చింది.

వీలైనంత ప్రశాంతంగా మాట్లాడాను ఐ. జి. తో. ఇంట్లో భోజనం బల్లముందు నుంచి లేచివచ్చినట్లున్నారు మధ్యలో. కోపంగా అన్నారు-

"నేను చెప్పింది మర్చిపోయావా?"

"లేదు. కాని ఇప్పుడు మాట్లాడకపోతే ఇక మాట్లాడే అవకాశం రాకపోవచ్చని ఫోన్ చేసాను."

"అంటే?"

"బయట ఓ ఏభైమంది దొమ్మిచేయడానికి నిలబడ్డారు రాబందుల్లా. స్టేషన్ తగలపెట్టేసి మమ్మల్ని ఆ మంటల్లో తగలపెట్టినా తగలపెట్టేయచ్చు."

"అయితే ఇప్పుడు నేనేం చేయగలను? రేపు వుదయం ఏం చేయాలో ఓ నిర్ణయం తీసుకుంటాను."

"మంచిది. ముందర కడుపునిండా భోజనం చేయండి."

ఫోన్ పెట్టేసాను విసురుగా.

దాదాపు ఓ పావుగంట గడిచివుంటుంది. అంతే. వెనకాల పులిపడి తరుముతున్నట్లుగా పరిగెత్తుకొచ్చాడొకతను స్టేషన్‌లోకి.

"రక్షించాలి. త్వరగా నాతో రండి" అన్నాడు వగరుస్తూ.

మండిపోయింది నాకు అసలు విషయం చెప్పనందుకు.

"ఎవరు చస్తున్నారు?" అడిగాను.

"ప్రొద్దున చెరువుదగ్గిర గొడవచేసాడుకదా గంగులు ఓ అమ్మాయిని. వాళ్ళింటిమీద పడ్డాడు మరో యిద్దరితో. ఆ అమ్మాయి ఓ గదిలోకి పారిపోయి లోపల తలుపు గడియ వేసుకుంది. ఇంట్లోని ఆ అమ్మాయి ముసలి తల్లిని, అన్ననీ కట్టేసాడు తాళ్ళతో."

అతని కళ్ళలో భీతి చూస్తే జాలివేసింది నాకు. నా నరాల్లో కొత్త వుత్సాహం వచ్చింది.

ఏ డేమ్ సెల్ ఇన్ డిస్ట్రెస్ ఎగెయిన్.

"నేను వెళ్తున్నాను దత్తూ," చెప్పాను దత్తుతో.

"మీరు ఒంటరిగా" భయభయంగా చూశాడు నన్ను.

"అవును. జంటగా రివాల్వర్ వుంది. మూడు ప్రాణాల్ని కూడా తీసుకువెళ్ళగాని చావను."

దత్తు ముఖం ఎర్రబడింది.

"నేను పని పూర్తిచేసుకుని తిరిగి వస్తాను."

"మీరు వెళ్ళగానే వీళ్ళు తిరగబడితే?"

"ఫైర్. ఫైర్ దెమ్ టు డెత్. మీరుమాత్రం బయటకి వెళ్ళకండి."

"అలాగే."

"బి బ్రేవ్."

బయటకి నడిచాను వచ్చినతనితో. నేను స్టేషన్‌లోంచి రోడ్డుమీదకి రాగానే ఆ ఏభైమందిలో చలనం వచ్చింది.

రెండడుగులు వేసాను, చేతిని రివాల్వర్ బట్‌కి ఆనించి. ఇద్దరు అడ్డంగా వచ్చి నిలబడ్డారు. మరో యిద్దరు నన్ను పట్టుకోబోయారు వెనకనుంచి.

నా కర్థమైంది వాళ్ళ ప్లాన్. నేను బయటకి వెళ్ళకుండా అడ్డగించి, అక్కడ ఆ అమ్మాయిని వాడు అమానుషంగా ఈ రాత్రి పాడుచేసి, తర్వాత స్టేషన్‌మీద పడతాడు.

ఇదంతా పగతీర్చుకోడానికే చేస్తున్నాడు.

నా రెండు చేతులూ మరల్లా పనిచేసాయి. సర్వీస్ ట్రెయినింగ్‌లో నేర్చుకున్న నా దెబ్బలు వృథాకాలేదు. కిందపడ్డారు ఇద్దరూ ఒకేసారి. నాతోపాటు నడుస్తున్నతన్ని చెయ్యిపట్టుకుని లాగి లోపలికి పరిగెత్తాను, స్టేషన్‌లోకి.

నవ్వుతున్నారు అంతా. బయట నిలబడ్డవాళ్ళంతా పగలబడి నవ్వుతున్నారు. ఆ ప్రదేశమంది కలిసి నవ్వే నవ్వు వినిపిస్తోంది గట్టిగా. నా పిరికితనానికి నవ్వుతున్నారు.

"దత్తూ నేను వెళ్తున్నాను. వెనక స్టోర్ రూంలోని వెంటిలేటర్ ద్వారా వెళ్తున్నాను. జాగ్రత్త."

నా వెనకే వచ్చాడు దత్తు స్టోర్ రూంలోకి.

"తిరిగి ఎలా వస్తారు సార్?" అడిగాడు. "మీరు బయటికి వెళ్ళిన సంగతి తెలిసిపోతే చుట్టూ కాపేస్తారు."

చిన్నగా నవ్వి, దత్తు ఏం చెయ్యాలో వివరంగా చెప్పాను. తలవూపాడు అంగీకారంగా.

వెంటిలేటర్ పైకిఎక్కి, తలుపు తెరచి చూసాను బయటికి. అంతా చీకటి.

బయటకి దూకాను.

# 12

చాలా రోజుల తర్వాత థ్రిల్, ఎక్సైట్‌మెంట్ ప్రవేశించింది నాలో మళ్ళీ. జాగ్రత్తగా అడుగులు వేయసాగాను ఆ చీకట్లో వక్కడినే.

ఆ రైతు ఇల్లు తెలుసు నాకు, మూడు నిముషాల్లో అక్కడున్నాను. క్రీనీడలో నడుస్తూంటే రోడ్డంతా నిశ్శబ్దంగా వుంది. ప్రతీ ఇంటి కిటికీ తలుపులు కూడా మూసివున్నాయి. రోడ్డుమీద మంచాలు వేసుకుని పడుకునే వాళ్ళెవరూ కనబడలేదు నాకు.

ఇంటికి కొంచెం దూరంలో ఆగాను. బయట గంగులు సహాయకు లుంటారను కున్నాను. లోపలే వున్నారు. కదిలాను గబగబా.

ఆగిపోయాను హఠాత్తుగా. కళ్లు చికిలించి చూసాను మేడ వంక.

పై అంతస్తులో ఓగది కిటికీలోంచి పొగ వస్తోంది పల్చగా. క్రమక్రమంగా పొగ ఎక్కువవుతోంది. లోపల ఏదో మండు తోంది!

అరుపులు వినిపించాయి. ఆ అమ్మాయి అరుస్తోంది భయంగా. తలుపులు పగల కొట్టలేక తగల బెడుతున్నారు ఆ అమ్మాయి కోసం. చప్పుడు చెయ్యకుండా మంచానికున్న ఓ దోమ తెరకర్రని తీసుకున్నాను. క్రింద ఎవరూ లేరు.

అంతా ముగ్గురూ పైన వున్నట్లున్నారు. మేడ ఎక్కాను బూట్లు వదలి.

కిరసనాయలు వాసన వేసింది. ఎదురుగా దృశ్యం నేను అనుకున్నట్లుగానే వుంది. కాని ఇంకా భీకరంగా వుంది.

ఆ తలుపు ముందు సామాను చాలా కుప్పగాపోసి వుంది. దాని మీద కిరసనాయలు పోసి నిప్పంటించారు తలుపుతో పాటుగా. గంగులు స్థిరంగా నిల్చుని వున్నాడు చేతిలో బాణా కర్రతో. ఎప్పటిలా తాగిలేడు.

మెరుపులా పనిచెయ్యాలి.

మెరుపులాగే దూకాను ఆ ముగ్గురి మధ్యకి. దూకుతూనే ఒకడి తలమీద మోదాను బలమంతా ఉపయోగించి. రెండో వాడిని కూడా మోదాక తగిలింది నాకు దెబ్బ. ఇద్దరూ మొదటి దెబ్బకే స్పృహతప్పి పడిపోయారు.

గంగులు బాణా కర్రతో కొట్టిన దెబ్బ తగిలింది నాకు. తల గింగిరాలు తిరిగింది. కళ్ళు బైర్లు కమ్మాయి. నా హేట్ నన్ను కాపాడింది తల పచ్చడి కాకుండా.

రెండో దెబ్బ తగలకుండానే ప్రక్కకి తప్పుకుని నా చేతిలోని కర్రతో ఎగరకొట్టాను గంగులు కర్రను.

"ఎలా వచ్చావు?" ఆశ్చర్యంగా అడిగాడు గంగులు.

"నీ చావు మూడి వచ్చాను."

గట్టిగా నవ్వి అన్నాడు. "ఇంకా పుత్తలేదు ఎవరూ."

నా మీదకి దూకాడు నేను రివాల్వర్ తీసే లోపలే.

తాగి వున్నప్పుడు తేలికేగాని, మామూలుగా వుంటే మృగంతో సమానం గంగులు బలంలో. కాని మెళకువలు తెలియవు అంతగా వాడికి. అంతా మోటు వ్యవహారం.

నా గడ్డం కింద మోదబోయాడు. ప్రక్కకి తప్పుకుని రెండుచేతులూ గంగులునడుంచుట్టూ బిగించాను వెనకనుంచి.

గంగులు కాళ్ళు నేలమీద ఆనకుండా గంగులుని గాల్లోకి పైకి లేపి గోడకేసి బాదాను గబగబా.

నాలుగయిదు సార్లు బాదాక గంగులు చేతులు నా మెడ చుట్టూ పెనవేసుకున్నాయి. అవి బిగుసుకున్న కొద్దీ నా పట్టు సడలింది. వూపిరి బిగపట్టి.నరాలు, రక్తనాళాలు వుబ్బించాను మెడదగ్గర గిరగిరా తిరుగుతూ. వెనకనుంచి కాబట్టి గంగులు పట్టులో దృఢత్వం లేదు.

గంగులు మరోసారి ఓడిపోయాడు నాతో. కాని గంగులు పాదరసం. ఇసుకమీద పడ్డ నీటిబొట్టులాంటివాడు. నేను నా రివాల్వర్ తీసేలోగానే దౌడుతీసాడు, కేకలు వేసి అరుస్తూ. గంగులు తప్పించుకున్నందుకు బాధ వేసింది.

తన మనుషులు ఏభైమందినీ పిలుస్తున్నాడు గట్టిగా అరుస్తూ. వాళ్ళొచ్చి పడితే, నేను పూర్తిగా బలిపశువునయిపోతాను.

అదే కర్రతో తలుపుముందు కుప్పగా పోసివున్న, కాలుతున్న సామాగ్రిని ప్రక్కకి గబగబా నెట్టి తలుపుమీద టకటకకొట్టి అన్నాను గట్టిగా.

"త్వరగా తలుపు తెరచుకుని రామ్మా! నేను, ఇన్స్పెక్టర్ని."

తలుపు తెరుచుకుని వచ్చింది ఆ పిల్ల మంటల్లోంచి.

"క్రిందికిరా నాతో" ఇద్దరం కిందకి దారితీసాము.

నాకే నవ్వొచ్చింది ఆ పిల్లని దాస్తూంటే. పెద్ద ఖాళీ భోషాణంలోవుంచి పైన తలుపు మూసాను. నాతో తీసుకు వెళ్ళివుంటాననుకుని వుంటారు కాని అక్కడ వెదకరు.

మిగతా ఇద్దరు బంధితుల కట్లువిప్పి బయటికి వచ్చాను.

దత్తు కంఠం వినబడుతోంది మైక్లో.

"అంతా వినండి జాగ్రత్తగా. ఇన్స్పెక్టర్ని ఏం చేసినా పుణ్యమూర్తి మీకు దక్కడు."

గుడ్. దత్తు నేను చెప్పినట్లే చేస్తున్నాడు. నా ట్రిక్ ఎందాకా ఫలిస్తుందో! చీకట్లో దాక్కుని వింటున్నాను.

"పుణ్యమూర్తి మీరనుకున్నట్లు వూరెళ్ళలేదు. ఖైదులో వున్నాడు ఇక్కడే."

ఆ ఏభైమందిలో కలకలం రేగింది. ఆ మాటలు వినగానే.

"నిజంకాదు. అబద్ధం" గంగులు గొంతు.

"దత్తు చెప్పింది నిజమే. ఇన్స్పెక్టర్సి ఏం చేయద్దు మీరు. లోపలకి రానివ్వండి అతన్ని. ఇన్స్పెక్టర్ వంటి మీద ఈగవాలినా చాలు. వీళ్ళు నా ప్రాణం తీసేస్తారు."

పుణ్యమూర్తి కంఠం మైక్లోంచి వినబడింది.

పూర్తిగా నిశ్శబ్దం అలుముకుంది.

తృప్తిగావుంది నాకు, స్టేషన్లో వున్న ఆ పాత మైక్ సెట్ పనిచేస్తున్నందుకు.

"నా ప్రాణం తియ్యకపోయినా ఏ కాలో, చెయ్యో కాశ్చేస్తారు."

నేను నడిచాను జాగ్రత్తగా బూట్లకాళ్ళతో, చేతిలో రివాల్వర్తో అటువైపు.

"సార్! మీరు రావచ్చు ఇక" వినిపించింది దత్తు కంఠం.

నాకు తెలుసు పుణ్యమూర్తి అంటే ఎంత గౌరవమో వాళ్ళందరికీ. నిజానికి అది భయం. గౌరవం కాదు.

వస్తున్న నావంక అంతా అవాక్కయి చూస్తూ నిలబడ్డారు సవ్యంగా.

నేను పోలీస్ స్టేషన్ నుంచి ఎలా బయటికి వచ్చానో, ఏమైందో అంతుపట్టలేదు వాళ్ళకి. గంగులు ఓ మూలగా నిలబడివున్నాడు నావంక చూస్తూ ఏం చేయాలో తోచక.

ఆ ఏభైమంది మధ్యనుంచీ నడిచాను స్టేషన్ గేటువైపు. ఎవరూ అంగుళంకూడా కదలలేదు.

పకపక నవ్వుతూ నడిచాను స్టేషన్ లోకి ఇందాక ఆ ఏభై మంది కలసి నవ్విన నవ్వు గుర్తు తెచ్చుకుంటూ.

"సార్, మీ అంత మొండివాళ్ళని ఎక్కడా చూడలేదు నేను," అన్నాడు దత్తు సంతోషంగా, క్షేమంగా తిరిగివచ్చిన నన్ను చూస్తూ.

"నాలా డ్యూటీ చేసే వాళ్ళని చూసుండవు. అంతే. పుణ్యమూర్తి మన ఖైదులోవున్నంత కాలం మనకేంకాదు. నేను కాసేపు కునుకుతీస్తాను. మీరు జాగ్రత్త!"

అని నిద్రలోకి జారాను నేను నాకు తెలీకుండానే.

కాసేపటికి లేపాడు దత్తు నన్ను. నా చెవులకి ఏవేవో చప్పుళ్ళు వినబడుతున్నాయి అనేకం.

"ఏమిటి?" అడిగాను.

"ప్లజెంట్ న్యూస్ సార్. మనకి రక్షణ వచ్చింది!"

"ఈజిట్?"

"అవును. మూడు వేన్స్ లో వచ్చారు రిజర్వ్ పోలీస్ స్టేషన్ ముందు వున్న ఆ ఏభై మందిని లొంగదీస్తున్నారు."

కిటికీలోంచి చూసాను కళ్ళు నులుముకుని.

నిజమే. రిజర్వ్ పోలీస్ అరెస్ట్ చేసి వేన్ లోకి ఎక్కిస్తు

స్నారు వాళ్ళని, రైఫిల్ పాయింట్స్‌మీద.

"ఐ. జి. మన మొరాలకించా డన్నమాట ఇప్పటికి" అన్నాను సంతోషంగా. దత్తు రివ్వున బయటకి దూసుకు వెళ్ళాడు పారిపోతున్న గంగులుని చూసి, పట్టుకోవటానికి. రిజర్వ్ పోలీసుతో వచ్చిన అధికారి లోపలకి వచ్చి తనని తాను పరిచయం చేసుకున్నాడు.

పది నిముషాల తర్వాత దత్తు వచ్చాడు గంగులుతో, గర్వంతో కూడిన చిరునవ్వుతో!!!

* * *

రిజర్వ్‌పోలీస్‌చే వాళ్ళతోబాటు, పుణ్యమూర్తికూడా చేర్చబడ్డాడు జిల్లా కేంద్రానికి.

క్రమంగా అందరిమీద కేసులు బనాయించబడ్డాయి.

దొంగసారా దుకాణం, బ్రోతల్ హౌసెస్, వాటికి వచ్చిపోయే ఘరానా మనుషులు మొదలయినవన్నీ వెలుగులో వచ్చాయి, సాక్ష్యాలతో సహా.

గంగులు చేసిన చాలా నేరాలకి తగిన సాక్ష్యాలు లభించాయి. ప్రజల్లోకూడా ధైర్యం ఏర్పడటంవల్ల సాక్ష్యాలు ఇవ్వడానికి ముందుకు వచ్చారు. పుణ్యమూర్తి భాగంకూడా కోర్టుకు తెల్సింది ఆదురాగతాల్లో.

అన్ని కేసులూ విచారించి గంగులుకి 99 ఏళ్ళు కారాగార శిక్ష విధించారు. పుణ్యమూర్తికి పదహారేళ్లు.

దత్తు అందరికన్నా ఎక్కువగా ఆనందించాడు. ఇక ఉద్యోగం దినదిన గండంగా వుండదని. చాలామంది నన్ను దేముడిలా చూడటం మొదలెట్టారు.

నా ధైర్యం గురించి, సాహసం గురించి అలా అందరూ చెప్పుకోవాలనే నా కోరిక రావులపాలెంలో తీరింది గంగులు మూలాన్నా.

—: అయిపోయింది :—

ఒకవేళ పేజీ వినోదం

# 6

ఒక వర్ధమాన రచయిత మొట్టమొదటి సారిగా 'అపన' కార్యాలయంలోకి ప్రవేశించి తన కథని ఎడిటర్‌గారి టేబుల్ మీదుంచేడు.

ఎడిటర్‌గారు కథని ఆమూలాగ్రం చదివి, "ఇది మీరు వ్రాసినదేనా?" అన్నాడు.

రచయిత చిరునవ్వు చిలకరించి "నాదే", అన్నాడు కాలరు సర్దుకొని.

ఎడిటర్‌గారు లేచి షేక్‌హేండ్ యిచ్చి—

"సర్ ఆర్థర్ కోనన్‌డోయల్ మీరేనన్నమాట. గ్లాడ్ టు మీట్ యూ. మీరు చనిపోయేరనుకున్నాను" అన్నారు.

* * *

"డాక్టర్! మా ఆయనకి గ్రామఫోను పిచ్చి పట్టుకుంది. త్వరగా రండి", అని ఫోన్ చేసింది ఒక ఇల్లాలు.

"అదేమిటమ్మా. ఆ మోజు కొన్నిరోజు లుంటుంది.తర్వాత దానంతటదే పోతుంది. కంగారు పడవద్దు. కొంత మందికి రేడియో పిచ్చి! కొందరికి ట్రాన్సిస్టరంటే పిచ్చి!"

"అలాకాదు డాక్టర్. మా ఆయన చెంపలో సూది గుచ్చుకుని, మెడవంచి, సూది అరచేతిమీద మోపి, ఇల్లంతా గిరగిరా తిరుగుతూ పాడుతున్నారు."

* * *

డిటెక్టివ్ నవలారచయిత ఎడ్గార్‌వాలెస్ శరవేగంగా నవల్సు రాసి, లక్షలకొద్దీ సంపాదించికూడ రేసులకీ, దానధర్మా

లకీ ఖర్చుపెట్టి, అప్పులో మునిగి వుండేవాడు.

ఒకసారి అప్పిచ్చిన వ్యక్తి గుర్రంమీద వస్తూండగా చూసే సరికి అతనికి గుండెల్లో రాయి పడింది. నిబ్బరంగా తనే అతని వద్దకి వెళ్ళి, గుర్రాన్ని ఎగాదిగా చూసేడు.

ఎడ్గార్‌వాలెస్ రేసుగుర్రాల ఎన్నికలో గల నైపుణ్యాన్ని గురించి తెలిసిన ఆ వ్యక్తి "ఏం, గుర్రం బాగుందా?" అని అడిగేడు.

ఎడ్గార్‌వాలెస్ చప్పరించి. "స్వారీ చేస్తూండగా చూస్తేతప్ప చెప్పలేను" అన్నాడు. అప్పిచ్చిన వ్యక్తి ఒక్క ఉరుకులో దౌడు తీసేడు. బ్రతుకుజీవుడా అనుకున్నాడు ఎడ్గార్‌వాలెస్.

—వాసవ, హైద్రాబాదు.

# 7

కొత్తగా పెళ్ళయిన ఒక యువదంపతులు జంట ఇంట ర్వెల్‌లో సినిమా హాల్లోంచి బయటకు వచ్చి, తర్వాత మళ్ళీ లోపలికెళ్ళారు. వెళుతూ భర్త ఒక వరసలో చివరి సీటులో కూర్చున్న ఒక బట్టతలాయన దగ్గరకెళ్ళి, "అయ్యా! ఇందాక నా బూటుకాలితో మీ కాలు తొక్కలేదుకదా!" అని అడిగాడు వినయంగా.

"ఎందుకు తొక్కలేదు నాయనా! కాలు విరిగిపోయేటట్టు తొక్కావు" అన్నాడు బట్టతలాయన, సంజాయిషీ కోరు తున్నట్టు కోపంగా.

వెంటనే ఆ భర్త తన భార్యవైపు తిరిగి—

"పద, యీ వరసలోనే మన సీట్లున్నాయి!" అన్నాడు ముందుకు నడుస్తూ.

*  *  *

పది అంతస్తుల మేడమీదనుంచి రామారావు గబగబా దిగుతున్నాడు. అతని గాభరా చూసి అతని మిత్రుడు, "అదేం బోయ్‌! అంత వేగంగా పరుగెడుతున్నావ్?" అడిగాడు పోయే వాణ్ణి ఆపి.

"అబ్బే. ఏంలేదు. నా గడియారం పైనుంచి క్రిందికి జారిపోయింది. క్రిందికి త్వరగా దిగి ఆ గడియారం క్రింద పడకుండా పట్టుకోవాలి" అంటూ మళ్ళీ బయలుదేరాడు.

మిత్రుడు ఆశ్చర్యంతో నోరు తెరిచి, "భలేవాడివి! అది ఈ పాటికి క్రిందపడి పగిలిపోయి వుంటుంది" అన్నాడు రామారావు భుజం పట్టుకుని.

"అబ్బే. నీకు తెలీదు. అది అప్పుడే క్రిందపడదు. నా గడియారం చాలా స్లో!" అంటూనే పరుగెత్తుకు వెళ్ళాడు రామారావ్.

* * *

"నాన్నా, నేను సురేష్‌నే పెళ్లి చేసుకుంటాను" అంది సుగుణ వాళ్ళ నాన్నతో. ఆయన లక్షాధికారి.

"ఎవర్నయినా పెళ్లిచేసుకోగాని, ముందర అతని బ్యాంక్ బ్యాలెన్స్ ఎంత? ఆస్తెంత? చెప్పు చాలు" అన్నాడు తండ్రి.

"అదేంటి నాన్నా!"

"అదంతేనమ్మా! నేను నీ మంచికోరేవాణ్ణి గనక, అలా అడుగుతున్నాను."

"నాన్నా! సురేష్‌కూడా నా మంచి కోరేవాడే. మే మిద్దరం ముందర కల్సుకున్నప్పుడు అతను ఇలాగేఅడిగాడు. మీ నాన్నగారి బ్యాంక్ బ్యాలెన్స్ంత? ఆస్తెంత?" అని అంది కూతురు వుత్సాహంగా చప్పట్లు కొడుతూ,

—మల్లాది వినాయకశర్మ, విజయవాడ.

